# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

3-3-67 * 40 పైసలు







త్వరలో!

శరత్ బాబు అమూల్యకథకు నూతన రూపకల్పన.

ప్రత్యగాత్మ సమర్పించు... వాసు మూవీస్ వారి

# మా  వదిన

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: **ప్రత్యగాత్మ**

నిర్మాతలు: **బాబూరావు-ప్రసాద్**

సంగీతం: అశ్వత్థామ • కెమెరా: యం.కె.రాజు • పూర్ణా రిలీజ్



STUDIO Ketha

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ది. 17—2—67 నాటి మీ(మా) వారపత్రిక చదివినాము. చాల బాగుంది. ముఖచిత్రం అందంగా వున్నది. లోపలి కథలు కూడా మరీ హృదయానికి హత్తుకునేవిగా ఉన్నవి. ముఖ్యముగా శ్రీ ఆర్. వి. ఎస్. రామస్వామిగారు వ్రాసిన 'మమత' కథానిక కరుణారసాన్ని చిప్పిల్ల చేస్తున్నది. శ్రీ ఎం. ఆర్. ప్రసాద్‌గారు వ్రాసిన 'నిర్ణయాలు—నిర్బంధాలు' కథ కూడా మంచి పసందుగా నడిచింది. కాని ముగింపు పట్టుగాలేదు. ఏమైనా మంచి కథ లందించిన మీ (మా) పత్రికకు, అట్టి పత్రికా ముఖమున రచయితలకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఇకముందు కూడా వారి మంచి మంచి రచనలు మీ పత్రికలో ప్రచురించి ఆశేష ఆంధ్ర పాఠక లోకమునకు ఆనందమును కలుగ జేస్తారని ఎదురు చూస్తున్నాము.

పి. వి. రెడ్డి (చిలకలూరు)

## సీరియల్

ఈ వారము (17—2—67) తో పూర్తి అయిన ఉన్నవ విజయలక్ష్మిగారి నవల "అంతస్తులు—అభిమానాలు" అయిపోయింది అని చూడగానే నిజంగా అన్నీలు దూరము అయినట్లు అయింది. శ్రీమతి విజయలక్ష్మి ఈ నవల ఇంత త్వరలో సంపూర్తి అవుతుందని అనుకోలేదు. ఏమైన ఇటువంటి సీరియల్ రాసిన రచయిత్రి, పాఠకులకు అందించిన సంపాదకులు అభినందనీయులు. ఈ నవలలో ఇందిర పాత్ర మరువరానిది. తలచుకొంటె స్త్రీ సాధించలేనిది ఏది లేదని ఋజువు అయింది. త్వరలో ఈ రచయిత్రి కలం నుండి మరియొక సీరియలు పాఠకులకు అందిస్తారని తలుస్తాము.

ఈ సంచికలోనే మరి ఒక వుత్తమ కథ ఎం. ఆర్. ప్రసాద్ "నిర్ణయాలు—నిర్బంధాలు" రామనాథం కూతురు లీలని డబ్బు లేక తల్లి వద్దకు పంపడానికి చివరకు అంగీకరిస్తాడు. ఆ దంపతులు మాట విన్న లీల తల్లితో అన్నమాటలు మరువరానివి. 56వ పేజీలో 3వ కాలము 2వ పేరానుంచి చివర వరకు పదేపదే చదివాను. లీల చేసిన త్యాగం మరువు రానిది. ఇంత రసవత్తరము అయిన కథ ఈ వారం అన్ని కథలోకి వుత్తమం అయినది.

"జీవవాహిని" కథ రాజు—7 కొడుకులు కథలా వుంది.

తిటవర్తి అనసూయ శరభరాజు (రాజోలు)

* * *

అంతస్తులు అభిమానాలు చాలా బాగుంది. ఇందిర పాత్ర మటుకు పత్రికకు వన్నె తెచ్చింది. ఇంత మంచి సీరియల్స్ ప్రచురించిన మీకు, రచయిత్రి ఉన్నవ విజయలక్ష్మి గారికి నా హృదయ పూర్వక నమస్కారములు.

పర్వ అనూరాధ (సింగారం)

కొత్త సీరియల్ కథ "జాహ్నవి హైమవతులు" అన్న కథ చాల బాగుగా యున్నది. జాహ్నవికి ఐదు నెలలు పడిందని (హైమవతి తల్లి) సీతమ్మ చెప్పడంతో హైమవతికే కాదు ఈ సీరియల్ చదువు ప్రతి పాఠకుడు కూడ నమ్మలేడు. సీరియల్ రచించిన సి. ఆనందరామం గార్కి నా అభివందనములు. ఇటువంటి క్రొత్త క్రొత్త సీరియల్స్ (మా)పత్రికలో ప్రచురించినందులకు మీకు నా కృతజ్ఞతాభి వందనములు.

డి. పాండురంగం (ద్రోణాచలం)

* * *

సీరియల్ "అంతస్తులు—అభిమానాలు" చాల బాగుంది. ముగింపు అనుకున్నట్టుగానే ముగిసింది. స్త్రీ అయినా ఇందిర ధైర్యంతో జీవనగమనాన్ని చక్కగా దిద్దుకుని విజేత కాగలిగింది. అటువంటి విషమ పరిస్థితుల్లో క్రుంగిపోకుండా చదివిన చదువును సార్థకం చేసుకుని ధైర్యంగా ముందుకు రాగల స్త్రీలు తక్కువ. సంఘం రానివ్వదు కూడ. అటువంటివారికి యిది ఒక మచ్చుతునక. అలా ధైర్యం చేయగలిగింది కనుకనే ఇందిర తన ఆశయాన్ని నెరవేర్చుకలిగింది. రచయిత్రి ఉ.విజయలక్ష్మిగారు చక్కని ఉదాహరణగా రాశారీకథని. వారికి మా అభినందనలు. సినిమా నటీనటుల రచనలు 'నా విదేశయాత్ర' (జమున) పద్మనాభంగారి "ఎందుకు" శీర్షిక, శ్రీమతి విద్యగారి వ్యాసాలు చాల బాగుంటున్నాయి. ఇవి పత్రికకు ఆణిముత్యాలనవచ్చు. విద్యగారి వ్యాసాలు చాల ఉపయోగకరంగా వుంటున్నాయి. "ఎందుకు" శీర్షిక బాగా నవ్విస్తోంది.

ఎ. భానుమతి (హైదరాబాద్)

* * *

మీరు ప్రచురించిన 'అంతస్తులు—అభిమానాలు' మామూలుకథ అయినప్పటికి ఒడుపుతో చకచకా నడిచింది. రచనలో ప్రదర్శితమైన బిగువు, నేర్పు, కథను పట్టుగా నడిపించాయి. సంభాషణలు మృదువుగా ఉన్నాయి. అనవసరమైన వర్ణనలు, గంభీరమైన పదాలు లేనందువలన చదువుతున్నంతసేపు 'హాయి' అనిపించింది. ప్రతి సంఘటనలో సాధారణత్వం, సహజత్వం కనిపిస్తున్నాయి. ఇంత చక్కని నవల వ్రాసిన ఉన్నవ విజయలక్ష్మి గార్కి నా ధన్యవాదములు.

క్రొత్త నవల 'జాహ్నవి హైమవతులు' మొదట్లోనే చాల బాగుంది. ముందు ముందు ఏమి జరుగుతుందోననే ఉత్కంఠత పాఠకులకు కలిగించాయి. రచయిత్రి రచన శైలి బాగుంది. ఇంతకుముందు ఆనందరామంగారి నవలలు చదివివున్న పాఠకులు ఈ క్రొత్త నవల కూడ చాల బాగుంటుందని ఆశించుటలో ఆశ్చర్యం, అతిశయోక్తి లేవు. 17—2—67 వారపత్రికలో ప్రచురించిన కథానికలలో 'వెచ్చని కన్నీరు' ఒక్కటే బాగున్నది. కథ మామూలుదైనా, రచనలోవున్న హాస్యం, చమత్కారంవలన 'బాగుంది' అనిపిస్తుంది.

రేవతి (రాజమండ్రి)

* * *




# ప్రజలు ఎన్నుకొన్నారు

బ్రూక్ బాండ్ A-1 డస్ట్ టీ—ప్రశస్తమైన తేయాకులను ఏంచి బ్లెండ్ చేయబడింది. అద్భుతమైన సువాసన, అపూర్వమైన రుచి...ఓ ప్యాకెట్ A-1 డస్ట్ ఎన్నోకప్పుల కమ్మని టీ నిస్తుంది. అసంఖ్యాకులు సేవించి ఆనందించే బ్రూక్ బాండ్ A-1 డస్ట్ టీని మీరూ సేవించండి.

BB 346

శ్రీ. ఆనందారామం 'జాహ్నవి హైమవతులు' ప్రారంభంలోనే అద్భుతంగా వున్నది. నాకు ఇంకనూ చదవాలనిపించుచున్నది. 'రచయిత'కు ధన్యవాదములు. 'వెన్నునికన్నీరు' యత్రం సెట్టి శాయిగారి కథ కూడ బాగున్నది.

పి. యేసురత్నం (రేమిడిచర్ల)

* * *

ఆంక్షలు—అభిమానాలు సీరియల్ నవల సెటుత్వముతోవుంది. ముగించుచున్నందుకు చాల విచారకరంగా ఉంది. ఉన్నవ విజయలక్ష్మిగారికి హృదయపూర్వక అభినందనలు.

వడ్లమాని లక్ష్మీనారాయణ (వ్యాడల్లి)

* * *

ఉన్నవ విజయలక్ష్మిగారు వ్రాసిన "ఆంక్షలు—అభిమానాలు" చాలాబాగుంది. ముగింపు కూడా అనుకున్నట్లుగానే సరిపోయింది. పేరుకు తగ్గట్లు కథ బాగా తీసుకువచ్చారు. కథలో ఎక్కువ సస్పెన్స్ లేకపోయినా చదువుతున్నంతసేపు హాయిగా ఉండేది. సీరియల్ అంతా కూడా సౌమ్యంగానే ఉంది. ఇందిర అంత నిగ్రహించుకొని పిల్లలను పైకి తీసుకురావడం చాల బాగుంది. రచయిత్రి





# ఉత్తరాలు

ఉన్నవ విజయలక్ష్మిగారికి నా ధన్యవాదాలు.

కుమారి బాలాంత్రపు అనంతలక్ష్మీ సత్యవతీదేవి (అమలాపురం.)

## కథలు

ఇస్మాయిల్‌గారి 'సముద్రం' చదివిన అనంతరం వ్రాస్తోన్న ఉత్తరం ఇది కథకంటె కథ చెప్పిన తీరు బాగుంది. చదువుతున్నంతసేపూ పరిసరాల్ని మరచిపోయేలా చెయ్యగలిగే ప్రభావం ఈ కథానికలో గమనించగలిగాను.

ఎంతో కాలానికో ఒకటి తప్ప తలచే కథల వ్రాయుటకు ఇస్మాయిల్‌గారు రచనలచే ఆకర్షింపబడే అసంఖ్యాక పాఠకుల్లో నే నొకణ్ణని తెలియజేయగలందులకు సంతోషిస్తూ.

తెన్నేటి రామారావు (రూర్కెలా)

* * *

17—2—67 పత్రికలో ప్రచురించిన "వెన్నుని కన్నీరు" కథ చదివాను. చదువుతున్నంతసేపు యీ లోకంలో లేననుకోండి. చాలా బావుందంటే. అంత మంచి కథని రాసిన రచయితకు నా అభినందనలు. ఇంత మంచి కథ యిదివరకెప్పుడూ ఏ పత్రికలో ప్రచురించ లేదంటే అతిశయోక్తి కాదు. ముగింపు నాకు చాలా నచ్చింది.

విజయకుమార్ (మద్రాస్)

* * *

శ్రీ అరిగే రామారావుగారి "నన్ను కారెక్కించు కోవూ" చదివిన తర్వాత యిది వ్రాయాలని పించింది. మానవుడు సంతోషంగ జీవించగల్గటమనేది ఒక వరం. తను మనస్ఫూర్తిగా ప్రేమించి ఆరాధించిన భార్య తనని నిరాదరణ చేసి క్రూరంగ తననుండి దూరంగావెళ్ళటం. అది పతితగ జీవించటం హృదయసౌకుమార్యం గల ఏమానవుడూ భరించ లేడు. పైకి ఎంత సంతోషంగ కనిపించిన శ్రీరంగం మాష్టారు అంతరాంతరంగ ఎనలేని వ్యధనే అనుభవించి వుంటారు. ప్రతినిత్యం లోలోన రంపపు కోత అనుభవిస్తూ అతడు బ్రతికే దానికంటే అలాంటివారికి చావులోనే ఎంతో ఆనందం వుంది రోజురోజూ బ్రతికుండే చనిపోతున్న వాడిని ఒక్కసారే చనిపోయేటట్లు చేసినాడు ఒక విధంగ పుణ్యమూర్తులే. దీనిలో ఖేదపడవలసిన అవసరం ఏమీ లేదు. శ్రీ రంగంతోపాటు ప్రజల భీతిని కూడ దూరం చేసినందుకు అభినందించాలి. ఇది జరిగిన కథ అయినా లేకపోయినా కూడ నాకు చలా నచ్చింది.

ఎ. రాజబాబు (బందరు)

* * *

"అప్పులోని ఆంతర్యం" మా కుటుంబాన్ని ఎంతో సరిదిద్దినది. ఆ కథ ఎంతో బాగుంది. రచయిత్రి టి. శ్యామలా దేవిగార్కి నా ధన్యవాదములు.

టి. సన్యాసిరావు. (బొబ్బిలి).

* * *

3—2—67 సంచికలో "శ్రీ సాహితీగారు వ్రాసిన "పరంధామయ్య" కథ సాగుతూ ....సాగుతూ ఓ చోట "—పరంధామయ్యకు ఆరుగురు సంతానం అని తెలిపారు. వారు వరసగా అందరికంటే పెద్దది విజయ. విజయ తరవాత సరోజ. తరువాత జోగారావు, ఆతరువాత సన్యాసిరావు. సన్యాసిరావు తరువాత సూర్యారావు, తరువాత మొన్న పుట్టింది. రెండు సంవత్సరాల క్రితం సుశీల అని తెలిపారు. మరోచోట పరంధామయ్య తన యింటికి చేరుకో బోయేసరికి కొడుకు జోగారావు పెదకన్న చేతులలో పట్టుకొని ఉన్నాడు. ఎక్కడికో బయలుదేరినట్లున్నాడు. వాడికి కొద్ది దూరంలో "జయ నెత్తుకు నిల్చుంది, తన భార్య మీనాక్షి" అని వ్రాశారు. మొదల ఆరుగురు సంతానం అన్నారు. వారి వారి పేర్లు తెలిపారు. మరి ఈ ఏడో సంతానం పొరపాటు అంటాను. మరి జయ ఎవరు? తెలుపుతె సరదా లేదా పొరపాటంటే సరిపోతుంది.....?

ఎస్. బాల్‌రాజ్ (లాలగూడ)

## కార్టూను

10—2—67 సంచికలో పాఠకులు జయదేవ్ గారి కార్టూన్ వ్రాసిన విమర్శను చూశాను. పాఠకులు మళ్ళి ఒకసారి ఆకార్టూనును ఓ.పికతో చూస్తే తమ తప్పును తెలుసుకుంటారు. ఆవ్యక్తి చేతులో వుంది వేతిక్రం. దానిని క్రికెట్ బ్యాట్‌గాని, లేక హాకీ స్టిక్‌గాని వూహించడము పాఠకుల దృష్టి లోపమే. ఎప్పుడైనా క్రికెట్‌లో బాట్‌ను గాని లేక హాకీస్టిక్‌ను చూసిన వారు యిలాంటి పొరపాట్లు చేయరు. "తప్పు లెంచువారు తమ తప్పు లెంచరు" అను సూక్తి వీరివిషయంలో మాటికి నూరుపాళ్ళు నిజం. తమ వ్యాఖ్య సమంజసంగా లేక పోగా కార్టూను అవమంజసమైనాగా వుందన్నారు. సెన్స్ ఆఫ్ హ్యూమరే అర్ధం చేసుకోలేనివారికి యిలాటి దిక్కు సందేహాలే కలుగుతాయి.

బాల ప్రియ (విజామాబాద్)

## ఎందుకు

"మీరు రెండువారాల క్రితం ప్రచురించిన "ఎందుకు?" శీర్షిక. వద్మనాభంగారు చాలా చమత్కారంగా సమాధానాలు చెబుతున్నారు. ఈ వారం మాత్రము బహుమతి పొందిన ప్రశ్న, దాని సమాధానము చదువరులకు చాలా విజ్ఞానదాయకంగా నున్నది. అయితేను భావము చమత్కారముగానే యున్నది".

వెన్నాల రాధాకృష్ణమూర్తి (హైదరాబాద్)

## వ్యాసాలు

"నా విదేశయాత్ర" జమునా రమణారావు గారి వ్యాసము చాలా బాగున్నది. కన్నులకు కట్టినట్లు చిత్రించి వ్రాస్తున్నారు. వారికి నా కృతజ్ఞతాభివందనలు హృదయపూర్వకముగా అందజేస్తున్నాను.

ఎస్. ఎన్. ఎస్. కె. (రేపల్లె)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శుక్రవారం: 3—3—'67
పరాభవనామ సం॥ మాఘ బహుళ అష్టమి
సంపుటము : 59 సంచిక : 25
స్థాపితము :
1908
ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
9, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


చందా వివరాలు : 10-2-1967 మొదలు

భారతదేశం

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |
| విడిప్రతి | 0.40 |

ఇతరదేశాలకు

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రరచన: శ్రీ కె. శేషగిరిరావు.











సి. కృష్ణ

# సాధారణ ఎన్నికలు - పార్టీ ప్రచారాలు

భారత ప్రజలు ఇప్పుడు సాధారణ ఎన్నికల సంరంభంలో మునిగి తేలుతున్నారు. ఒక విధంగా అనుకుంటే, శ్రీ నెహ్రూ లేకుండా ఆయన సిద్ధాంతాల్ని మూడి పెట్టకుండా జరుగుతున్న ప్రప్రథమ సాధారణ ఎన్నికలు ఇవి. పూర్వం ఎన్నికల్లో వలె, నియామకుల సముదాయం యొక్క అభిప్రాయాన్ని తెలుసుకోడానికి కాంగ్రెసు ఈసారి ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు! అంతెందుకు? తీవ్రంగా తర్జన భర్జనలు జరుపుకున్న కాంగ్రెసు ప్రణాళికనే మరిచి పోయారు! దేశంలో శాంతిభద్రతలు నెలకొనాలంటే తాము ఎటువంటి హామీలు ఇవ్వకుండా తిరిగి కార్యాలయాల్ని ఆక్రమించుకోవాలని కాంగ్రెసు నాయకులందరూ ఏకధాటిగా చెబుతున్నారు. ముందుగా అభయమిచ్చి, ప్రజల్ని నమ్మించి, వోట్లు సంపాదించిన తర్వాత పరిపాలనలో అంతగా స్థిరత్వం ఉండదని గట్టిగానొక్కి చెబుతున్నారు! ప్రజల్లో కోరికల్ని పెంచకుండా నిలబడి సాగిస్తే అదే ఆర్థిక స్థిరత్వానికి నాంది అవుతుందనీ, భారతదేశపు ప్రజాస్వామ్య ఉద్యమంలో ప్రజలకు కొంత విశ్వాసం కలుగుతుందనీ కాంగ్రెసు నాయకుల అభిప్రాయం! కుల, వర్గ, వ్యక్తిగత తత్వాలకు పారంపార్యంగా మళ్లీ ఎక్కువ ప్రాతినిధ్యం లభిస్తూనే వుంది!

దేశ పురోగమనానికి అడ్డొచ్చే సమస్యలు ఎన్నో ఇప్పుడు మన ముందున్నాయి. ఏ ఒక్క సమస్యా పరిష్కారానికి తగిన చర్య తీసుకోలేదు. కనీసం ఆ సమస్యను ఫలానా విధంగా పరిష్కరిస్తే బాగుంటుంది, అని ఆలోచన అయినా చేయలేదు. ఇటువంటి సందిగ్ధ పరిస్థితిలో ఎన్నికలు ఏర్పాటయ్యాయి. దేశం ఎన్నికల్లో పాల్గొనేముందు, కాంగ్రెసే మరల అధికారానికి వచ్చినట్టయితే తర్వాతి ప్రధాన మంత్రి ఎవరయి ఉంటారు? అని ఒక అభిప్రాయం ఏర్పరచుకొన్నట్టు ఎక్కడా కనిపించదు.

ఇటువంటి ఏర్పాట్లలో, ముందుగానే ఆలోచించుకుని ఉండడంలో, కొంతవరకు రాష్ట్రాలు మెరుగ్గా వున్నాయి. నాయకులు అధో రాజకీయ, సామాజిక వ్యాసంగాల మంచెల మీద నిలబడి ఒకరినొకరు ఎత్తి పొడుచుకుంటూ, ప్రజలు తనకు తామే పరిణామ ఫలితాల్ని గ్రహించుకునేలా చేస్తున్నారు. బలాబలాలు ప్రదర్శిస్తున్న ముఠాతత్వాల ద్వారా నాయకులు తమ తమ ఆధిక్యతను ప్రజలకు ఎరుక పరుస్తున్నారు. దీని ద్వారా అధికారం ఎవరు స్వీకరించేదీ తెలిసిపోతూనే ఉంది. ఇది, ఇప్పటి ఎన్నికలకు ముందు అసెంబ్లీ స్థానాల స్థాయికి రాష్ట్ర వారీ రాజకీయాల పరిస్థితి.

కాని, పార్లమెంటుకు సంబంధించిన ఎన్నికలు మాత్రం గుడ్డెద్దు చేలో బడినట్లు జరుగుతున్నాయి. కేంద్రంలో రాబోయే అగ్రనాయకత్వాన్ని బట్టి ఇప్పటి అభ్యర్థుల భవిష్యత్తు ఆధారపడి వుంటుంది. ఆ అగ్రనాయకత్వాన్ని స్వీకరించే వారెవరై వుంటారో ఇతమిత్థంగా ఎవరూ వూహించలేకపోతున్నారు. పార్లమెంటు అభ్యర్థుల్లో చాలమంది ధైర్యం కోల్పోతూ ఉండడానికి కారణం అదే.

కాంగ్రెసు మరల రాజ్యం చేస్తుందనే విషయం నిస్సంశయం. తగిన మెజారిటీతో కాంగ్రెసు తిరిగి అధికారాన్ని హస్తగతం చేసుకుని కేంద్రాన్ని ఆక్రమించుకొంటుందనేది నిర్వివాదాంశం. కేంద్రానికి సంబంధించినంతవరకు అధైర్యపడ నవసరం లేనే లేదు. ఎటొచ్చీ రాష్ట్రాల్లో ముఠాతత్వాల స్థితిని అవలోకిస్తున్నప్పుడు మాత్రమే కొంచెం అపనమ్మకం తోస్తూ వుంది. ఎన్నికల్లో ప్రత్యర్థి బలమే ఇందుకు కారణంకాదు. పార్టీల్లోను, వ్యక్తుల్లోను, వ్యతిరేక శక్తులు చోటు చేసుకున్న కారణంగా ఫలానా పార్టీకి అధికంగా బలం వుంది అని చెప్పడానికి అవకాశం లేకపోతోంది. ఒకే పార్టీలో విభిన్న వర్గాలు వృద్ధి చెందుతున్న కారణంచేత రాష్ట్రాల పరిస్థితి అస్తవ్యస్తంగా తయారయింది.

ఈ ఎన్నికల్లో, 21—40 సంవత్సరాల వయస్సు వున్న వారు మొత్తం 16 కోట్ల మంది పాల్గొన్నారు. భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత జన్మించిన 10 కోట్ల మందిని కూడా ఇందులో కలుపుకోవచ్చును. వీరు మహాత్మాగాంధీ గారి గురించి ఎప్పుడైనా విని వుండవచ్చునుగాని, ఆయన ఆశయాలు, సిద్ధాంతాలు అంతగా అవగాహన చేసుకుని ఉండరు. రాజాలు, రాణులు, మాజీ మిలిటరీ వారు ఎన్నికల్లో ముఖ్యపాత్ర వహించుతూ వుండడం గమనించ తగింది. గత కొన్ని సంవత్సరాలుగా కాంగ్రెసులో నీతినిజాయితీలు క్షీణించిపోవడానికి కారణం పార్టీ రాజకీయాల్లోని ముఠాతత్వాలే. క్రిందటి మాసంలో శ్రీమతి ఇందిరాగాంధి ఉపన్యాసాన్ని దృష్టిలో ఉంచుకున్నట్టయితే, 'కాంగ్రెసు, లేదా కేయాస్' వైఖరిని భారతదేశం అర్థం చేసుకోవలసి వుంటుంది. ఎవరు పరిపాలన సాగించినా మొట్టమొదట, దేశానికి శాంతిభద్రతలు ముఖ్యం. కాంగ్రెస్ పరిపాలనలో మాత్రమే శాంతిభద్రతలు తగిన స్థితిలో ఉంటాయని ఆమె అభిప్రాయంలా ఉంది. ప్రజలు, కడుపులో నీళ్లు కదలకుండా హాయిగా వుండాలంటే దేశం భద్రంగా ఉండాలి. దేశానికి స్థిమితం చేకూరాలంటే కాంగ్రెసు రావాలి. కాంగ్రెసు రావాలంటే వోట్లు ఎవరికివ్వాలి? కాంగ్రెసుకా? కేయాస్‌కా?—ఇందిరాగాంధి చక్కని పద్ధతినే అవలంబించారు!

*   *   *

## కంచే చేను మేస్తే...

స్వప్రయోజనాల కోసం ఎన్నికల్లో దుర్మార్గాన్ని అవలంబించినట్టయితే, అటువంటి వ్యక్తులపై మనదేశంలో ఒక న్యాయనిబంధన ఉంది. ఒక శిక్షా స్మృతీ ఉంది. అధికారంలో ఉన్న పార్టీ బలం కోసం ఎన్ని దుర్మార్గాలు పట్టినా వాటికి ఒక అడ్డూ అదుపూ అంటూ లేకుండాపోయింది. ఇందుకు కాంగ్రెసు తలవంచవలసి వస్తోంది.

కాంగ్రెసు స్థిరంగా అధికారంలో ఉండడానికి ఏమేమి చేస్తోందో, ముఖ్యంగా వచ్చే అయిదేళ్లు అధికారం స్వీకరించడానికి ఎలాంటి మార్గాలు వెతుకుతున్నదో తెలియపరచడం వార్తాపత్రికల విధి. ఫిబ్రవరి ఎన్నికల మాసం; దాదాపు అన్ని రాష్ట్ర ప్రభుత్వాలూ పనివాళ్లకు కరువుభత్యం పెంపు చేసేశాయి. కరువుభత్యాన్ని జీతంతో కలిపి వేసే విషయం మీద ఆలోచిస్తున్నామని కేంద్రప్రభుత్వం మరో ప్రకటన చేసింది. అన్ని ధరలతోనూ పోటీ వేసుకుంటూ పంచదార ధర పెరిగిపోతోంది!

ఇవన్నీ ప్రమాణికాలు, కంటికి కనిపిస్తున్నవీను.

హతుని డొక్కలో కత్తితో పొడిచింది నువ్వేనని...

ఎవడో కూసింది? వాడి డొక్క కూడా చీరుస్తాను

ఇలాంటి ఓట్లను సంపాదించడం కోసం వేసిన పథకాలు దృగ్గోచరం కానివి ఇంకొన్ని ఉన్నాయి. శ్రీయుత మొరార్జీ దేశాయ్ ఇటీవల దక్షిణాది యాత్ర సాగించారు. కాని, హిందీని గురించి మచ్చుకు ఒక ముక్క కూడా ముచ్చటించలేదు! శ్రీమాన్ గుల్జారీలాల్ నందా నవంబరు ఏడవ తేదీన ఢిల్లీలో జరిగిన సంఘటనల గురించి 'ఆరోజున ఆందోళనను ఆహ్వానించాను అంటే గోవధ నిషేధాన్ని సమర్థిస్తున్నట్టే గదా!' అని ఒక అభిప్రాయం వెలిబుచ్చారు. వారు దేశీయాంగమంత్రిగా ఉండగా ఇదే ప్రకటనను మరో విధంగా వెలువరించడం జరిగింది. ఇదివరలో ఆయన మీదకు వచ్చిన అభియోగాన్ని, ఓట్ల కోసం ప్రయోగించారు!

కార్యాలయాల్ని అధిష్ఠించి ఇన్నేళ్ళ కాంగ్రెసు ఏంత చేసిందో చెప్పద్దున్న మరో పార్టీ అధికారాన్ని చేజిక్కించుకున్నా ఇంతే చేస్తుంది!

* * *

## ప్రణాళికాసంఘ ముఖ్య శ్రీ ఢేబర్

ఇటీవల ఖాదీ గ్రామోద్యోగ శాఖ అధ్యక్షులు శ్రీ యు. యన్. ఢేబర్ 'కాంగ్రెసు ఎకనామిక్ రెవ్యూ'లో ప్లానింగ్ తీరుతెన్నుల్ని గురించి ఒక వ్యాసంలో చర్చించారు. బహుశా ఆయన ప్లానింగ్ కమిషన్‌లో సభ్యులవడానికి ప్రయత్నాలు చేస్తున్నరనుకుంటా!

ఆయన దృష్టిలో, సాంఘిక ఆర్థికాభివృద్ధి ఉద్దేశాలని నిజజీవితానికి అనువదించుకోవడానికి 'ప్లానింగ్' అనేది ఒక సాధనం. ఇప్పుడున్న ఆర్థిక క్లిష్టత, ప్లానింగ్ వల్లగాని, ప్లానింగ్‌లోని నిస్సారత్వం వల్లగాని, కాదని ఆయన అన్నారు. చైనా, పాకిస్తాన్ దేశాల దురాక్రమణలను ఎదుర్కొంటున్నందు వలన, కరువు కాటకాల నెదుర్కొంటున్నందు వలన ఆర్థిక పరిస్థితి స్తంభించిపోయిందన్నారు. ఇంకా, ఇలా అన్నారు:

"భారతదేశ ఆర్థిక పరిస్థితికి ప్రమాదం సంభవించడం నిజం. ఈ అపాయాన్నుంచి తప్పించుకుని బయటపడాలంటే వివిధరంగాల మీద కట్టడి తీసుకురావలసి ఉంటుంది.

ఆర్థిక ప్రమాణాన్ని పెంచడానికి తగిన చర్య తీసుకోవడం ఇప్పుడు ముఖ్యం. ఆ చర్యను 'తీవ్రంగా' తీసుకోవాలి. తీవ్రమనే మాటను నేను శాస్త్రీయంగా ఉపయోగించడం లేదు. 'అతి' ఉద్దేశంతోను. మన ప్రణాళికలలో వ్యయాన్ని ప్రతి దశలోను పొదుపు చేసుకోవాలి. అప్పుడు ఆర్థిక స్థితి బాగుపడడానికి ఎంతయినా అవకాశం ఉంది. ఆహారాన్ని వృధ చేయడం దగ్గర్నుంచి అస్థిరంగా ఉన్నను దుబార జరగకుండా కట్టుదిట్టమైన చర్య తీసుకోవాలి. అవసరమైన ఉత్పాదనతోపాటు, ప్రభుత్వ, ప్రయివేటు రంగాల్లో దుర్వినియోగమైన ఖర్చు జరగకుండా చూడాలి. ప్రభుత్వము, అధికారులు, పరిశ్రమలు, అలాగే ప్రయివేటు రంగాలు అడుగడుగునా వెనుదిరిగి చూసుకొని ఖర్చును కుదింపు చేసుకోవాలి. దేశంలోని అన్నిశాఖలూ ఇలా అక్షరాలా పాటించినప్పుడు మన ఆర్థిక విధానం చక్కబడుతుంది.

ఆర్థిక క్లిష్టత దృష్ట్యా రూపాయి విలువ పడిపోయింది. 'స్వదేశీని ప్రోత్సహించడమే ఈ రూపాయి విలువ తగ్గింపులో ముఖ్యోద్దేశం. ఆర్థిక స్తోమతను సంపాదింప జేసుకొనడానికి ప్లానింగ్ మార్గదర్శకం కావాలి. ప్లానింగ్ నిరంతరమైన పద్ధతి. ఒక పథకాన్ని సమగ్రంగా నిర్వర్తించకుండా అసంపూర్ణంగా వదిలి వేయడానికి ఆర్థిక ప్రతిష్టంభన కారణం కాకూడదు. అటువంటప్పుడు చేసిన పని అంతా బూడిదలో పోసిన పన్నీరే. రక్షణశాఖకు ఎప్పుడూ ప్రాముఖ్యత నిస్తుండాలి. దేశం సాధ్యమయినంత వరకు స్వశక్తి మీదనే తన ఉద్దేశాల్ని నెరవేర్చుకోడానికి సిద్ధపడి ఉండాలి. లేదా పరువు ప్రతిష్ఠలకు భంగం వాటిల్లకుండా, స్నేహసానుభూతులతో సహకారాన్ని అందించగల విదేశాల్నుంచి సహాయం పొందాలి. అతిముఖ్యంగా, దేశంలోని ఆర్థిక శక్తినే అనుకూలమైనంతవరకు కూడబెట్టి ఇతరదేశాల మీద ఆధారపడకుండా ఉండడానికి ప్రయత్నం చేయాలి."

శ్రీ ఢేబర్ ఈ క్రింది నాలుగు సూచనలను చేశారు:—

1. "తీవ్రతను అధిగమించడానికి, పరిమితి మేరకు ఒక జాతీయ విధానాన్ని అమలుపరచాలి.

2. పరిపాలన పరంగా పటిష్ఠం కావడానికి ప్రణాళికను అమలు పరచడంలో మంత్రులకు ఎక్కువ బాధ్యతను ఒప్పజెప్పాలి.

3. రెండు రకాలయిన ప్రణాళిక తయారు చేయాలి. దేశంలోని ఆర్థిక స్తోమత ననుసరించి, మన ఉత్పత్తులు, ఎగుమతుల ద్వారా వచ్చే ఆదాయాన్ని అనుసరించి, విదేశాలు ఇదివరలో ఇచ్చి వున్న హామీల ననుసరించి ఒక పథకం వేసుకోవాలి. ఇక రెండవది పూర్తిగా విదేశాల మీద ఆధారపడిన పథకం.

4. ప్రణాళికలో మొదటిభాగం పూర్తిగా అత్యవసర పరిస్థితులను ఎదుర్కోతగిగ ఉండాలి. ప్రజల తక్షణ కష్టసుఖాల నాలోచించేదిగా ఉండాలి."

శ్రీ ఢేబర్ ఇప్పుడు అగ్రస్థానం వహించిన శాఖకు భారతప్రభుత్వం ఒకకోటి రూపాయలు గ్రాంటుగాను, మరో 50 లక్షల రూపాయలు అప్పుగాను ఇచ్చి ఉన్నది.

భారతదేశంలో ఇప్పుడు ఇంతటి ఆర్థిక ప్రతిష్టంభనం ఏర్పడడానికి కారణం చైనా, పాకిస్తాన్‌లు మనమీద విరుచుకు పడటమని శ్రీ ఢేబర్ అన్నమాట అబద్ధం. రెండవ ప్రణాళికకు ఎప్పుడైతే విదేశీ మారక ద్రవ్యం తగినంత లభించలేదో, అప్పుడే మన భారత ఆర్థిక పరిస్థితి కుప్పకూలి పోయింది. ఫలితంగా బొప్పికట్టింది. అప్పటి నుంచి భారతదేశం విదేశాల మీద ఆధారపడుతూ వస్తోంది.

శ్రీయుతులు అశోక్ మెహతా, ఢేబర్ గార్ల గుజరాతీ సమ్మేళనంతో ప్లానింగ్ కమిషన్ ఉద్ధరింపబడుతుందేమో చూడాలి!

## లోకం పోకడ

—భువనేశ్వర్‌లో డా. హరేకృష్ణ మెహతాబ్ తాము శ్రీమతి ఇందిరిగాంధీమీద అక్కడ కొందరు విసిరిన రాళ్ళు తమని ఉద్దేశించి విసిరినవి కావని నమ్ముతున్నామన్నారు. "శ్రీ బిజూపట్నాయక్‌పట్ల ప్రజల అయిష్టమే వారిని ఆయనమీద రాళ్ళు రువ్వటానికి కారణం అయివుంటుంది"ని డా. మెహతాబ్ అన్నారు.

పి. టి. ఐ. వార్త. (12—2—67)

* * *

—హైదరాబాదులో ఒక 'రాష్ట్రీయ పిల్లా జర్నల్'లో జనసంఘం అభ్యర్థి ద్వితీయ కనీస వేతనాలని గురించి మాట్లాడవలసి వచ్చింది. మైసూరులో మరొక జనసంఘం అభ్యర్థి బియ్యం ధరని గురించి మాత్రమే మాట్లాడుతున్నారు. (ఈ పక్షం) వారి ముఖ్య ప్రచార ప్రయత్న నిమిత్తమయిన కరపత్రంలో ఏడు 'పాయింట్లు' ఉన్నాయి. వీటిలో చివరి పాయింటులో అయిదవ వంతు మాత్రమే గోసంరక్షణానికి చెంది ఉంది.

'స్టేట్స్‌మన్' పత్రికలో డి. హెచ్. జాన్సన్

* * *

—ఏది ఎలా ఉన్నా సోవియట్ ప్రతికూలత ప్రపంచమంతటా సామ్రాజ్యవాదానికి 'రియాక్షన్'కి ఆయుధంగా ఉపయోగ పడుతూ వచ్చిందని గట్టిగా నొక్కిచెప్పవచ్చు

మ్యానిక్ (12—2—67.)

* * *

—తాము గోవధ నిషేధ ఉద్యమాన్ని నిజంగా ఎన్నికలలో లాభంకోసం ఉపయోగించాలని గనుక నిజంగా కోరుకుంటే కాంగ్రెసుని 'పెద్ద ఎత్తున ఇరకించగల'మని పూరీ జగద్గురు శంకరాచార్య అన్నారు.

పి. టి. ఐ. వార్త (16—2—67)










గోల్డ్‌ఫింగర్ చేరిన నో గంట తర్వాత బాండ్ లీ టూకే— వచ్చాడు. అతనికి కారు వెళ్లిన దారిని అనుసరించడం కష్టమన్పించలేదు.

'నిస్సందేహంగా మీరిటువెళ్లొచ్చు. ఇదే అబేవిల్లీ వెళ్లే రోడ్'

మధ్యలో బాండ్ లాటరీవేసి పారిస్‌వైపు మళ్ళాడు. అది సరైన ఊహ కాదు........

'అరె! హోమర్ దూరమై పోతున్నట్లుందే రోయెన్ రోడ్ గుండా పోవాలి.........'

తర్వాత ఆర్లీన్స్ రోడ్‌లో ఉన్న ఎవ్‌రెక్స్ ఛార్ట్రస్‌వద్ద హోమర్ శబ్దం పెద్దగా విన్పించసాగింది.

'దొరికాడు. ఈ రాత్రికి ఆర్లీన్స్‌లో ఆగుతాడన్నమాట. తర్వాత........?'










మర్నాడు ఉదయం ఆర్లీన్స్ నుంచి మళ్లీ వేట ప్రారంభం అయింది. గోల్డ్‌ఫింగర్ మకాన్ వైపు దారితీస్తున్నట్లు కనిపించాడు.........

'ఇంకెక్కడా కాదు. ఇక్కడే......'

నిదానంగా వెంబడిస్తున్న తనకు ప్రక్కగా ఎవరైనా రావటం చిరాకెత్తించింది బాండ్‌కి......

'ఆ అమ్మాయే. అదే చిన్న స్పోర్ట్స్ కారూ. నిన్న ఫెర్రీఫీల్డ్ ఎయిర్‌పోర్ట్‌లో చూశాను!'

'మూడువందల మైళ్ల తర్వాత వెంబడే ఉండంటే అది కాకతాళీయం కాదు. ఇక్కడేం జరుగుతోంది?'










బాండ్ చికాకు పడ్డాడు. ఆ స్పోర్ట్స్ కారులోని అమ్మాయి కూడా గోల్డ్‌ఫింగర్‌ని వెంటాడుతున్నదా? పరిస్థితులు క్లిష్టంగా తయారవుతున్నాయి....

'క్రింద కెళ్లినట్లున్నాడు. ఆలోచిస్తూ సంగతే విస్మరించాను. అక్కడేం చేస్తున్నాడు?'

'మంచి పిక్నిక్ సరదాలో ఉన్నట్లున్నాడు. ఆకలేస్తోంది, ఏదైనా తినాలి.'

'వాడా బ్రిడ్జికింద ఏం చేస్తున్నాడు? నేను ఊహాగానాలు సాగిస్తూండవచ్చు, కానీ......'










చీఫ్ చెప్పిన విషయాలు గుర్తుంచుకున్నాడు బాండ్. గోల్డ్‌ఫింగర్ స్మెర్ష్‌కి కోశాధికారని ఆయన అన్నాడు........

'బహుశ బంగారపు అచ్చుల్ని బ్రిడ్జికింద దాస్తూండొచ్చు.'

ఇటలీ, స్విట్జర్లాండ్, లియోన్స్‌కి తీసుకెళ్ళ దగినదిగా వుంది. ఫ్రాన్స్‌లో అతి బలమైన కమ్యూనిస్టు సంస్థ అది.........'

గోల్డ్‌ఫింగర్ రోడ్ వెంబడి మాయమవగానే.....
'ఇప్పుడు చూద్దాం.'










బాండ్ బ్రిడ్జి క్రిందికి వెళ్ళి చూశాడు. గుర్తించడానికి వీలుగా, ప్రత్యేకంగా ఉన్న ఈ ప్రదేశం స్మెర్ష్ రహస్య ఏజంట్లకోసం బంగారం ఉంచి వెళ్ళడానికి మంచి అనువైన చోటు........

'ఇక్కడ త్రవ్వినట్లు కన్పిస్తున్నది. అబ్బో చాలా బరువుందే!........'

బాండ్ ఆ అచ్చుమీద ఉన్న మట్టిని దులిపేశాడు........
'చీఫ్ చెప్పింది రైటే— పైన గోల్డ్‌ఫింగర్ గుర్తుకూడా ఉందీ అచ్చుమీద.'










బాండ్‌కి సంతోషం కల్గింది. వాళ్ళందరికీ ఈ దెబ్బతో గోల్డ్‌ఫింగర్ మీద కోపం వస్తుంది.....
'20 వేల పౌన్ల విలువగల బంగారం కోసం స్మెర్ష్ ఎన్నెన్నో వెధవపన్లు చేసి వుంటుంది.'

మకాన్ వద్ద గోల్డ్‌ఫింగర్ కారుని ఓవర్‌టేక్ చేశాడు బాండ్. స్విట్జర్లాండ్ వైపు దారి తీసినట్లు తెల్సుకున్నాడు........
'భలే! ఎక్కడన్నా భోంచేయాలి ఇప్పుడు.'

'అరే! ఈ మాయలమారి పిల్లా, స్పోర్ట్సు కారూ, మళ్ళీ! ఏదో ఒకటి చేయాలి. సారీ, ప్రియతమా నిన్ను ఏడిపించాలి.......'

(ఇంకా ఉంది)



# చివరకు మిగిలేవి జ్ఞాపకాలు

సి. పుల్లారావు

అనూరాధపై నా మనసెందుకింత కేంద్రీకృతమైందంటే నాకు జవాబు తెలీదు. యౌవన ప్రాయంలో యువతీ యువకులు ఎందుకు ప్రేమిస్తారో, ముఖాముఖం ఎదురెదురుగా కూర్చుని ప్రేమ కబుర్లు చెప్పుకుంటూ తనివితీర ఒకరినొకరు చూసుకుంటూ ఆనందిస్తారంటే ఎవరేం చెప్పగల్గుతారు. అదేకదా ప్రేమ రహస్యం. నన్ను గురించి ఏక్షణంలోనైనా ఆలోచిస్తుందో లేదో కాని అనూరాధ రూపం మాత్రం నా హృదయఫలకంపై రంగులు దిద్దుకుని అందంగా వుంది. ఆనాటి ఆమె కనురెప్పల మాటున దోబూచులాడిన స్నిగ్ధత్వం నా కన్నుల ముందు నుంచి తొలగిపోలేదు. మృదువైన ఆమె అధరాల వెనుకనుంచి వచ్చే ఆమె కోయిల స్వరం నా చెవుల్లో మిగిలిపోయింది. సునిశితమైన ఆమె బుద్ధిమంత తనం నా మనస్సులో గుచ్చుకు పోయింది.

అనూరాధ నేను హైస్కూలులో చదివాం. వ్యాపారార్థం అనూరాధ వాళ్ళు మా వూరు రావటం తటస్థించింది. మా ఇంట్లోనే ఒక భాగం అద్దెకు తీసుకోవటం జరిగింది. ఒక్కటే కూతురవటం వలన అతి గారాబంగా పెరిగింది. అయినా చదువులో దిట్టగా, అత్యంత సూక్ష్మబుద్ధిగల విద్యార్థినిగా మాట చతురతగల జాణగా మాష్టర్ల ఆదరణకు పాత్రమయింది.

నేను మూడవఫారంలో అప్పుడే ఆమె కూడా స్కూల్లో చేరింది.

నన్ను స్వయంగా నా మిత్రులు పిరికివాణ్ణని, మందకొడినని పరిహాసం చేస్తుండేవారు. ఏదో ఎడతెగని ఆలోచనలు తేనెటీగల గుంపుల్లా నా మనస్సులో తిరుగాడు తుండేవి ఆ వయస్సులోనే. బడి వదిలిన తర్వాత పిల్లలంతో ఆడుకోటానికి వెళ్ళక కాలువగట్టునున్న సరివితోటలో కూర్చుని అస్తమయ సూర్యుని అందాలు చూస్తూనో లేక కాలువ ఒడ్డున గాలిలోకి ఎగిరి ఆనందంతో ఊయలాడే చేప పిల్లలకు వన్నెగింజలు. విసుగూనూ కాలం గడిపేవాణ్ణి.

అటువంటి నేను అనూరాధ చెలిమికి లొంగి పోయాను. ఆ స్నేహంతో ఎన్నో సాయం సమయాలు కాలం తెలియని గడియలు మా డాబామీదికి వెళ్ళి కబుర్లు చెప్పుకుంటూ, ఆమె చెప్పే మాటలు వింటూ గడపటం నేర్చాను.

క్లాసులో మాష్టర్లు చెప్పినవి నాకు సరిగా అర్థం కానివి ఇంటివద్ద చెప్తుండేది. ఆమె బోధనలో నాకెంతో విపులంగా తెలిసేది. ఎన్నిసార్లు చెప్పినా అర్థంకాక కాకపోతే 'నీది మట్టిబుర్ర భావా. ఇంత చిన్న విషయాన్ని అర్థం చేసుకోలేకపోతే నీవెలా ప్యాసవు తావు. ఏం లాభం లేదు' అని తిరస్కరించేది.

విశాలమై ఎప్పుడూ కాటుక దిద్దుకునే, ఆమె స్నేహపూరిత నయనాల్లోకి చూస్తూ, 'అనూ, నీవు మన రామనాథం మాష్టారికంటే, ఇంక మిగిలిన వాళ్ళందరికన్నా బాగా చెప్తావు. నీసాటికి కాలేజీలో చదువుకొనగల్గిన దానవు. నీ తెలివితేటలు నాకు రావాలంటే, నిన్నందుకోవాలంటే ఎన్నో ఏండ్లు కష్టపడి తపస్సు చేయాలి' అంటూ నవ్వేవాణ్ణి.

నన్ను 'భావా' అని పిలుస్తుంటే ఎంతో ఆత్మీయతను లోనైనట్లు ఆనందం కల్గేది. నాపై ఏదో అధికారం ఆమెకున్నట్లు ఆ పిలుపుకో ధ్వనించేది. 'అనూ' అనిపిలిచి నా స్వంతమైనట్లు మధురతతో ఫీలయ్యేవాణ్ణి.

'అదేమిటిభావా' అంటూ అవే మాటలు మాట్లాడుతావు. నిన్ను నీవు తక్కువ చేసుకుంటే నీ నాకు అలాగే పెరిగి విశాలమైన మనసుకలిపు అని నవ్వి హెచ్చరించేది.

పిప్తాసారం పరీక్షలయినంత వరకు ఆ చెలిమి కొనసాగింది. అనూరాధకు పధ్నాలుగు, నాకు పదునైదేండ్ల ప్రాయం. ఎంత అందంగా వుండేది! కొత్త అందాన్ని సంతరించుకుంది. వసంతకాలంలో విరిసే సుమబాలలా సున్నితంగా మోహనకరంగా కన్పించేది.

సమ వయస్కులం. మా స్నేహితులు నన్ను కొందరు రెచ్చగొట్టేవారు, అనూరాధకు నాకు ఉన్న స్నేహభావాన్ని మరొక అర్థంలో వ్యాఖ్యానిస్తూ. ఆ మాటలు నా మనస్సులో మధువులు కురిపించినా పైకిమాత్రం నాకను అలాంటి మాటలంటే 'తంతా'నని బెదిరించేవాణ్ణి.

యౌవనాన్ని దాచుకుంటున్న ఆమె సౌందర్యం, చిలిపిగ నవ్వే ఆమె సొగసుల హృదయం నా మనస్సులో ఆరాధనా భావాన్ని కల్గించింది. చేరువలో వుంటే మాటలు రావు నాకు. కాని ఆమె మాట్లాడుతుంటే ఇంపుగా వినేవాణ్ణి. దూరంగా ఉన్నప్పుడు గులాబి ముకుళదళాలవంటి ఆమె అధరద్వయాన్ని చుంబించి మధువు త్రాగాలని పిచ్చిగా భావించేవాణ్ణి.

పాదాలకు పూసిన గోరింటాకు ఎరుపు పరికిణీ అంచులు జీరాడుతుంటే స్వర్గంనుంచి దిగి వచ్చే అప్సరోభామినిలా సొగసులు కురిపిస్తూ సిరిమువ్వల జాలులా మా ఇంట్లోకి వస్తుంటే విస్ఫారిత నయనాలతో నీలిమేఘాలను దాచుకున్న ఆమె కన్నుల వంక చూచినపుడు ఆమె పెట్టుకున్న సిగ్గుపడి శశాంకబింబం లాంటి ఆమె మోమును ఇంకా వాల్చుకొని ప్రక్క చూపులు చూస్తున్నప్పుడు, ఏదో తెలియని ఆవేశం, ఉడుకెత్తిన రక్తం ఒకసా

రాధను కౌగిటిలో పొదువుకోమని ప్రేరేపించినట్లు అనిపించేవి— నేను పిరికి వాణ్నని ముందే చెప్పానుగా.

ఇప్పుడు ఆ చూపుల కర్థాలు వెదుక్కుంటున్నాను. ఆ మాటలకు భావాలు కనిపెడ్తున్నాను. ఆ మంద హాసాల వెనుకనున్న తలంపులను ఊహిస్తున్నాను.''—

ఇంతసేపు ఓపికగా వింటున్న రమణమూర్తి ఒక్కసారిగా అతని ప్రేమ కథా వాహినిని ఒక్క ప్రశ్నతో అడ్డేశాడు.

''ఇపుడేం చేస్తుందో తెలుసా?''

'గుంటూరు ఉమెన్సు కాలేజీలో ఫైనలియరు చదువుతున్నదట.'

దూరంనుంచి గాలికి ఒక సన్నజాజి పూతీవ కొట్టుకువచ్చి రమణమూర్తి దగ్గర చేరింది. చేతితో అందుకొని పరిమళాన్నాస్వాదిస్తూ, ''వాళ్ళు మీ వూరినుంచి ఎందుకు వెళ్ళిపోవాల్సి వచ్చింది?'' అడిగాడు.

''అదే దురదృష్టకరమైన మలుపు. ఫిఫ్తుఫారం పరీక్ష అనంతరం శలవులకు నేను మా మామయ్య గారి వూరువెళ్ళాను. వచ్చేటప్పటికి తెలిసింది, అనూరాధ తండ్రి గుండె జబ్బుతో హఠాత్తుగా మరణించటం. తల్లితోపాటు అనూరాధ తాత గారింటికి వెళ్ళిపోయారని. ఆమె నాన్నగారు చనిపోయారని కాకపోయినా అనూరాధ దూరమయినందుకు తీరని మనస్తాపం కల్గింది. ఎన్నో రాత్రులు నిద్రలేక 'అనూరాధ ఏం చేస్తుందో'నని ఆలోచించే వాణ్ణి. ఇంత స్నేహంగా వుండి నా ఆనందం పంచుయిచ్చిన అనూరాధకు తీరని లోటు కల్గినందుకు.'' శేఖరం మాటల్లో బాధను వ్యక్తకరించాడు.

రమణ మూర్తి అంతా విని శేఖరం ఆరాధనకు కాస్తంత విస్తుపోయాడు. చిన్నప్పటి, స్నేహం శేఖరంలో ఇంతటి ప్రేమ ప్రభావానికి దారి తీసినందుకు, సానుభూతితో కూడిన అభినందన చెప్పాడు. సున్నితమైన శేఖరం హృదయగతులు మూర్తికి బాగా అవగతమే. శేఖరం ఇంతా చెప్పింది తనునుంచి ఓదార్పు మాటలు వినటానికని, ప్రేమ ఫలిస్తుందని తన నోటిమాట వినాలని రమణ మూర్తికి వూహా తెరిగిన విషయమే.

''నీవింతగా ఆరాధనాభావం చూపిస్తున్నావు కనుక ఆమెకూడా నీపై ఇలాంటి భావమే వుండొచ్చు. అయినా ఒకసారి వెళ్ళి చూచి రారాదూ, ఆరాటం తగ్గుతుంది కొంత. కాకపోతే కపోత సందేశం గాని, మేఘ సందేశంగాని పంపు నీవొలికి,' నవ్వుతూ అన్నాడు.

శేఖరం మనస్సు కుంచించుకుపోయింది, నీటిలో తడిసిన దూదిలా, రమణమూర్తి పరిహాసానికి.

మళ్ళీ మూర్తే అన్నాడు. ''నా సలహా ఏమిటంటే ఒకసారి వెళ్ళి కలుసుకొని ఆమె మనోగతాభిప్రాయమేమిటో కూడా తెలుసుకొని ప్రేమించటం మంచిది. తర్వాత నీ ఇష్టం. నీవిలా వూహలతోనే ఉంటే జీవితంలో పరాజయాన్ని ఎదుర్కోవటం జరగటానికి అవకాశం వుంది. ఆశలు వూహలు విభేదించితే నీలాంటి మృదుమనస్కులకు భావుకులకు తట్టుకోవటం కష్టం.

తెరలు తెరలుగా గతం జ్ఞాపకం వస్తుంది మూర్తికి. తను యమ్. ఏ. ఫైనలియరు చదువుతుంటే శేఖరం బి. ఏ. చదువుతూ పరిచయమై ప్రగాఢ స్నేహితుడై తన గదిలోనే చేర్చుకోబడ్డాడు శిశోభితట్నంతో.

బి. ఏ. పరీక్షలనంతరం శేఖరం శలవులకు ఇంటికి వెళ్ళి ఉత్తరం వ్రాశాడు మూర్తికి.

'ప్రియమైన మూర్తీ! నా ప్రణయ సామ్రాజ్ఞి అనూరాధను గురించి ఒకసారి చెప్పాను. జ్ఞాపకముందా! మొన్న శలవులకు అనూరాధ గారింటికి వెళ్ళాను. ఇంతకాలం నాలో నేనే అణచుకున్నాను ప్రేమ భావాన్ని. ఐదు సంవత్సరాల తర్వాత అదే చూడటం అనూరాధను. వాళ్ళ వూళ్ళో మా బంధువులు వున్నారు. బంధువుల కుర్రాణ్ణి తీసుకువెళ్ళాను.

వాళ్ళది చాలా పెద్ద కుటుంబం. సాయంసమయము ఆడవాళ్ళంతా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. సిగ్గుపడ్డాను వాళ్ళందరి ముందు కూర్చుని అనూరాధతో మాట్లాడాలంటే.

నన్ను చూచి చివాలున లేచి ఎదురొచ్చింది. ఇన్ని సంవత్సరాల తర్వాత అదే మా చూపులు కలియటం. అమావాస్య తర్వాత కన్పించే నెలవంక హాసముతో తటిల్లున నవ్వుతూ స్వాగతం పల్కింది.

ఇంతకాలం నా వూహల్లో ఆమెకు అంతఃపుర శుద్ధాంగనల అందాలను అన్వయించుకుంటూ వుండేవాణ్ణి. కాని అలాలేదు. మనిషి సన్నగావుంది. చామనచాయ రంగుకు మారినట్లుంది. సహజంగా కాలేజీ చదువులు చదివిన స్త్రీలు అందంగా వుండాలని తంటాలు పడుతుంటారు. అలంకరణపై క్రొత్త ప్రక్రియలు కనిపెట్టాలను కుంటుంటారు. ఆమెలో అదేమీ కన్పించలేదు. అతి సామాన్యంగా కన్పించింది. నాకెంతో సంతోషం కల్గింది. సింప్లిసిటీని నేనెంతో మెచ్చుకుంటానని ఆడంబరాలను నిరాదరణ చేస్తానని నీకూ తెలుసుగా.

కుర్చీ చూపిస్తే కూర్చున్నాను. మరొక కుర్చీలో ఆమె కూర్చుంది. అంత మంది ఆడవాళ్ళ ఎదుట నాకు మాటలు రావన్నవి నోట్లోనుంచి. ఆమె గలగల మాట్లాడేస్తుంది, సెలయేటి గలగలలా ఉన్నవి ఆమె మాటలు.

సెలయేటి ప్రవాహాన్ని ఎవరాపగలరు. చెంగు చెంగున గంతులువేస్తూ రాళ్ళు రప్పలను దాటుకుంటూ గెంతులువేసే ఈ సెలయేటి కన్య ఇలా ఎంతకాలం ప్రవహిస్తుంది? ఒక ఇంటికి కోడలుగా వెళ్ళినంతవరకు అనిపించింది.

ఆ ప్రవాహ వేగాన్ని నేనందుకోలేను. కాని నాతో నడిపించుకోవాలనే దుగ్ధ. ఆత్మాభిమానం, స్వతస్సిద్ధంగా వచ్చిన తెలివితేటలు మూర్తీభవించిన ఇంతి. నా ఆశయాలకు మెరుగులు తీర్చ గల్గిన యువతి.

బియస్సీలో క్లాసు వస్తుందని ఘంటలా చెప్పింది. ఎవరో ఒకావిడ అంది ''ఏమిటి బాబూ. మా అమ్మాయి అంత హుషారుగా మాటలు చెప్తుంటే సిగ్గుపడినట్లు మెల్లగా మాట్లాడుతావే.' అని.

చర్రున చరిచి నట్లయింది. తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో ''నాకేం సిగ్గు— ఇంకెలా మాట్లాడా లంటారు?' అన్నాను.

'అతనెప్పుడూ అంతే' అంది నవ్వుతూ.

ఉన్న కాసేపు కదల బుద్ధికాలేదు. చీకటి పడిపోతుంది. ఆడవాళ్ళు పనుల్లోకి దిగారు. నామనస్సు హాయల లూగింది. గ్రీష్మతాపానంతరం మొక్కలు తొలకరిని చూచి నాట్యం చేసినట్లు, ఆకసంలోని మేఘ సంచలనం చూచి మయూరి నాట్యం చేసినట్లుగా ఆనందం కల్గింది— తీగ కొమ్మలన్నీ వీణాస్వరము రవళిగా ధ్వనించింది.

'బి. ఏ. ప్యాసయిన తర్వాత ఏంచేస్తావు' అని అడిగింది.

'నా చదువు సంగతి నీకు తెలుసుకదా' అని చెప్పాను. తర్వాత సంగతి ఆమెనే వూహించుకోమని వదిలేశాను.

''అంటే పెండ్లి ప్రయత్నాలా'' కొంటెగా ఉంది పైకి ఆ ప్రశ్న. కాని 'నీవు మరొకరిని చేసుకొని నన్ను మరచిపోతావా' అని సూటిగా అడిగినట్లనిపించింది.

'ఒకవేళ జీవితంలో నేను పెండ్లి చేసుకుంటే నిన్నే చేసుకుంటాను. ఇది నిజం' అని ఆమె చేతిని నా చేతుల్లోకి తీసుకుని ముద్దిడుకుంటూ చెప్పాలని గాఢంగా మనస్సు ప్రేరేపించింది. కాని ఆగిపోయాను.

'ఆ ప్రయత్నాలేం లేవు' అని వచ్చింది మాట అప్రయత్నంగా.

'మరి నీ విషయం.' అడిగాను.

ఏం సమాధానం చెప్తుందోనని గుండె పీచు పీచు మంది.

నవ్వుతూ అంది ''ఆడపిల్ల పెళ్ళంటే ఈ రోజుల్లో మాటలా. చదువుకొని ఆడపిల్లయితే 'చదువు లేని అనాకారి' అని ఫ్రీగా సర్టిఫికేట్ ఇస్తూనే పైగా పెద్ద కట్నాలడుగుతారు పెద్దలు. నాలాంటి చదువుకున్న వాళ్ళయితే ఇంతకు తక్కువలేని చదువున్నవాళ్ళు దొరకాలి. హోదా, గౌరవము, ముసుగులో అడిగినంత కట్నమూ చెల్లించాలి. మర్యాదలు సరిగా జరుగవని వెనుదీసే పెద్దలు కొందరు. ఇన్ని చూడాలి కదా!'

పెదాలపైనుంచి వచ్చిన హాస్యరేఖలో జీవం లేదు. నైరాశ్యభావం తొంగి చూచింది.

''ప్రస్తుతం నాకా అలాంటి ఆలోచనలేదు. పెద్దవాళ్ళు మాత్రం గాలిస్తున్నారు. ఉద్యోగం చేస్తుంటే ఇటువంటి ఆలోచనలకు తాత్కాలికంగా నాస్తి చెప్పొచ్చు'' అంది.

అనూరాధ వాళ్ళకు డబ్బుకు చింతలేదు. ఆమె పేరనే కొంత ఆస్తి కూడా ఉంది. ఏదో చెప్పాలనుకున్నంతలో వాళ్ళ పెద్దవాళ్ళు వచ్చారు. చెప్పలేకపోయాను. మరికొంతసేపు కూర్చుని వచ్చేశాను.

గుమ్మందరకు వచ్చి వీడ్కోలు ఇచ్చిన కోమలమైన ఆమె నేత్రాలూ. మూర్తీ! ఒకవేళ నేను ఆశించినట్లు ఆమె నా హృదయేశ్వరి కాకపోతే మనస్సు కెంత బాధ కల్గుతుంది. ఆమె ధోరణి ఆశావహంగానే ఉన్నట్లుంది కదూ. కాకపోతే నా పెండ్లి విషయం ఎందుకంత ఉత్సాహంగా అడుగుతుంది. అదృష్టం వక్రించితే చేసేదేమి లేదనుకో. కాని స్నేహశీలిగా అనూరాధ శ్రేయోభిలాషిగా ఆమె సౌభాగ్యాన్ని కోరుకుంటాను నా స్నేహ సౌహార్ద్రాలు ఆమెకు భవిష్యత్తులో అవసరం లేక పోవునేమో అని అనుమానం. అయినా ఉన్నతాత్మగల దేవతనెలా సామాన్యులు గౌరవిస్తారో అలాగే నేనూ ఆమెను గౌరవిస్తాను.

చదువుకున్న స్త్రీగా జీవితాన్ని ఉత్తమ పథంలో నడిపించుకుంటూ ఉత్కృష్టమైన సాంప్రదాయాల శిఖరంపై నిలబడి ఉంది. ఆమెనుచూచి గర్వంగా అభినందించేవాళ్ళు నాకంటే ఎవరూ

శేఖరం మూర్తి! నా స్నేహితురాలు, నా ప్రాణానికి ప్రాణమని భావించిన అనూరాధ జీవిత నందనోద్యాన వనంలో విహరిస్తుంటే నాకానందంగా ఉండదా మరి?

ప్రత్యూష కాలంలో చివురుటాకుపై వున్న మంచు బిందువు సూర్యకిరణ ప్రసారానికి లోనయి ఎలా వజ్రతుల్యంగా భాసిస్తుందో అట్లే నా హృదయ పత్రంపై వజ్రంగా భాసిస్తుంది.

విజయాలకోసం ఎదురు చూస్తున్న నీ శిఖరాన్ని నిరాశ పరచకు.'

ఆ ఉత్తరాన్ని చదివినతర్వాత మూర్తికి శేఖరం పై కోపం వచ్చింది. అంతగా మనస్సులోనే ఉంచుకొని బాధపడుతూ ఉండటం ఎందుకు? ఇంత ప్రేమ భావాన్ని. అనూరాధ అంత సన్నిహితంగా మాట్లాడుతున్నా దాచుకో వలసిన అవసరం ఏమిటి?

మూర్తికి అటువంటి విధానాలు నచ్చవు. ప్రేమ విషయంలో దాగుడుమూతలాడితే కష్టేది పరాజయమే. ఒక స్త్రీని ప్రేమిస్తూ ఆరాధనా భావంతో గౌరవిస్తూ మిగిలిన ఎన్నో ముఖ్య విషయాలను పట్టించుకోని వారంటే మూర్తికి గౌరవ భావం లేదు.

వ్యక్తి పతనానికి, సౌభాగ్యానికి స్త్రీయే ఎంతో కారణం. అయినా అతనెప్పుడూ ఆడవారి గుణాగుణాలను అంతగా పట్టించుకోడు.

ఆనాడు, శేఖరానికి వెంటనే మందలిస్తూ ఉత్తరం వ్రాశాడు. అనూరాధతో కలిసి మరొకసారి మాట్లాడి వివాహానికి ఇష్టమైతే వెంటనే చేసుకోమని .

రమణ మూర్తి ఎం. ఏ. ప్యాసయి ఒకకాలేజిలో ఉద్యోగంలో చేరిన కొన్నాళ్ళకు శేఖరం నుంచి మరొక ఉత్తరం వచ్చింది. పూర్తిగా చదివిన తర్వాత వేదన కల్గింది. శేఖరం వ్రాసిన మాటలు వినిపిస్తుంటే.

మూర్తికి అలలుగా స్మృతులు కదిలినాయి.

'ఇన్నాళ్ళు ఏదైతే కాకూడదని భావించానో అది ఆనాడు జరిగి పోయింది. నీ సలహా ప్రకారమే మరొక సారి అనూరాధా వాళ్ళింటికి వెళ్ళాను. అదృష్టవశాత్తు అనూరాధా ఒక్కతే ఉంది. ఆరోజు

# చివరకు మిగిలేది...

చెప్పిన తర్వాత టిఫిను కాఫీ తెచ్చి పెట్టింది.

ఇంటివద్ద ఎంతో ఆలోచించాను ఏమేమిమాట్లాడాలో నని. 'అమ్మా! ఎంతోకాలంనుంచి నిన్నొక మాట అడగాలనుంది. అనుమతిస్తే, సందేహంగా చూస్తూ అడిగాను.

ఆమె నవ్వింది. ముత్యాలు రాల్చి నాముందు పోసింది. వాటిని చేతో గుప్పిళ్లతో తీసుకోటానికి నేనర్హుణ్ణికాదని ఆనాడే తెలిసింది.

నాదగ్గర దాపరికాలు కూడానా! ఇంతకాలం సన్నిహితం చేసుకోలేదన్న మాట. హైస్కూలులో చదివేప్పుడు కూడా ఒక ఇంటి బిడ్డలుగా తిరిగాము కదా! ఏదైనా అడగాలంటే అనుమతి కావాలా. నన్నొక పెద్ద ఆఫీసరును చేసి నీవొక చిన్న గుమాస్తాగా మారిపోతున్నావు.'

కొంతసేపు మాటరాలేదు. ఆమె నా కన్నుల్లోకి చిలిపిగా చూస్తూ కూర్చుంది. ఆ తళోదవళికి నా కన్నుల శక్తి చాలదు. గుండెల్లో రైళ్ళు దాకెట్లు పరుగెత్తినవి. అయినా సర్దుకొని.

'మా అమ్మ నాన్నలు నాకు పెండ్లిచేయాలని ఆలోచిస్తున్నారు. మా నానమ్మ పోరు పెడుతుంది. నా పెండ్లి చూడాలని. నీవే మాయింటికి కోడలుగా రావాలని ..' నా అభిమతం ఇంక చెప్పలేను. ఆమె సమాధానం కోసం ఆతృతగా చూశాను.

చిన్న హాసం ఒకటి విసిరి! 'ఏమిటి బావా! ఇంత తెలివి తక్కువగా మాట్లాడు తావని నేను కోలేదు. నీకా అభిప్రాయం ఎలా కలిగిందో నాకర్థం కావటం లేదు. ఒక ఇంట్లో పెరిగిన బిడ్డలుగా మసలిన మనం, అంతకంటే మిన్నగా స్నేహం చేసిన మనం ఆ భావాలో ఉండటం బాగులేదు. నాకా భావం ఎన్నడూ లేదు. వయస్సులో నాకంటే ఒకనెల చిన్న అయినా కూడా చెప్పాను. నీవిలా ఎలా ఆలోచించావు. అటువంటి భావాల్ని మనస్సులో నుంచి తొలగించుకో. నిన్ను ప్రార్థిస్తాను. సన్నిహితం చేసుకొని స్నేహభావంతోనే ఉండు' అంది

నామెదడుకు పట్టిన ప్రేమ తుప్పువదిలింది ఆమె మాటలకు. హృదయం తీవ్ర స్పందనకు గురయింది. భరించరాని ఉద్వేగానికి లోనయ్యాను ఆక్షణం. కాని ఓడిపోయానుకదా. నా కళ్ళ ముందు ఆమె ఆత్మనిగ్రహశక్తి, మానసిక పటిష్టత, సౌశీల్యత, నిర్మలత్వం ఒక్కసారిగా కలిసి వచ్చినట్లనిపించింది.

మెరుపు లాంటి ఆమెను పట్టుకొని నా స్వంతం చేసుకోవాలని ఆశించిన నేను కాలిన చేతులతో గాయపడిన మనస్సుతో బయటపడటం జరిగింది.

"సారీ అనూరాధా. నిన్నపార్థం చేసుకున్నాను మన్నించు. కనీసం ఆ స్నేహ బాంధవ్యాన్నైనా మిగుల్చు' అన్నాను. దీనంగా ఉన్న నా మాటలకు నాకే గంభీరత తెచ్చుకోవాలనుకున్నాను. కాని విఫలుడయ్యాను.

తెచ్చిపెట్టుకున్న నవ్వుతో "హృదయ పూర్వకంగా నేనెక్కడున్నా నా మిత్రునిగానే నిన్ను గౌరవిస్తాను. నన్ను అలాగే గౌరవించు' అంది.

"జీవితం అంటే కథల్లోని నవలల్లోని ప్రేమ రసంతో నిండి ఉంటుందనుకున్నావా బావా. వాస్తవికతకు దూరం కాకు' అంది.

ఈ మాటలు ఇంకెందుకు.

మానసిక విశ్రాంతికోసం దూరం పోయాను. నా ప్రాణానికి ప్రాణమని భావించిన అనూరాధకు భగవంతుడు మేలు కలుగ చేయాలనే కోరుకుంటాను. నాలాగే నాకంటె మిన్నగా ఆమెను అభిమానించి ప్రేమతో ముందుకొస్తే వాళ్ళు దొరకాలని నా కోరిక. చివరి కోరిక గుర్తుంచుకో మరి.

నాకు తీయని స్మృతులుగా మిగిలేవి చిన్ననాటి సంఘటనలే. గతస్మృతుల జ్ఞాపకాలే మధురంగా కన్పిస్తాయి. విజయంలో ఎప్పుడు తీపే వుంది. మధుర స్మృతుల జ్ఞాపకాలు ఉన్నా, భరించరాని వేదనను భరించటం నావంటి వారికి పద్ధతి. అందువలన అనూరాధ నామనో మందిరంలో శాశ్వతంగా వుందని ఊహించుకుంటూ పోయినను భరిస్తాను. నాలాంటి వారికి చివరకు మిగిలేవి జ్ఞాపకాలే.'

ఉప్పెనగా వచ్చిన ఆలోచనా సుడిగాలిని అదుపులోకి తెచ్చుకుంటున్నాడు రమణమూర్తి. శేఖరం దీనవదనం కంటిముందు స్పష్టమైన దృశ్యంగా మెదల సాగింది మూర్తికి.

పెండ్లి చూపులకు వచ్చిన రమణమూర్తి అనూరాధ నలాగే చూస్తూ ఆలోచిస్తున్నాడంతే.

రమణమూర్తి తండ్రి అభ్యుదయవాది. చదువు కున్నవాడు. సంస్కారం వినయం చదువు అన్నీ వున్న సుగుణవతిని తన ఇంటి కోడలుగా తీసుకు రావాలని ఆరాటం ఫలించినట్లుగా సూరప్ప బంధువొకాయన ఈ అనూరాధ సంబంధం బాగుంటుందని వచ్చి చెప్పితే కాలేజిలో ఉద్యోగం చేస్తున్న మూర్తిని తీసుకువచ్చి పెండ్లి చూపులకు ఆయత్త పరచాడు.

అమ్మాయిపేరు మిస్ అనూరాధ బి.యస్సి. అని వినేసరికి ఎవరో చెంప చెళ్లున వాయించి నట్లయింది మూర్తికి. ఆసాంతం మస్తకం నిండిన ఆసక్తితో ఈమె ఎవరో చూడాలని ఉత్సుకతతో వచ్చాడు దూరమైనా. వచ్చిన తర్వాత ఆమెను అడిగిన మొదటి ప్రశ్న ఇది.

'మీ పేరు.'

'అనూరాధ.'



'ఏంతవరకు చదివారు.'

'బియస్సి.'

'ఎక్కడ.'

'గుంటూరు వుమెన్సు కాలేజీలో'

'హైస్కూలు స్టడీసు?'

'కృష్ణవరం.'

ఒక్కొక్క జవాబు సమ్మెట పోటులా తగిలింది మూర్తికి. భయంకరంగా విశ్వలాకాశం గిర్రున తిరిగి వచ్చినట్లయింది.

నిర్విణ్ణుడయ్యాడు మూర్తి. అయినా పైకి కన్పించనీయక నా స్నేహితుడొకడు అక్కడే చదివా న్నాడు. పేరు రాజశేఖరం. మీకేమైనా తెలుసా. అనుటతో ప్రతి స్పందన ఎలా ఉంటుందోనని ఆతృతగా చూశాడు.

మెరుపులాగా చూసింది తలెత్తి. కాంతివంతమైన ఆమె కన్నులు మరింత విస్ఫారితం చేసి. 'అతను తెలుసు. మీకూ తెలుసా' అంది.

షాక్ తగిలినట్లు బాధ పడ్డాడు. రాజశేఖరం విషయం ఎందుకు ఎత్తానా అని మధన పడ్డాడు. ఆమె మాటలో 'మీకు అంతా తెలుసా. అతనేమైనా తన విషయం మీకేమైనా చెప్పాడా' అని అడిగి నట్లుంది.

నవ్వుకొని "కాలేజీలో పరిచయస్థుడు. స్నేహితులతో మాట కలిపినపుడు మా హైస్కూలు చదువులు నెమరు వేసుకుంటుంటే అతను మీరు చెప్పిన ఊళ్ళోనే చదివానన్నట్లు జ్ఞాపకం ఉంటే అడిగాను." సమర్థించుకో జూశాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు.

పెండ్లి చూపులకు తానెందుకు రావాలి. వచ్చినా ఈ అనూరాధ శేఖరం ప్రతియుని ఒక్కరే ఎందుకు కావాలి. గతం జ్ఞప్తికి రావటంతోనే మానసికంగా తీవ్రమైన ఒత్తిడికి లోను కావటం జరుగు తుంది మూర్తికి. శేఖరం ప్రేమించి ఆరాధించిన ఈ అనూరాధ తన జీవితంలో భాగం పంచు కోవటానికి సిద్ధంగా ఉందిప్పుడు. ఏం చేయాలి? శేఖరం ఈ విషయం తెలిసి ప్రాణమిత్రత్వాన్ని వదలు కొని మరొక సారి తనకు ముఖం చూపించడు. తన జీవితమే తనయిన వ్యక్తి అని భావించిన అనూరాధ తన జీవితంలో భాగస్వామిగా మారితే శేఖరం ఎలా భరిస్తాడు. అసలు తన ప్రేమ గాథను శేఖరం తనకెందుకు చెప్పాలి. ప్రేమరహా స్యాలు వారికి వారు అనుభవించి ఆనందించేవేగాని ఇతరులకు చెప్పటం శ్రేయస్కరం కాదని అత డెందుకు ఆలోచించలేదు. ఈ పరిస్థితులలో మరొకరైతే ఏం చేయగల్గుతారు??

తల తిరిగింది రమణమూర్తికి. అయినా శేఖరాన్ని మరొక విధంగా ప్రశ్నించి ఆమెని అభిప్రాయాన్ని తెలుసుకోవటం మంచిది. అతడారాధించిన ప్రేమకుసుమం తన దోసిటికి తగిలింది.

తండ్రితో అన్నాడు 'కొద్దిరోజులు ఆలోచించు కుని తన నిర్ణయం తెలియ పరుస్తానని. తన తండ్రికి ఇష్టమయింది. తల్లికి అభిమతమే. తనకూ ఇష్టమైనట్లు మనస్సు చెప్పుతుంది. పన్నగా అంతరంగంలోని ఏ పొరలోనుంచి ప్రశ్నిస్తుంది. ఏమని—ఏదో మరి అర్థంకాని బాధ పెడుతుంది. అదే అదేమిటో....? ●

# అవీ - ఇవీ...

## నర్తకి శీలావతి

చిరంజీవి శీలావతి లెఫ్టినెంట్ కల్నల్ జి. కె. పతిగారి కుమార్తె. మొట్టమొదటి అరంగేట్రం బొంబాయిలోని జైహింద్ కాలేజీలో 1961 లో జరిగింది. 64 లో రెండవసారి మద్రాసులోని రసిక రంజని సభలో జరిగింది. శ్రీ కల్యాణసుందరంపిళ్లై, శ్రీ దండాయుధపాణిపిళ్లై వద్ద నృత్యం నేర్చుకొన్నది. ప్రఖ్యాత నర్తకి కుమారి కమలాలక్ష్మణ్ బృందం దేశంలో పలుచోట్ల ప్రదర్శించిన "సవకచరితం" నృత్యనాటకంలో బాలకృష్ణుని పాత్రను ధరించింది. మద్రాసులో పలుచోట్ల ప్రదర్శన లిచ్చి ప్రేక్షకుల అభిమానాన్ని పొందిన ఈ బాలిక వయస్సు పన్నెండు సంవత్సరాలు. స్థానిక రోజరీ కాన్వెంట్‌లో విద్యాభ్యాసం చేస్తున్నది. —మాధవ్



కుమారి శీలావతి

## తెలుగు నాటకసమితి సాంస్కృతిక కార్యక్రమం

అక్కౌంటెంట్ జనరల్ ఆఫీసు (హైదరాబాదు) 'తెలుగు నాటకసమితి' వారు రవీంద్ర భారతిలో ఇటీవల నాటికల పోటీలను నిర్వహించారు. అక్కౌంటెంట్ జనరల్ శ్రీ ఆర్. పి. రంగా ప్రారంభోత్సవం చేసిన సభకు డిప్యూటీ అక్కౌంటెంట్ జనరల్ శ్రీ కె. ఆర్. గుప్తా అధ్యక్షత వహించారు. మొదటిరోజు కార్యక్రమానికి శ్రీ అదుర్తి సుబ్బారావు, రెండవ రోజు కార్యక్రమానికి శ్రీమతి జమునా రమణరావు ముఖ్యఅతిథులుగా ఉన్నారు. మొత్తం ఐదు నాటికలు ప్రదర్శించారు. అనంతరం సమితి సభ్యులచే లలిత సంగీత కచేరీ జరిగింది.

## ఆంధ్రప్రదేశ్ థియేటర్ అసోసియేషన్

జంటనగరాలలోని సుమారు 30 నాటక సంఘాల ప్రతినిధులు హైదరాబాదులోని రాఘవ కళా కేంద్రంలో సమావేశమై, ఆంధ్రప్రదేశ్ థియేటర్ అసోసియేషన్, అవతరణకు పూనుకున్నారు. ఉర్దూ, హిందీ, మరాఠీ, కన్నడం, అరవం, బెంగాలీ తరఫున అయిదుగురు ప్రతినిధులతో కలిసి మొత్తం 21 మంది కార్యవర్గ సభ్యుల నెన్నుకొన్నారు. ఈ సంస్థ అధ్యక్షులు: శ్రీ అబ్బూరి రామకృష్ణారావు, కార్యదర్శి శ్రీ కె. వి. సుబ్బారావు.

## శ్రీ వేణూ మాధవ్ సన్మానం

వరంగల్ సైన్సు అండ్ ఆర్ట్సు కాలేజి ఆడిటోరియంలో స్థానిక విద్యార్థిసంఘం వారు ప్రముఖ మోనోయాక్టర్ శ్రీ నేరెళ్ల వేణూ మాధవ్‌ను సన్మానించారు. సన్మానసభకు సుప్రసిద్ధ సినిమా నటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు.

## 'ఇదేమిటి'

కటకం ఆంధ్రసంఘం ఆధ్వర్యాన తే. 5.12.66 సాయంత్రం ఇచ్ఛటి అన్నపూర్ణా థియేటరులో "ఇదేమిటి" అను నాటకం ప్రదర్శింపబడింది. ఈ సంఘం నిర్మించుచున్న తెలుగు స్కూలు సహాయార్థం బరంపురం 'మిత్రబృందం' వారీ నాటకాన్ని ప్రదర్శించి వందలాది ప్రజల నానందింపచేశారు.

## మైక్రో ఫైనడ్ ఆస్పిరి

త్వరితంగా బాధానివారణచేసే మైక్రోఫైనడ్ ఆస్ప్రిను నికోలాస్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారు రూపొందించారు.

మైక్రోఫైనడింగ్ విధానంవల్ల ఆస్ప్రి మాత్రలోని విభాగాలు 12 వేలనుంచి 15 కోట్లకు పెరిగాయి. అందువల్ల దేహంలోనికి ఈ ఔషధం త్వరగాఅంది, వెంటనే బాధను నివారించటమేకాకుండా అది చాలాకాలంవరకూ తిరిగి రాకుండా చేస్తుంది.

## అండమాను-నికోబారులో ఆంధ్రుల కార్యక్రమాలు

అండమాను— నికోబారు దీవులలో ఈఏడాది మకర సంక్రాంత్యుత్సవములు, అండమాను ఆంధ్రా అసోసియేషన్, పోర్ట్ బ్లెయిర్ ఆధ్వర్యమునమిక్కిలి వైభవముగా జరిగినది. బంబూఫ్లాటులో శ్రీవెంకటేశ్వరా నాట్యమండలివారు "రైతుకూతురు" అను సాంఘిక నాటకమును ప్రదర్శించిరి.

తర్వాతరోజు హాడ్డోబేరక్ నం. 2లో శ్రీబాలగణపతి నాట్యమండలివారు "ఆరని కన్నీరు" అనుసాంఘిక నాటకమును ప్రదర్శించిరి. పోర్టుబ్లెయిర్‌లో ప్రభుత్వ బాలుర హయ్యరు సెకండరీ పాఠశాలలో కార్యక్రమములయిన తరువాత భమిడిపాటివారి "బజంత్రీలు" అను హాస్య నాటిక ప్రదర్శన జరిగింది. వీటిని ఆలిండియా రేడియో, పోర్టుబ్లెయిర్ కేంద్రమువారు ఆదరముతో రికార్డుచేసి ప్రసారము చేశారు.

(జి. వి.)

## కుమారిపద్మిని రంగప్రవేశం

కుమారి పద్మిని రంగప్రవేశంతో నాట్యకళకు మరోకాంతి కిరణంప్రసరించింది. పూవు పుట్టగానే పరిమళిస్తుంది అనే నానుడికి చక్కని ఉదాహరణ కుమారి పద్మిని. తొలిసారిగా రంగప్రవేశంచేసినా హావభావ ప్రకటనలోను, అభినయంలోను అద్వితీయమైన కౌశల్యాన్ని ప్రదర్శించింది. రామపట్టాభిషేకం, కృష్ణశబ్దం, తరంగం, భామాకలాపం, జావళి, దశావతారాలు, ఆమె అభినయంతో వన్నెచిన్నెలు దిద్దుకున్నాయి. ముఖ్యంగా తరంగంలోని భంగిమలతో ప్రేక్షకుల్ని ముగ్ధుల్నిచేసింది. భవిష్యత్తులో మంచి నర్తకిగా కీర్తి తెచ్చుకునే ఉత్సాహం కుమారి పద్మినిలో వుంది!

కుమారి పద్మిని ఎమ్మిగనూరుకు చెందిన శ్రీ యమ్. పెద్దనాగప్ప కుమార్తె. శ్రీవెంపటి చిన్నసత్యం 'కూచిపూడి ఆర్ట్సుఎకాడమీ'లో గతమూడేళ్లుగా నృత్యం నేర్చుకొంటూ వుంది. ఈ అరంగేట్రానికి అమెరికన్ కాన్సులేట్ జనరల్ డిప్యూటీ ప్రిన్సిపల్ఆఫీసరు డా: రోబర్ట్ డబ్ల్యు కాల్డ్వెల్, ఆయన సతీమణి అధ్యక్షత వహించారు. శ్రీయన్. టి. రామారావు ముఖ్య అతిథి. కుమారి పద్మినికి కూచిపూడి ఆర్ట్సుఎకాడమీ 'నాట్యవిశారద' అనే బిరుదు ఇచ్చింది. శ్రీ యన్.టి. రామారావు బిరుదు ప్రదానం చేశారు.

—సికరాజు ●

# వారఫలం

**3-3-1967 శుక్రవారం మొదలు 9-3-1967 గురువారం వరకు.**

**మేషం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. సమయానికి ఏదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వృత్తిలో అనుకూలవార్తలను వింటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో కొత్త సమస్యలు తలయెత్తగలవు.

**వృషభం :** ఏపనైనా చేయడంకంటే పూరుకోవడమే మంచిదనే పరిస్థితి ఏర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారాంతంలో అన్ని వ్యవహారాలు బాగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లాభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం :** ప్రయత్నించిన పనులకు ఆటంకాలు రావడం అనుకోని పనులు నెరవేరడంవంటి సంఘటనలు జరుగుతాయి. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదిలివేయడం మంచిది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. మానసికాందోళన కలుగుతుంది.

స్త్రీలకు:—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**కర్కాటకం :** వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :** వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు వారం ప్రారంభంలో రాణిస్తాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగా ఉంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి రాణించగలదు.

**కన్య :** సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసివస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేస్తారు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల :** వ్యాపారంలో సాటివారి పోటీని ఎదుర్కొని అనుకూలతను సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు మొత్తంమీద లాభిస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం :** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వ్యాపారంలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. అలంకార వస్తువులుకొంటారు.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు వారాంతంలో బాగా ఉంటాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు:—స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది

**మకరం :** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తిలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి.

స్త్రీలకు:—కుటుంబ కార్యక్రమాలు సామాన్యంగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కుంభం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో వారాంతంలో నష్టం వస్తుంది. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మీనం :** మీ ఆలోచనలు మీకే కాకుండా మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో అనుకూలమైన మార్పులు వస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్



# వల

డి. కామేశ్వరి



"ఏమేవ్!.....ఎక్కడ తగలబడ్డావు? లోప లికివస్తూనే కేకపెట్టారు రావుగారు. "ఏమేవ్!"

"ఎందుకండీ, ఆ కేకలు.......అలా ఇల్లెగర గొడ్తున్నారు.......అవతల పొయ్యి మండిపోతూంది."

"నీ పొయ్యి తగలడ!.....పొయ్యేమిటే...... నీకు కొంప తగలబడినా లెక్కలేదుగాని.... పొయ్యిమాత్రం తగలబడకూడదు!........" చిటపటలాడిపోయే. భర్తవంక కాస్త వింతగా చూసింది జానకమ్మ.

"ఏమయిందండీ!......ఏమిటయిందని యీ రాద్ధాంతం?...... బాగానేవుంది మీ వరస!"

"ఎందుకు బాగుండదు నా వరస.....నీ వరస బాగుంది కనకా, నా వరస బాగులేకపోవడానికి......"

"మీరు ఏమైనా చెపుతారా?......నన్ను పొమ్మన్నారా?.....అవతల బోలెడు పనుంది నాకు......"

"ఏది, నిర్మల ఏది?......"

"ఇందుకోసమేనా యీ గొడవంతా......ఎక్కడికో షికారుకో సినిమాకో వెళ్ళివుంటుంది."

"ఎవడితో వెళ్ళింది?... ఎవడితో వెళ్ళిందే?" కోపంగా అడిగారు రావుగారు. తెల్లబోయిచూసింది జానకమ్మ.

"ఏమిటండీ!"

"నీ కసలు పిల్లలసంగతి ఏమైనా తెలుస్తోందా? ఎంతసేపూ వంటింట్లోపడి చావడమేగాని... పిల్లల సంగతి ఏమైనా తెలుస్తోందే నీ కసలు? మంచి చెడ్డా ఏమైనా చూస్తున్నావా?"

"ఏమిటయిందో చెప్పకుండా ఏమిటీ గొడవా మీరూనూ!" చిరాకుపడింది జానకమ్మ.

"ఏమిటింకా చెప్పడం!......అది....నీ కూతురు అడ్డమైనవాడితో ఏ రోడ్డుమీద చూసినా, ఏ పార్కులో చూసినా.....ఏ సినిమాలో చూసినా కనిపిస్తోందని వూరందరికి తెలిసినా నీకు, నాకు తెలిసిందే?......ఎప్పుడు వెడుతూందో, ఎప్పుడు వస్తోందో, ఎక్కడికి వెళ్ళిందో...... ఏంచేస్తోందో నీవేమయినా చూస్తున్నావా?.....నేనంటే ఆఫీసులో ఏడ్చేవాడిని..... యింట్లోవుండే నీవైనాచూస్తున్నావా దాని సంగతి......అది అలా విచ్చలవిడిగా తిరుగుతున్నా చూస్తూ ఏం అడగకుండా కళ్ళు మూసుకుని వూరుకున్నావా?.....మూడు నెలలనించి జరుగుతున్న యీ భాగోతం యివాళ దాకా నాకు తెలియలేదు.... ఆ శంకరంగారు చెపుతూంటే ... నా వళ్ళు చచ్చిపోయింది.....పెళ్ళీడు కొచ్చినపిల్ల అలా రోడ్లమ్మట... .ఏ దౌర్భాగ్యుడితోపడితే ఆ దౌర్భాగ్యుడితో తిరుగుతూంటే యింక దానికి పెళ్ళి ఎలా అవుతుందే!......"

"ఎందుకండీ అలా చిందులు త్రొక్కుతున్నారు. దౌర్భాగ్యులతో ఎందుకు తిరుగుతుంది!...... అడ్డమయిన వాళ్ళతో తిరగనిస్తానా..... నాకామాత్రం తెలియదనుకున్నారా?" నిబ్బరంగా చెపుతున్న జానకమ్మవంక తెల్లబోయిచూశారు రావుగారు.

"ఏమిటీ!.....అయితే నీకు తెలుసన్నమాట! అదిలా తిరుగుతున్నట్లు నీకు తెలిసే వూరుకున్నావంటే! దానికి బుద్ధిలేకపోతే నీకూ బుద్ధిలేకపోయిందా?......అవ్వ! పెళ్ళీడు కొచ్చినపిల్ల అలా తిరుగుతూంటే చూస్తూ వూరుకోవడానికి నీ బుద్ధి గడ్డితిందే!" కోపం పట్టలేకపోయారు రావుగారు.

"నా బుద్ధి గడ్డితినలేదు......నిక్షేపంలా వుంది. కాబట్టే వూరుకున్నా!... మీ మాత్రం మంచి చెడ్డా నాకు తెలియవనుకున్నారా?.....అడ్డమయిన వాళ్ళతో ఏం తిరగడంలేదు అది......నిక్షేపంలాంటి కుర్రాడితో, నెలకి ఐదువందలు తెచ్చుకునే రాజాలాంటి అబ్బాయితో తిరుగుతూంది!"

"వాడెవడైతేనేం? ఎన్ని వందలు తెచ్చుకుంటే మనకేమిటే, పరాయి మగవాడితో యీడొచ్చిన పిల్లని తిరగనిస్తావా?......వాడేం నీ అల్లుడా?..... అలా విహారాలుచేస్తూంటే చూస్తూ సంతోషించడానికి.......!"

"ఆ.......అల్లుడు కాకపోయినా..... కాబోయే అల్లుడుగాబట్టే వూరుకున్నాను. లేకపోతే వూరుకుంటానేమిటి చూస్తూ......!"

"ఎవడేవాడు..... ఆ కాబోయే అల్లుడెవడో! .... ఏమిటి తల్లీ, కూతుళ్ళు యిద్దరూ కలసి ఏం నాటకం ఆడుతున్నారు!. ....ఇంట్లో మగవాడిని వున్నానని కూడ మరచిపోయి, ఇద్దరూ ఎవరికి వారే పెద్దలయి పోయారా?......నీ కూతుర్ని పెళ్ళాడు తానని చెప్పాడే వాడు?...... యీ బుద్ధి దానికి పుట్టిందా?" భార్య ధోరణి విపరీతమైన కోపం తెప్పించింది రావుగారికి.

"ఎవరికి పుట్టితే ఏం..... మంచి బుద్ధేపుట్టింది గాని చెడు బుద్ధేంగాదు ..... నిక్షేపంలాటి అల్లుడు రాబోతూంటే, కొంపమునిగినట్లు అలా రాద్ధాంతం చేస్తున్నారేమిటి?"

"నీకేం మతివుందా? పోయిందా? అల్లుడంటావు....అవబోతాడంటావు, నీ కూతుర్ని చేసుకుంటానని నీతో వచ్చి చెప్పాడా?......"

"చెప్పలేదు యింకా, చెపుతాడు".

"నీ కెలా తెలుసు?... ఏమిటే యీభాగోతం!.."

"అలా అడగండి చెపుతాను!...... ఎందుకు చేసుకోడు మన అమ్మాయిని. మన అమ్మాయికి ఏం లోటు......చదువుతక్కువా, అందం తక్కువా? మూడు నెలలనించి అమ్మాయి, ఆ అబ్బాయి చక్కగా చిలకా గోరింకల్లా, జంటగా తిరుగుతూ, ఒకళ్ళొకరు ప్రేమించుకున్నారు......రేపో, మాపో పెళ్ళి కూడ చేసుకుంటారు. కట్నాలు కానుకలు అక్కర లేకుండా దాని పెళ్ళి అదే చేసుకుంటుంది....."

"ఏమిటే నీ కాధైర్యం.....చేసుకుంటాడని దాన్నలా విచ్చలవిడిగా తిరగనిస్తున్నావు......తరువాత చేసుకోవంటే ఏంచేస్తావేం?"

"శుభం పలకరా అంటే......ఏదో అన్నాడు మీలాంటివాడే గాబోలు, అతనలాంటి తగాకోరు వాడు......అల్లరి చిల్లరవాడుగాదూ.... పెద్ద మనిషి, ఉద్యోగస్థుడు, యిద్దరూ యీ మూడునెలల నించి ఎంతో అన్యోన్యంగా తిరుగుతున్నారు. ఒక రంటే ఒకరికి ఎంతో యిష్టం! యింతదాకా వచ్చాక ఎందుకు చేసుకోడు!''

"అయితే యిదంతా నీ పన్నాగమేనా?..... దానితో చెప్పింది నీవేనా?'' తెల్లబోతూ ఆశ్చర్యంగా చూశారు రావుగారు.

"ఆ......నేనే చెప్పాను......నే వప్పుకుంటేనే అదలా తిరుగుతూంది అతనితో. అమ్మనైపెట్టా పెట్టరు అడుక్కుతినానీయరు అంటే ఎలాగ్? పాతిక ఏళ్ళు మీద పడుతున్నాయి. యింతవరకు మీరు పెళ్లి చేయలేకపోయారు.....దానంతట దానిని వదిలితే అదే తెచ్చుకుంటుంది మొగుడిని!.....మన వంతు రెండు అక్షింతలు చల్లడమే!.....దమ్మిడీకట్నం లేకుండా పని జరిగిపోతుంది......'' ధీమాగా అంది జానకమ్మ.

"హోసి, నీ అసాధ్యంకూలా! ఎంత దానివే!...... మాటమాత్రమైనా నాతో చెప్పకుండా ఇద్దరూ యింత నాటకం ఆడుతారా?''

"ఆ.....చెపితే చేసే నిర్వాకం ఏమిటి? అడ్డు పుల్లలు వేయడమేగా! ఆంక్షలు పెట్టడమేగా!'' మూతి తిప్పింది జానకమ్మ.

"అయితే ఎప్పుడో యిద్దరూ పెళ్లాడుతారని.... ముందే యిద్దరూ యిలా తిరుగుతూంటే లోకం ఏమనుకుంటుందే!......''

"ఆ.....లోకం!....మరేం పనిపాటులేని లోకం అను కోడానికేం! మన తిప్పలు మనం పడతాము..... అవన్నీ లెక్కచేస్తూ కూర్చుంటే ఎలా?.....మీరు ఐదేళ్ళుగా సాధించలేని పని అది ఐదు నెలలో సాధించు కొస్తుంది........ఇంకో నెలలో రాజాలాంటి అల్లుడు వస్తాడూ చూస్తూండండి........'' ముసి ముసి నవ్వులు నవ్వింది జానకమ్మ.

"అయితే......యీ తెలివితేటలు..... యీ బుద్ధి నీకెలా పుట్టింది? యింత బుర్ర యీ ఆలోచనా నీదేనా!......''

"పూర్తిగా నాది కాదనుకోండి.....ఆమధ్య ఏదో పత్రికలో ఒక కథ చదివాను......యిలాగే కట్నాలు కానుకలు యీయలేక ఆడపిల్ల పెళ్లి చేయలేక పోతాడు ఆతండ్రి.....ఆ అమ్మాయి కాస్త బాగా చదువుకున్న అమ్మాయి......యింక యీ తల్లి దండ్రులవల్ల అయ్యేపనికాదని......తనే ధైర్యం చేసి ఒక అబ్బాయిని ప్రేమించి దమ్మిడీ ఖర్చు లేకుండా రిజిష్టరు మేరేజి చేసేసుకుంటుంది! మన అమ్మాయికి రిజిష్టరు మేరేజివద్దు.....మనమే లక్షణంగా పెళ్లి చేసేద్దాం. ఆమాత్రం పెళ్లి చేయ లేకపోం, కట్నాలు యీయలేకపోయినా!......'' కూతురు పెళ్లి నిశ్చయం అయినట్లే మాట్లాడ సాగింది జానకమ్మ.

"నీ తెలివి తెల్లారినట్లే వుంది.....యిదంతా కథలు చదివిన ప్రయోజకత్వమా!.....బాగా వుంది.....కథల్లోలా జరుగుతే...లోకంలో ఎంతమందో పెళ్లిళ్ళు చేసేసుకుని వుండేవారు యీపాటికి...... యింతాచేసి ఆ అబ్బాయి కుటుంబం, మంచి చెడ్డా ఏమైనా విచారించావా లేదా?...''

"కాకేం!...... ఆ సంగతి మీరు చెప్పాలా?.... వాళ్ల బంట్రోతుద్వారా అన్ని సంగతులు రాబట్టే.... ముందడుగువేశాను......''

"అయితే యింతకీ నిర్మలకి, అతనికి పరిచయం ఎలా అయిందే!......'' కుతూహలం ఆపుకోలేక అడిగారు రావుగారు.

"పరిచయం ఏమిటండీ... ..ఆ వయసులో వాళ్లకి ఒకరినొకరు ప్రేమించుకోడానికి పరిచయం ఉండాలేమిటి? ఆ అబ్బాయి రెండు మూడు సార్లు ......మన నిర్మలవైపు చూడడం గమనిం చాను నేను........మన నిర్మల కూడ అతి నా యింట్లోకి వచ్చిందగ్గిరనించి వీధులో తారట్లా డడం,.... ఆ కిటికీముందు కూర్చోవడం...ఇద్దరూ వాలుచూపులు చూసుకోవడం అన్నీ కనిపెట్టాను..''

"కనిపెట్టి గాలం వేశావన్నమాట!''

"మరేమిటనుకున్నారు!....మొదట్లో అమ్మాయి ఏవో పుస్తకాలు తెప్పించుకునేది పనిమనిషిద్వారా!... తరువాత ఇద్దరూ ఒకరి నొకరు చూసుకుని నవ్వు కోవడం కళ్లతో మాట్లాడుకోవడం అన్నీ గమనించి... పండగనాడు అతనికి పాపం వంటరివాడని పిండి వంటలు పంపించాను వాళ్ల బంట్రోతుచేత. .... ఆ అబ్బాయి సంతోషపడి నన్ను చూసి నమస్కారం చేశాడు. తర్వాత దాని పుట్టింరోజున అతనిని మన యింటికి అమ్మాయిచేత టీకి రమ్మని చీటి రాసి పంపించాను. అతను వచ్చాడు. ఇద్దరూ .... ఎంతో చక్కగా మాట్లాడుకున్నారు....యిద్దర్నీ సినిమాకి పంపించాను.....యింక ఏముంది.....అప్పటి నించి యిద్దరూ......ప్రేమించుకున్నారు.... వాళ్లి ద్దరూ తిరుగుతూంటే నేనేం అడ్డుపెట్టలేదు..... రేపో, మాపో పెళ్లిచేసుకుని మనభారం తగ్గిస్తారు...''

"బాగానేవుంది వరస........యింట్లోవున్న నాతో ఒక్క ముక్క అయినా చెప్పకుండా యింతనాటకం ఆడుతున్నావా?......''

"చెపుదామనుకున్నాను......వాళ్ళు నిశ్చయం చేసు కున్నాక చెప్పచ్చని వూరుకున్నాను....''

"ఆ నిశ్చయం ఎప్పుడో జరిగేవరకు.....వూరంద రికి ఏమని సమాధానం చెప్పడమే......నాకేం నచ్చలేదీ వ్యవహారం!''

"అదిగో, మిమ్మల్నిచూస్తే నాకందుకే మంట!.. మీరు పెళ్లి చేయలేరు. చేసుకునేదానిని చేసుకో నీయరు......ఒక్కనెలరోజులు కళ్ళుమూసుకు వూరు కుంటే సరి. అన్నీ చక్కబడతాయి. యీలోపల అనేవాళ్ళని అననీండి, పట్టించుకోకండి.''

"ఏమో!...... నీ తల్లి కూతుళ్లు యిద్దరూ ఏం చేసుకుంటారో చేసుకోండి .... నాకేం తెలి యదు......తరువాత ఏదైనా అయితే మాత్రం వూరుకోను......ఆ......!''

"ఆ...అలా మీరూరుకోండి! .... అంతే చాలు!.......కూతురి పెళ్లి చేసినంత ఫలం......!''

* * *

"ఏమే!...... నీ కూతురి పెళ్లి ఎందాకా వచ్చింది?''...... అప్పుడే నెలరోజులయింది చెప్పి నీవు?........ పోరాలు యింకా ఎక్కువైనాయట్లే వుంది!.....వూళ్లో తలెత్తుకు తిరగాలా వద్దా నేను. ప్రతివాళ్లు గుసగుసలాడడమే!...... వింతగా చెప్పు కోవడమే!......నన్ను ప్రశ్నిస్తారేమిటి ఇద్దరూ కలిసి!......నీ ప్రతాపం......నీ కూతురు ప్రతాపం యింకదాని......వాళ్లిద్దర్నీ ఆపేసుకునే పెళ్లి త్వరగా చేసుకుని, తర్వాత విడవమను........''

"బాగుందండీ మీవరస!...... చేసుకుంటారు వాళ్ళు, మీకెందుకా తొందర!....... పెళ్ళంటే నిమిషాలమీద నిశ్చయించు కుంటారా?.... ఇద్దరూ బాగా సన్నిహితు లవ్వాలా?........ వాళ్ల స్నేహం బలపడాలా?...... లేకపోతే ముందురోజే పెళ్లిమాటలు ఆడేసుకుంటారా?...... వాళ్ల వాళ్లని అడగద్దూ, మంచి చెడ్డా చూసుకోవద్దా అతను మాత్రం......''

"అసలు...... యింతకీ...... పెళ్లి చేసుకుంటా నని ఖచ్చితంగా చెప్పినట్లేనా!''

"చెప్పలేదు యింకా....... నీవే అమ్మాయిని నెమ్మదిగా అడగమని చెప్పాను నిన్ననే, చేసుకుంటా డండీ,....... అమ్మాయంటే ఎంత ప్రేమో తెలుసా! అమ్మాయి పుట్టింరోజున చక్కని పుస్తకం ప్రజంట్ చేశాడు. మొన్న పండక్కి అరవై రూపాయల చీర బహుమతీ యిచ్చాడు. యిదంతా ఇష్టంలేక పోతే ఎందుకు చేస్తాడు...!''

"ఏమో యిదంతా నాకేం నచ్చలేదు, నాకీ సంగతి తేల్చి చెప్పాలి వారం రోజుల్లో, నీవే అడుగు తావో, నీ కూతురే అడుగుతుందో అదంతా నాకు తెలియదు. నాకు ఏకబురు నిశ్చయంగా వారం రోజుల్లో చెప్పండి. యీ వ్యవహారం పూర్తి కుంటూంటే చాల దూరమే వెళుతూంది.... ఏదో పీకల మీదకి తెచ్చేట్టున్నారు యిద్దరూ కలిసి.

"ఏమిటండీ...... మీ అనుమానాలు మీరూను..... అన్నింటికీ తొందరే....... రేపే అడగమంటాను దాన్ని..........''

"ఏదో ఏడవండి...... తొందరగా మాత్రం యీ సంగతేదో తేలాలి!''

* * *

"ఏమండీ... ... మీరొకసారి ఆ గోపాలరావుతో మాట్లాడిరావాలి!''

"ఏ గోపాలరావు?''

"అదే.... అతనే........ మన నిర్మల స్నేహి తుడు గోపాల్‌తో మాట్లాడండి వెళ్లి!''

"నేనా?........ నేనెందుకు మాట్లాడ్డం!'' ఆశ్చర్యంగా చూశారు రావుగారు భార్యవైపు.

"బావుంది, ఎందుకేమిటండీ,....... మీకూతురి పెళ్లిసంగతి మీరు కాకపోతే ఎవరు మాట్లాడు తారు?''

"ఏం ఏమయింది?....... నేను మాట్లాడవలసిన అవసరం ఏమి వచ్చింది? నేను మాట్లాడడమూ, నేను మంచి చెడ్డా ఏం చూడక్కర లేదుగా!....... అన్నీ నీ కూతురే నిశ్చయించుకుంటుందేమో!''

"బాగుంది అలా అంటే ఎలాగండీ.......!''

"ఏమిటే బాగుండక పోవడం, నీవు, నీకూతురూ కలసి రాజాలాంటి అల్లుణ్ణి తెస్తారేమో, ఏమ యింది?..... ఏం చేసుకోను పొమ్మన్నాడా ఏమిటి?''

"ఏమిటండీ ఆ అపశకునం మాటలూ మీరూను ఎందుకు చేసుకోనంటాడు .....''

"మరలయితే సరిగ్గా అడగడమెందుకు!..... నిర్మల అడిగిందా? ఏమన్నాడు?''

"ఆ........ నిన్ననే అడిగిందట...... ఇదివరకు రెండు మూడుసార్లు చూచాయగా అడిగితే 'చూద్దాం చూద్దాం......చేసుకుందాం తొందరేం' అని దాటవేశాడట....... నిన్నను అడిగితే..... 'చేసుకో

నప్పులో...... అని ఏనంగతి సరిగా చెప్పకుండా దాటేశాడట.......''

"అయిందీ...... నేననుకున్నంతా అయింది..... వింటే విన్నావు కాదు........ చేసుకుంటాడని దాన్నలా విచ్చలవిడిగా తిరగనిచ్చావు, మహా తెలివితేటలు నీకే వున్నట్టు. అతనికి కూతురిని చూపించి వలలో వేసుకుందామనుకున్నావు...... నీపాటి తెలివితేటలు అవతలి వారికి లేవనుకున్నావు,....... ఏం యిప్పుడు ఏం చేస్తావు? వాడు చేసుకోనంటే!..... చేసుకోను పొమ్మంటే నీవు, నీ కూతురు ఏం చేస్తారే....''

"అబ్బబ్బ...... వుండండి...... అప్పుడే ఏదో కొంప మునిగి పోయినట్టు అలా అరుస్తారెందుకు!''

"ఇంకా ఏంకొంప మునగాలని నీ ఉద్దేశం..... యిది చాలదే....... యిప్పుడు దాన్ని అతను చేసుకోనంటే దాని గతేమిటే,...... యింక యీ జన్మలో దాన్ని ఎవరైనా పెళ్ళాడుతారా?........''

"కాస్త చెప్పిన మాట వినకుండా ఎందుకండీ అలా రాద్ధాంతం చేస్తారు! అతనేం యింకా చేసుకోనని చెప్పలేదు, చేసుకుంటానని చెప్పలేదు........ అది చిన్నదీ, మంచి చెడ్డా ఎలా అడగాలో దానికేం తెలుస్తుంది....... పెద్దవాళ్ళం మనం వుండగా అదేం మాట్లాడుతుంది?....... కాస్త మీరెళ్ళి అతనితో మాట్లాడి......... అసలు అతని అభిప్రాయం ఏమిటో తెలుసుకురండి........ వాళ్ళ వాళ్ళకి రాయమంటాడో ఏమిటో అడిగిరండి.......''

"ఏం యిప్పుడు నా సహాయం కావల్సి వచ్చిందా? ముందు నన్నడిగే చేసారా మీరిద్దరూ, యీరోజు నేనడిగి రావడానికి. వెళ్ళు..... నీవే వెళ్ళి ఏం మాట్లాడుతావో మాట్లాడి..... కూతురి పెళ్ళి చెయ్యి ...... నేవెళ్ళను .......''

# వల

"అలా అంటే ఎలాగండీ, .. మగవారు మీరు వుండగా నేనెలా మాట్లాడుతాను! ఏం బాగుంటుంది! అలా కోపం తెచ్చుకుంటే ఎలా?...... మన పిల్ల మంచిచెడ్డలు మనం చూడకపోతే ఎలా?''

"ఆహా..... హా...... ఏం చక్కగా చెప్తున్నావు? ఇదివరకు ధీమాగా చెప్పిన కబుర్లు అన్నీ ఏమయి పోయాయి! ....... నేనూరుకుంటే చాలు.... పెళ్ళయి పోతుందన్నావు!....... పూరికే అన్నారా 'ఆడపెత్తనం మంగలి వైద్యం'అని..... చేసావు నిర్వాకం........''

"చాల్లెండి ఏందెప్పుతారు గాని....... వెళ్ళి మాట్లాడిరండీ,.... బహుశా పెద్దవారు మీరేం అడగలేదనే అతనలా అనివుంటాడు......''

"యిది పెద్దవాళ్ళు చేసే పెళ్ళి కాదుగా?....''

"బాబూ మీకో నమస్కారం....... ఏదో పొరపాటయింది...... లెంపలేసుకుంటాను, వెళ్ళి అడిగి రండి''......... గర్వంగా తలెత్తి చూశారు రావుగారు.

* * *

"ఏమండీ...... ఏమన్నాడండీ అతను?'' వాడిపోయిన ముఖంతో వచ్చిన భర్తని ఆదుర్దాగా అడిగింది జానకమ్మ. భార్యవంక ఉరిమి చూశారు రావుగారు.

"ఏమవుతుంది పిండాకూడు!...... నే ముందే చెప్పాను...... నాకు తెలుసు యీ వ్యవహారం అంతా! పెద్ద తెలివితేటలు నీకేవున్నాయని...... అబ్బాయిని వలలో వేసుకుని..... దమ్మిడీ కట్నంలేకుండా పెళ్ళి చేసేద్దాం అనుకున్నావు....... అనుకుని వప్పులో కాలేశావు!........ యింక యిప్పుడు ఏంచేస్తావు?.... యీవూర్లో యింక నేను తలెత్తుకు తిరిగే తాహతు పోయింది..... .. దానికి యీ జన్మకి పెళ్ళయ్యే గీత తప్పింది. ఏడవండి యిద్దరూ కలిసి.....''

తీక్షణంగా చూస్తున్న భర్త చూపులకి భయపడింది కలవరపడుతూ "ఏం జరిగిందండీ అసలు ...... ఏమన్నాడు అతను, చేసుకోనన్నాడా?.....''

"ఆ....... లేకపోతే........ఎగిరి గంతేసి నీకూతురు పాటిది యింకెవరూ దొరకరని వెంటనే చేసేసుకుంటాడనుకున్నావా?........ చేసుకోను పొమ్మన్నాడు...... నేనేం పెళ్ళి చేసుకుంటానని మీతో చెప్పానా అని ఎదురు ప్రశ్న వేశాడు........ మీరు పొరపడి అలా అర్థం చేసుకోవడం నాతప్పా అన్నాడు! అసలు మీకు ఆ అభిప్రాయం ఎలా కలిగింది..... నేనెప్పుడూ అనలేదే! అని ఆశ్చర్యపోయాడు ...''

"అంతాతే..... అలా పెళ్ళీడు పిల్లతో, ..... వయసొచ్చిన పిల్లతో........ ఎందుకు తిరిగాడు..... ఎందుకు దానికి ప్రజెంట్సు అవి పంపాడు......''

కోపంతో జానకమ్మ మాటలు తడబడ్డాయి.

"అడిగా అదీ అడిగా! నేనేం మీ అమ్మాయిని నాతో తిరగమని కోరలేదు... ...నాతో స్నేహం చెయ్యమని అంతకంటే అడగలేదు..... ఆ అమ్మాయంతట ఆ అమ్మాయే నాతో మాటలు ఆరంభించి పరిచయం చేసుకుంది...... నన్ను ఆకర్షించడానికి ప్రయత్నించింది....... కోరి ఆ అమ్మాయంతట ఆమె వస్తానంటే నాకేం పోయిందని తిరిగాను .. మగవాడిని, ఆమెకి లేని అభ్యంతరం నాకేంవుంటుంది!...... స్నేహంగా వున్నామని ఏవో సందర్భంలో చిన్న ప్రజెంట్స్ యిచ్చాను. కలసి తిరిగినంత మాత్రాన పెళ్ళాడాలని ఎక్కడైనా వుందా?......... ఆడపిల్లని అలా స్వేచ్ఛగా వదలడం మీతప్పా? లేక నేను నిర్మలంగా తిరగడం తప్పంటారా, మీకులేని అభ్యంతరం నాకెందుకుండాలి'' అన్నాడు. అనవలసినదంతా ధీమాగా మొహం మీదే అన్నాడు.......''

"అంటూంటే మీరలా వూరుకున్నారండీ..... మొహం వాచ్చేక...... పెద్దమనిషి, ఉద్యోగస్థుడు నాలుగు నెలలు తిరిగి యిప్పుడు లేదంటాడా? ... మొహం పగులగొట్టి ముందూ యీడ్చకుండా మీరలా వూరుకున్నారు. అసలు మిమ్మల్నన్నాలి, గట్టిగా నాలుగూ అడక్కుండా వూరు...''

"నోర్మూయవే!......'' కోపంతో హుంకరించారు రావుగారు........ "అట్టే పేలకు..... చేసిన నిర్వాకం చాలక....... పైగా నామీద ఎడుతున్నావా...... నాతో చెప్పకుండా చెయ్యకుండా,...... ఇద్దరూ కలిసి తెలివితేటలనుకుని వెధవపని చేసి, యింకా నోరు మూసుకు వూరుకోక నన్నంటావా?........ముందు నా సలహా అడిగి చేసావా?....... అసలు నాతో చెపితే యింతదూరం వచ్చేదా వ్యవహారం!...... అడగలేదట! ఏం అడుగుతాము?.... ఏ మొహం పెట్టుకు అడుగుతాము....... అతనన్న దానిలో ఏం తప్పువుందని అడుగుతాను...... తప్పు మనలో వుంచుకుని పైగా అతన్నేం అనమంటావు? నీ కూతుర్ని అతనితో తిరగడానికి పంపించమని అతనొచ్చి నిన్నడిగాడా? ... నీ కూతుర్ని పెళ్ళాడుతానని నీకేం మాట యిచ్చి మోసం చేశాడా? ఏమని అడగమన్నావు? ...



చేసిన పనికి నోరు మూసుకుని వుండకుండా యింకా పేలుతున్నావు?......" ఆవేశంగా అంటున్న భర్త వంక తప్పుచేసిన దానిలా చూసి తలదించుకుంది.

"అదేది ....... ఆ నిర్మల ఏది?...... వుత్త షికార్లతోనే సరి వుచ్చిందా? లేక యింకా పైకి వెళ్ళిందా యిద్దరి స్నేహం...... అతనికేం మగ వాడు,...... ఏదన్నా జరిగితే...... దీని గతేమిటి?..... మనం ఎలా మొహం ఎత్తుకు తిరుగుతాం..... యిప్ప టికే నలుగురి నోళ్ళలో పడ్డాం,....... ఏదో వుత్త స్నేహం అయితే పరవాలేదు........ దాన్నడుగు అసలు ఏంజరిగిందో వాళ్ళ మధ్య........ కనుక్కో- ఏడు!" విసుగంతా మొహం మీదే చూపించారు రావుగారు.

"ఇకనేనా జాగ్రత్తగా వుండి ఏడవండి........ అతి తెలివితేటలకిపోక........ జరిగింది చాలు........ యిక మళ్లీ అది గడపదాటి బైటకి వెళ్లినట్లు తెలిసిందో ముందు నీపని పడతా జాగ్రత్త!.....ఆ..!"

*          *          *

"ఏమండీ ... . ఏమండీ........" దాదాపు ఏడుపు గొంతులో అన్న జానకమ్మ వంక చూశారు రావుగారు.

"ఏమండీ......." వణికే గొంతుతో అంటున్న భార్యవంక చిరాగ్గా చూశాడు. "ఏం కొంప మునిగిందని అలా ఏడుపుమొహం పెట్టావు!"

"కొంపే మునిగిందండీ!........"

"ఏమిటే అది!"

"ఏం చెప్పమంటారు?..... ఖర్మ!..... నిర్మల కొంప ముంచిందండీ!......"

"ఆ!......"

"అవునండీ...... పదిహేను రోజులనించి దాని వరస నాకు అనుమానంగానే వుంది..... యివాళతో అనుమానం తీరిపోయింది........ కొంప ముంచిం దండీ!..... యింత పని చేస్తుందనుకోలేదు....... యిప్పుడెలాగండీ,...... నాకు కాళ్ళు చేతులు ఆడ్డం లేదు........!...... ఎలాగండీ......"

"ఎలాగండీ!....... సిగ్గులేకుండా యింకా అడుగు తున్నావు?..... యీ సలహా దాన్ని వూరిమీద వదిలే ముందు అడిగేవుటే....... అంతా అయిపోయాక నా సలహా కావల్సి వచ్చిందా?....."

"అసలే ఏడుస్తూంటే యింకా ఎందుకండీ మీ దెప్పుళ్ళు....... మన దెబ్బలాటకేంగాని......... ముందు దారి చూడండి...అది ఒకటే ఏడు స్తూంది ... ఏం అడిగినా చెప్పదు..... ఏదో మామూ లుగా సినిమాలకి షికార్లకి తిరగమన్నాను కాని, యిలా వళ్ళుపై తెలియకుండా పీకలమీదకి తెచ్చుకో మనలేదు........ జాగ్రత్తగా వుండమని మరీ మరీ చెప్పాను......."

"చాల్లే..... యింకా సమర్థించుకొంటున్నావు. చేసిన తప్పు వప్పుకోకుండా, జాగ్రత్తగా వుండమని చెప్పి పంపిందట ..... వయసులో వున్న యిద్దర్నీ స్వేచ్ఛగా తిరిగిరమ్మనిపంపి....... జాగ్రత్తగా వుండ మని చెప్పిందిట!......" పళ్ళు కొరికారు రావు గారు.

"ముందు ఏదో చెయ్యండి..... తరువాత తీరి కాశంగా మనం దెబ్బలాడుకుందాం...... ముందు ఆ గోపాల్ దగ్గరకి వెళ్లి చేతులు పట్టుకు కాస్త బతిమిలాడండి...... [illegible] వప్పించి రండి.....అంతగా అతను వప్పుకోకపోతే... ఏ డాక్టరుకో చూపించి ఏదో [illegible] ఉండి... నలుగురికి తెలిసి మన పరువు బయట [illegible] ఏదన్నా చెయ్యండి! ....."

"హు ..... యింకా మనకు పరువకటి మిగిలిం దేమిటి? ఏనాడో పోయింది.... యిప్పుడింక ఆ మిగి లింది కూడ పూర్తిగా పోతుంది!..... ఖర్మ!....... ఏ మొహంపెట్టుకు అడగను మళ్లీ వెళ్లి....... వాడి కాళ్ళు పట్టుకు బతిమిలాడే ఖర్మ తెచ్చారు తల్లీ కూతుళ్లిద్దరూ కలిసి...."

"అలా అంటే ఎలా చెప్పండి......"

"నీ కూతుర్ని పంపించకూడదే!..... అది వెళితే దాని పరిస్థితి చూసి జాలిపడైనా వప్పుకుంటా డేమో!........"

"మీకంటె ముందేచేసా ఆపని!....... నిన్న పంపించాను...... దీని మొహంచూసి అతను కరగక పోగా... ఎంతో తృణీకారంగా మాట్లాడట... "

"అయిందీ, అయితే నే వెళ్లిమాత్రం ఏమి చెయ్యను!......"

"మీకు చెప్పేసరికి......" జానకమ్మ మాటలు నోట్లోనేవుండిపోయాయి, గేటు తెరచుకుని వస్తున్న గోపాలరావు బంట్రోతుని చూసి........

"బాబుగారు మీకీఉత్తరం యిమ్మన్నా రండీ!" బంట్రోతు ఉత్తరం అందించాడు.

"ఇంకా ఏం ఉత్తరాలు మిగిలాయి బాబూ...... కొంప ముంచింది యింకా చాలలేదనా.... యింకా ఉత్తరాలు ప్రత్యుత్తరాలు......" రుస రుసలాడుతూ [illegible]గా అంది జానకమ్మ. తన పని అయి పోయిందన్నట్లు వెళ్లిపోయాడు బంట్రోతు.

"ఏమిటండీ ఆ ఉత్తరం, మీకా?..... నిర్మలకా? ఏం రాశాడు మహానుభావుడు......"

"ఏమో, చదవనీ!"........

"శ్రీ రావుగారికి,

ఉత్తరం ఏమని మొదలుపెట్టాలో తెలియడం లేదు. ఈ జరిగిన నాటకంలో మీపాత్ర ఏమిటో నాకు తెలియందే, మీకేమని ఉత్తరం రాయాలో అంతు బట్టడం లేదు...... యీ జరిగిన దానిలో మీ ప్రమేయం బహుశా వుండి వుండదని వూహి స్తున్నాను.........

ఈ కాలంలో ఆడపిల్లల పెళ్ళిళ్ళు తల్లిదండ్రులకు ఒక సమస్యగా తయారయ్యాయని నాకు తెలుసు!.... చదువు, కాస్త, కూస్త అందం వున్నా కట్నాలు గుమ్మరించే శక్తిలేక..... ఎందరో కన్యలుగా చాలా కాలం వుండిపోయి తల్లిదండ్రుల గుండెలమీద కుంపటిగా తయారవుతున్నారని ఎరుగుదును! యీ సమస్యని కొత్త సులభంగా పరిష్కరించడానికి యీ మధ్య ఒక క్రొత్త పుంత త్రొక్కినట్లు వింటు న్నాను...... కాస్త చదువుకున్న యువతులు తమంత టతామే ముందడుగువేసి వరాన్వేషణ సాగించి... వచ్చిన వారిని ఎన్నుకుని వారిని ఆకర్షించి ప్రేమా



ఇహనుంచి టైలర్ని జాకెట్‌కి ముందు గుండీలు పెట్టేయమంటాను!

## కల

...జాలు జరిపి, ఆ ప్రేమాయణం వర్యవసానం పెళ్ళిగా మారుస్తున్నారు. కట్నాలు కానుకలు అక్కర లేకుండా వరాన్వేషణలో కృతకృత్యులవుతున్నారని తెలుస్తోంది. సహోద్యోగులనో, లేక కొన్ని ముఖ పరిచయంవున్న ఇరుగుపొరుగు యువకులతో కొద్ది పరిచయమున్న వారితో యీ పద్ధతి అవలం బించి విజయులవుతున్నట్టు వింటున్నాం...... యిలాంటి కథలు కూడ చదివినట్టు గుర్తు.... దీనికి తల్లిదండ్రుల ముఖ్యంగా తల్లుల మద్దతు కూడ వుంటుంది. పిల్లల్ని సోషల్‌గా వదిలి అబ్బాయి లని ఆకర్షిస్తే..... ఆ గాలంలో ఎవరో ఒకరైనా చిక్కకపోరని...... తరువాత తమ పని తేలిక అవు తుందని గుర్తించారు....... ప్రేమ పెళ్ళికి కట్నాలు అక్కరలేదని యీ పద్ధతి అవలంబిస్తున్నట్టు తెలుస్తోంది.........

అంటే కట్నాలని నేను ఆమోదిస్తున్నానని కాదు!..... అలా అని ఆడపిల్లల తల్లిదండ్రులపట్ల నాకు సానుభూతి లేదనిగాదు!...... కాని యీ అవలంబించిన పద్ధతి సరిఅయినది కాదని...... దీనివల్ల చాల ముప్పులు రావచ్చని నా వ్యక్తిగతాభి ప్రాయం!........

నేనూ యిలాంటి వలలో చిక్కుకున్నట్టు నిర్మ లతో స్నేహం ఆరంభించిన మొదట్లో కనిపెట్టలేక పోయాను.... నిర్మల చదువుకున్నా కొన్ని అమాయకురాలు. మాటల సందర్భంలో "యిలా నాతో తిరిగితే మీవాళ్ళు కేకలు వేయరా" అని రెండు మూడుసార్లు అడిగితే, 'ఏమనరని, వాళ్ళమ్మ గారు వప్పుకుంటేనే తను నాతో తిరుగుతున్నట్టు' చెప్పింది...... అప్పుడు గాని నేనూ...... యీ సై చెప్పిన గాలానికి తగులుకున్నానని స్ఫురించింది..... నిజంగా నేను నిర్మల అందానికి ఆకర్షితుడనై ఆమెతో స్నేహం చేసుకున్నా...... నిర్మల,..... మీరు యింత గడుసుగా వ్యవహరించి, నన్ను అల్లుడుగా చేసుకోవాలనుకోవడం నాకు కొంత కోపం కలిగిం చింది.... మీరు నిక్కచ్చిగా మీ అమ్మాయిని చేసుకో మని నన్ను అడిగితే నిరభ్యంతరంగా సంతోషంగా ఆమోదించే వాడినేమో!..... దానికోసం..... యిలా డొంక తిరుగుడుగా వ్యవహరించడం..... నన్నిలా మోసంచేసి గెలవాలను కోవడంతో నాకు పౌరుషం వచ్చింది. అంతేకాక వయసులోవున్న ఆడపిల్లని వంటరిగా ప్రలోభంకోసం పరాయి మగవాడిని నమ్మి స్వేచ్ఛగా వదిలిన మీమీద నాకు కొన్ని తక్కువ అభి ప్రాయమే ఏర్పడింది........

కథల్లో మాదిరి..... నిజంలోనూ యిలా వ్యవహ రిస్తారని స్వానుభవం వల్లనే తెలిసింది. ఆ కథల్లో మాదిరి నేనూ యీ వలలో గ్రుడ్డిగా పడిపోకూడదని నిశ్చయించి నా జాగ్రత్తలో నేనున్నాను...... నిర్మ లతో నేను ఎంత సన్నిహితంగా మెలగినా, నిర్మల నన్ను ఎన్నిసార్లు పెళ్ళిమాట అడిగినా..... పొర పాటున కూడా నేనెప్పుడూ పెళ్ళి చేసుకుంటానని మాటేయలేదు! నేను నిర్మలకి ఎలాంటి భరోసా యివ్వకపోయినా...... మోసమో, ప్రేమో.....ఆమె తెలివి తక్కువో తెలియదు కాని........ నిర్మల నన్ను పూర్తిగా నమ్మి..... పాపం అయినా ఆమె అమాయ కత నాకు జాలే కలిగించింది.

మోసం చేయాలన్న ఉద్దేశం నాకు కలలో కూడ లేదు గాబట్టే నిర్మలతో నేను అంత సన్నిహితుడ నయ్యాను...... కేవలం మీకు పాఠం నేర్పడం కోసమే.......నిర్మలతో నాకిష్టం లేకపోయినా అతిగా సంచరించాను....... మీరు, నిర్మల స్వయంగా పెళ్ళి విషయం అడిగినా...... నిర్మొహమాటంగా నిరాక రించడం కూడ కేవలం మీకు యిలాంటి పనుల వల్ల ఎంత అనర్థం జరుగుతుందో తెలియపరచ డానికే! యింత దాకా వచ్చాక..... యిప్పుడు నేను నిర్మలను పెళ్ళాడనంటే మీరు చేయగలిగింది ఏమి లేదు!...... ఎవరూ కూడ నాది తప్పని అనలేరు! యీడువచ్చిన పిల్లని యధేచ్ఛగా వదిలిన మిమ్మల్నే దుయ్యబడతారు......ఇప్పుడు నేను నిర్మలని కాదంటే ఆమె గతి ఏమిటి? ఆమె జీవితం ఏమవుతుంది?..... ఇవన్నీ మీరు ఆలోచించారా?...... యిలాంటి మోస కారులు, మోసాలు, వంచనలు జరగడం అబద్ధం ఎంత మాత్రంకాదు!........ అంటే నేనొక్కడినే మంచివాడిని, నీతిపరుడిని అనలేను......... కాని..... అలా మీరు మోసపోయే అవకాశాలు చాలవున్నాయి, అలా మోసపోతే........ మీరు చేయగలిగింది ఏమీ లేదు సుమా అని చెప్పడానికే....... నేను మీకు పాఠం నేర్పడానికే యింతదూరం వెళ్ళాను. మీ కోరికని నిరాకరించడానికీ అదే కారణం!.....

యింకా యింకా మిమ్మల్ని బాధించడానికి నా మనసు వప్పలేదు. ముఖ్యంగా నిన్న నిర్మల స్థితి చూశాక..... యింకా యింకా తెగేవరకు లాగ కూడదని పించింది...... నేను ప్రాణంగా ప్రేమించిన నిర్మల ఏడ్చినా తొందరపడితే...... నన్ను నేను ఎప్పటికీ క్షమించుకోలేనని పించింది.

యిలా అమ్మాయిలని 'ఎర'గా చూపించి అబ్బా యిలని వలలో వేసుకుని, అల్లుళ్ళుగా చేసుకుందా మనే వారందరికీ కూడ దానివల్ల జరగబోయే అనర్థాలని కూడ గుర్తించుకుని..... మరీ అలాంటి వలలు వన్నడం మంచిది అని చెప్పడమే నా ఉద్దేశం.

వీలయినంత త్వరలో ముహూర్తం పెట్టిం చండి...... మావాళ్ల అనుమతి కూడ తీసుకున్నాను. యీ స్థితిలో నిర్మలని యింకా అలా అన్ని రోజులు వుంచి లోకుల దృష్టిలో హీనమవడం మంచిది గాదు.

యిన్నాళ్ళు నిర్మలని, మిమ్మల్ని బాధించినందుకు క్షంతవ్యుడిని!'

ఉత్తరం చదివిన రావుగారు తృప్తిగా నిట్టూర్పు విడిస్తే...ఆనందపు సిటీపొరలు కళకళలాడగా... నిర్మల వైపు చూసి...నవ్వుకుంది, తృప్తిగా జానకమ్మ.

**వనితాలోకం:**

# సెయింట్ జోన్ ఆఫ్ ఆర్క్

[ఫ్రాన్సులోని ఒక కుగ్రామంలో ఒక వ్యవసాయదారుని కుటుంబం వుంటుండేది. 1412 లో వారి కొక అమ్మాయి జన్మించింది. ఆ అమ్మాయికి 'జోన్' అని పేరుపెట్టారు. జోన్ చిన్నతనమంతా పశువుల్ని మేపుతూనూ, నేత నేస్తూనూ గడిపింది.

జోన్‌కు పదమూడు సంవత్సరాలు నిండాయి. అప్పుడొక విచిత్ర సంఘటన జరిగింది. పశువుల్ని మేపుతూవుండగా తిన్నగా ఆమె నెత్తిమీదనే ఆకాశంలో ఒక మెరుపు మెరిసింది. అంతే కాదు, అందులో నుంచి ధ్వని వెలువడింది. 'అనామకుడుగా వున్న చార్లెస్‌ను కలుసుకుని అతన్ని 'ర్హెయిమ్స్' రాష్ట్రానికి పరిపాలకుడ్ని చేయడానికి ఉద్యుక్తం కమ్మని' ఆజ్ఞాపించింది.]

"అవును నాన్నా నిజమే. చాలా అద్భుతమైన విషయం. నన్ను వెళ్ళి మన రాజు చార్లెస్‌కు సహాయం చేయనివ్వండి. అమరవాణి నన్ను ఆదేశించింది తండ్రీ!"— జోన్.

(కాని జోన్ తల్లిదండ్రులు ఆ మాటల్ని నమ్మలేదు. పిచ్చితల్లి అనుకున్నారు. ఆమె కోర్కెను త్రోసిపుచ్చారు.)

"అమ్మా, నువ్వు మూడేళ్ళనుంచి కింగ్ చార్లెస్‌ను కలుసుకోవాలని మమ్మల్ని వేధిస్తున్నావు. అంత కన్నా తెలివి తక్కువ ఏమున్నా వుందా? నువ్వు నట్టి వ్యవసాయదారుని బిడ్డవు. అలాంటి పెద్ద సమర్తి ఎందుకు కలగంటావు? నీ చాదస్తం పోవాలంటే నీకు పెళ్ళి చేసేయాలి. నీ ప్రవర్తన అప్పుడుగాని బాగుపడదు."— తండ్రి.

(గత మూడు సంవత్సరాలనుంచి అమరవాణి జోన్‌ను హెచ్చరిస్తూనే వుంది. ఆమె జీవితాన్ని లోకోపకారం కోసం త్యాగం చేయమని బోధిస్తూనే వుంది. ఆ సందేశంలో మరో ఆజ్ఞ కూడా వుంది. అది జోన్ పెళ్ళి చేసుకోకూడదు, జీవితాంతంవరకు కన్యగానే పవిత్రంగా వుండిపోవాలి అనేది.)

"దైవమా, ఇప్పుడు నా కర్తవ్యమేమిటి? తల్లిదండ్రులు నా పెళ్ళికి ఏర్పాట్లు చేసేశారే? నేను ఇల్లు విడిచిపెట్టి వెళ్ళేందుకు వాళ్ళు ఇష్టపడడం లేదు. నా రాజుకు నేనెలా సేవ చేయగల్గుతాను? నేనెవరి ఆజ్ఞను శిరసావహించాలి? తల్లిదండ్రులిదా, నీదా?"— జోన్.

(దైవశాసనాన్ని ధిక్కరించలేక, తల్లిదండ్రుల్ని మీరలేక నలిగిపోయింది జోన్. చివరికి తలిదండ్రుల్నే తిరస్కరించింది. వెంటనే యిల్లు విడిచి 'కింగ్ చార్లెస్' నివసిస్తున్న పట్టణానికి ప్రయాణమయింది.)

"ఎంత గొప్పపని చేశావు జోన్, ఎంత మంచి పని చేశావు! నా ఆదేశాన్ని తలదాల్చావు! వెళ్ళు, ముందుకు వెళ్ళు! దుర్గమమైన మార్గమని భయపడకు. ఆకలి వేసినప్పుడు ధైర్యాన్ని కోల్పోతావేమో, వద్దు. దారిలో నీకు ఎన్నో కష్టనష్టాలు సంభవిస్తాయి. అపాయాలు ఎదురవుతాయి. మరేం ఫరవాలేదు. నేనున్నాను! ఎవరూ నిన్ను హింసించడానికి ముందుకు రారు. నువ్వు ఆడదానివి. ఒంటరిగా ప్రయాణం చేస్తున్నావు. అయినా నీకు ఏ ఆపదా రాదు. తొందరలో కింగ్ చార్లెస్ వుంటున్న పట్టణానికి చేరుకుంటావు తల్లీ!"— అమరవాణి.

(ఆ రోజుల్లో ఫ్రాన్సు, ప్రతిపక్షాల వైరుధ్యంతో మూడు చీలికలుగా వుండేది. ఫ్రాన్సు, ఆర్లియన్స్ రాష్ట్రాలు అప్పుడే ఇంగ్లాండు దురాక్రమణకు గురి అయినాయి. ఇంకా చాలభాగం మిగిలివుంది. అందులో పారిస్ కూడా వుంది. దానిని పరిపాలించడానికి వారసులకు మాత్రమే హక్కు వుంటుంది. కాని డ్యూక్ ఆఫ్ బర్గండీ ఆధిపత్యం చలాయించడం మొదలు పెట్టాడు. న్యాయంగా అది కింగ్ చార్లెస్ హక్కు. అతను నిస్సహాయుడుగా వుండిపోయాడు. దీనికంతటికీ బర్గండీ కుయుక్తులే కారణం. అతను కింగ్ చార్లెస్ తండ్రి బ్రతికివుండగా ఆయన కొలువులో పనిచేసినవాడే. అధికార వ్యామోహం అతని కళ్ళు కప్పి అలా సంచరించాడు. అసలు ఫ్రాన్సు దేశంలో ఒక ఆచారముంది, ఎవరైనా కొత్తగా ఫ్రాన్సు పరిపాలన స్వీకరించినపుడు అతను మొట్టమొదట ర్హెయిమ్స్ రాష్ట్రాన్ని పాలించాలి. ప్రజలు మెచ్చుకుంటే సింహాసనానికి అర్హుడవుతాడు. ర్హెయిమ్స్ రాష్ట్రాన్ని అప్పటికే ఆంగ్లేయులు ఆక్రమించేశారు. వాళ్ళను వెళ్ళగొట్టాలి. కింగ్ చార్లెస్‌ను దానికి రాజుగా మొదట చేయాలి. ఆ తర్వాత అతన్ని ఫ్రాన్సుకు పట్టాభిషిక్తుణ్ణి గావించాలి. ఇంతటి కష్టతరమైన కార్యం వుంది. ఈ మహత్కార్యాన్ని సాధించడానికి జోన్ పూనుకున్నది.)

"చార్లెస్ మహారాజా, దేవుని ఆజ్ఞానుసారం నేను కొన్ని వందల మైళ్ళు ప్రయాణించి మీ దగ్గరికి వచ్చాను. మీరు తప్పితే మరెవ్వరూ రాజు కాకూడదు. నాకు సాయంగా సైనిక దళాన్ని పంపించండి. తుదకు ర్హెయిమ్స్‌కు రాజ్యాభిషిక్తుణ్ణి చేస్తాను ఇది దేవుని ప్రోత్సాహం"— జోన్

(కింగ్ చార్లెస్‌కు జోన్‌మీద నమ్మకం కుదరలేదు. అందుకే పండితులకు కబురంపించాడు. జోన్ చెప్పిన విషయం నిజమవునో కాదో, ఆ సందేశం స్వర్గంనుంచి వచ్చిందో నరకంనుంచి వచ్చిందో తెలుసుకోమని ఆ పండితులకు ఆజ్ఞయిచ్చాడు.)

"మహాప్రభూ మేమింతవరకు ఇలాంటి అద్భుతాన్ని కని విని యుండలేదు. జోన్ తలపెట్టిన కార్యం అంతకంటే కష్టమైనది. అయినా జోన్‌ను పరిశీలించాము. ఆమెను ప్రశ్నించి దీర్ఘకాలిక చర్చల్ని కొనసాగించాము. మాకు నమ్మకం కుదిరింది. ఈ వనిత చెప్పినది యదార్థం. ఈ అమ్మాయి దైవత్వాన్ని సిద్ధించుకున్నది."— పండితులు.

(జోన్‌ను సమర్థిస్తూ పండితులు రాజుకు ఒక జాబు పంపారు. వెంటనే జోన్ ఆదేశానుసారం ఆర్లియన్స్‌ను దండెత్తడానికి సేనల్ని వినియోగించాడు కింగ్ చార్లెస్.)

"ఓ దైవాంశ సంభూతురాలా! దేవుడు నిన్ను కరుణించి గొప్ప శక్తిని ప్రసాదించాడు. ఇంతటి శక్తి సంపన్నురాలైన నువ్వు శారీరక బలాన్ని ఉపయోగించవలసిన అగత్యంలేదు. నువ్వు శస్త్రాస్త్రాల్ని ప్రయోగించనవసరం లేదు చంప నవసరం లేదు. శత్రువులు నిన్ను గాయపరచడానికి ముందుకు వచ్చినప్పుడు, చంపడానికి సిద్ధపడినప్పుడు నువ్వు అందుకు వెనకాడకూడదు. ఏ సమయంలోనైనా సరే చావుకు సిద్ధంగా వుండాలి!"— అమరవాణి.

(దైవానుగ్రహ మెలా వుందో అలానే అక్షరాలా నడిచింది జోన్. గుర్రంమీద స్వారీచేస్తూ, 'జీసస్' అని రాయబడిన ఒక జెండాను మాత్రమే ధరించి సేనల్ని నడిపించింది.

సైన్యం ర్లెయిన్ నగరాన్ని చేరి కోటను ముట్టడించింది. ప్రతిపక్ష సైన్యాలు విపరీతంగా వున్నాయి. అయినా కొద్ది రోజుల్లోనే ఆమెకు విజయం చేకూరింది. ఆంగ్లేయసైన్యం పలాయనం చిత్తగించింది. జోన్ గాయపడి సొమ్మసిల్లి పోయింది. అనుచరులామెను రక్షిత స్థలానికి చేర్చారు.)

"ఓ దయగలదేవుడా! నీకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు! జోన్ వ్యవసాయదారుని కుమార్తె కాదు. దివినుండి భువికి దిగివచ్చిన దేవత. నన్ను ర్హెయిమ్స్ నగరానికి పట్టం గట్టడానికి, ఫ్రాన్సుకు ఏలికగా చేసేందుకు మానవ మాత్రులకు సాధ్యం కానిదాన్ని జోన్ సాధించింది. ఆమె సామాన్యవనిత కాదు."— కింగ్ చార్లెస్.

(ఈ ఘనవిజయాన్ని సాధించిన జోన్ అక్కడితో విడిచి పెట్టలేదు. సైన్యాన్ని పారిస్ మీదకు తరలించింది. అక్కడి ఆంగ్లేయ సైన్యాన్ని, డ్యూక్ ఆఫ్ బర్గండీ బలాన్ని పారద్రోలింది. రాజధానిని వశపరుచుకుంటున్నప్పుడు మాత్రం ఆమెకు అపజయం ఎదురైంది. పరమ ముష్కరాలుగా ఎంచి ఆంగ్లేయులు ఆమెను నిర్బంధంలో వుంచారు. పారిస్ విశ్వవిద్యాలయంలోని పన్నెండు మంది పెద్దల్ని దర్యాప్తుకు నియోగించారు.)

"వివేకవంతులైన తండ్రులారా! నన్ను విచారించడానికి మీరు న్యాయమూర్తులుగా కూర్చున్నారు. నేను చేసిన పనికి దేవుడే బాధ్యుడు. మీరు నన్ను శిక్షించడానికి ఎటువంటి అర్హతను కలిగి వున్నారు?"— జోన్.

(ఆ న్యాయమూర్తులు జోన్ చెప్పినదాన్ని బూటకమన్నారు. మోసగత్తె అని తీర్పు చెప్పారు. కాల్చి చంపాలని శిక్ష విధించారు. ఆ శిక్షకు జోన్ చిరునవ్వుతో స్వాగత మిచ్చింది.)

"నా నేరాన్ని ఒప్పుకునే ముందు మీకు మరో సారి వ్యక్తం చేస్తున్నాను, నేను మహత్తర కార్యాన్ని దేవుని ఆదేశం వల్లనే చేశాను. కింగ్ చార్లెస్ రాజ్యార్హతను కలిగి వున్నాడు. అతన్ని పరిపాలకుడుగా చేయడం ధర్మం. అందుకు నేను తలపడ్డాను. ఈనాడు అతను అపజయాన్ని పొందాడు. కాని అతను ఏనాటికైనా ఫ్రాన్సుకు రాజు కాగల్గుతాడు. ఇది నాకు దేవుడు చెప్పిన నిజం!"— జోన్

(తనను శిక్షించదలచుకున్నవారిని క్షమించమని దేవుడిని కోరుకుంది జోన్. ముళ్ళతో నిండిన పుష్ప శిలువను ముద్దుపెట్టుకొంది.)

జోన్ మాటలు నిజమైనాయి. ఇరవై ఏళ్ళ తర్వాత, ఫ్రాన్సునుండి ఆంగ్లేయ సైన్యాలు పారిపోయాయి. బర్గండీ డ్యూక్, కింగ్ చార్లెస్‌కు రాజ్యాన్ని వప్పగించడం తప్పలేదు.

జోన్‌ను ఫిరంగితో కాల్చి చంపేశారు. ఆమె పవిత్రతకు మాత్రం చావులేదు. 'సెయింట్ జోన్ ఆఫ్ ఆర్క్' అనే పేరు చిరస్మరణీయంగా ప్రపంచ వ్యాప్తమయింది.

—వి. సు.

సీరియల్

# రామశాస్త్రి

వి.ఎస్.సుక్తాంకర్..

## 9

(జరిగిన కథ: మరాఠా సామ్రాజ్యానికి ప్రధాన న్యాయమూర్తి అయిన రామశాస్త్రి ప్రఖ్యాత గొప్ప పండితుడు, ఉదారస్వభావం కలవాడు, దేశమంతటా న్యాయబుద్ధి కలవాడని ప్రసిద్ధి చెందినవాడు. పేష్వా మాధవరావుకు ఆతనంటే చాలా గౌరవం కాబట్టి, వేర్ బిగార్ అనే బానిస పద్ధతిని రామశాస్త్రి పలవా మీద నిషేధిస్తాడు. ఆ నిషేధాన్ని ధిక్కరించిన గన్పియిన్ సుబేదార్ విస్వాజీని కూడ రామశాస్త్రి శిక్షించటానికి వెనుదీయడు. మళ్ళీ పట్టంపట్ల ఎంత గౌరవం కలవాడయినా అవసరం కలిగినప్పుడు ఎంతో కరుణ ప్రదర్శిస్తాడు. శ్యామా అనే బానిసస్త్రీ మరాఠీ సైనికుడూ, కవి, గాయకుడూ అయిన చంఫాజీతో కొన్ని ప్రత్యేక పరిస్థితులలో పరిచయం అయినందుకు శిక్షించకుండా ఆమె యజమానికి నచ్చచెప్పి, వారిద్దరినీ విడిపిస్తాడు. శ్యామా చంఫాజీల కథని విని పేష్వా పతిమణి రమాబాయి సాహెబ్ వారిద్దరికీ రాజభవనంలో ఉద్యోగాలు ఇప్పిస్తుంది.)

"మరాఠా సామ్రాజ్యం మీద పన్నెండేళ్ళుగా ఉజ్వలంగా ప్రకాశిస్తూ వచ్చిన రవి అస్తమిస్తున్నాడు! మన పేష్వా వారి ఆరోగ్యం ఈమధ్య ఏమీ బాగాలేదు! వారి వయస్సిప్పుడు ఇరవై ఎనిమిది మాత్రమే, కాని ఈ పన్నెండేళ్ళ దేశ పరిపాలన కాదు దేశసేవ! వారిని బాగా కుంగదీసేసింది..." అని విచారంగా చెప్తున్నాడు ఆ సాయంత్రం పూనా నగరంలో ఒక పెద్దమనిషి తనతో ముచ్చట్లాడటానికి వచ్చిన మిత్రుడితో.

"ఏమీ! దేవూర్‌కి వెళ్ళినా బాగుపడలేదా? అక్కడ ఆరోగ్యానికి మంచి వాతావరణం ఉందంటారు! పేష్వావారి కులదైవం గణేశుడి ఆలయం అక్కడే కదా?" మిత్రుడి ప్రశ్నలలో ఆశ్చర్యంతో బాటు బాధ కూడా మిళితం అయి ఉంది.

"ఇంతకుముందే దేవూర్ నుంచి వచ్చిన ఒకతన్ని కలిశాను. మాధవరావ్ వారి పరిస్థితి ఏమాత్రం బాగా లేదుట!..."

"దేవూర్ ఇక్కడికి దగ్గరేగా.. ఏదో వార్తలు వస్తూనే ఉంటాయి. ఏదయినా తెలిస్తే మాత్రం నాకు వెంటనే చెప్తూ ఉండండి."

* * *

దేవూర్‌లో రాజమందిరంలో పేష్వా మాధవరావుకి నిరంతర సేవ చేసేవారిలో శ్యామా, చంఫాజీలు ముఖ్యులు. ఎందరు మందులు ఇస్తున్నా, ఎంత మంది సేవచేస్తున్నా పేష్వా కలత చెందిన మనస్సుకి, తన భక్తి గీతాలతో, ఒక చంఫాజీయే శాంతి చేకూర్చగలిగేవాడు.

ఆ ఉదయం చంఫాజీ తన శ్రావ్యమయిన గొంతుకతో తన ప్రభువుకి 'గంగావతరణం' కథ పాడి విని పిస్తున్నాడు. పాటతో బాటు, గంగానది జన్యం కథని చూపి తోలుబొమ్మలాటని కూడా ఆడిస్తున్నాడు. అప్పుడప్పుడు, చంఫాజీ పాటలు విన్నప్పుడు పక్కనే ఒక తెర వెనుక కూర్చుని ఉన్న శ్యామా కూడా మధురంగా గంగావతరణం పాడుతూ ఉండేది. ఈ పవిత్ర కథ విన్న మాధవరావ్ మనస్సు ప్రశాంతం అయ్యేది.

చంఫాజీ పాట ముగిస్తున్నాడు. తన ప్రభువు దీనావస్థ చూస్తూ ఉంటే అతనికి కన్నీరాగలేదు. ఎలాగో తమాయించుకుని గంగావతరణంలోని చివరి చరణం ఎత్తుకున్నాడు. దాని సారాంశం ఇది—

"భగీరథుడు సత్యయుగంలో భూమిని పాలించాడు. కాని, ఈ కలియుగంలో కూడా భగీరథుడి వంటి రాజుని పొందిన మరాఠా సామ్రాజ్యం ఎంత అదృష్టం చేసుకుంది. శౌర్యపరాక్రమాలలోనే కాక ధర్మబుద్ధితో, దైవభక్తితో అలనాటి భగీరథుడికి తీసిపోడు మా ప్రభువు మాధవరావ్ పేష్వా!

సత్యయుగంలో భగీరథుడు భువి మీదకి గంగని తీసుకువచ్చి పవిత్రం చేశాడు. కలియుగంలో మాధవరావ్ మరాఠా సామ్రాజ్యంలో ధర్మం అనే గంగని తీసుకువచ్చి పవిత్ర ప్రవాహంలో అందరినీ పంతోషంలో ముంచెత్తాడు. మన మరాఠా సోదరులం గొంతెత్తి ఈ మహనీయుడి పుణ్యచరిత్ర పాడుకుందాము రండి! మన మరాఠా సామ్రాజ్యాన్ని ధర్మగంగా ప్రవాహంతో పునీతం చేసిన మాధవరావ్ పేష్వా పవిత్ర గాథని పాడుకుందాము రండి!"

"శభాష్, చంఫాజీ! శభాష్" ఆ కంఠస్వరంలో ఎంత భావావేశం దాగి ఉన్నప్పటికీ ఎప్పటిలాగే ప్రశాంతంగా ఉంది. "చంఫాజీ, నీది సిద్ధవాక్కు! నీగానం తరతరాలుగా మరాఠా ప్రజల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోతుంది! మన ప్రభువు పేష్వా మాధవరావ్ వారి కీర్తి అనంతంగా నిలిచిపోతుంది.."

అప్పుడే ఆ గదిలోకి వచ్చిన రామశాస్త్రి చంఫాజీని ఇలా ప్రశంసించాడు.

"నాకూ ఆ అదృష్టశాలి భగీరథుడికీ పోలిక ఏమిటని?" అన్నాడు బలహీన స్వరంలో మాధవరావ్. "ఆ మహనీయుడు తన జీవిత కాలంలోనే తన లక్ష్యాన్ని సిద్ధించాడు. నేను సాధించింది ఏమాత్రం? అసలు ఆ సాధించినదేదో కూడా మీ ఆశీర్వాదం వల్లనే కదా! రామశాస్త్రి గారి వంటి గురువు దొరకటం నా అదృష్టం. కాని ఆయన వద్ద అభ్యసించినది అమలు జరపకుండానే ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోతున్నానే, అది బాధగా ఉంది..."

రామశాస్త్రిని ఈ మాటలు కదిల్చివేశాయి. కంట్లో నీరు నిలవగా ఇలా అన్నాడు: "ప్రభూ! అంతమాట అనకండి. ఈ పన్నెండు సంవత్సరాలలో తమరు పన్నెండు జీవిత కాలాలలో ఇతరులు సాధించలేనంత సాధించారు!"

"భగవంతుడా! ఈ భూమి మీద మరికొంత కాలం ఉంటే నా ప్రజలకి మరికొంత సేవ చేసేవాడిని కదా, ఆ అవకాశం నాకీయవేమి?' మాధవరావ్ తనలో తనే మాట్లాడుకుంటున్నాడు.

రామశాస్త్రి మాధవరావ్ మంచం మీదకి వంగి అతన్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. "ప్రభూ, తమ వంటి చిరంజీవులని మృత్యువు ఏమీ చెయ్యలేదు! తమ కీర్తి ఎల్లకాలమూ నిలిచిపోతుంది! తమరు మృత్యువుని జయించేరు!..' అంటూ తన ప్రియశిష్యుడిని గుండెలకి హత్తుకున్నాడు.

రామశాస్త్రి మాట్లాడుతూ ఉండగానే మాధవరావ్ శిరస్సు అతని గురువుగారి వక్షస్థలం మీదకి వాలిపోయింది.

* * *

ఆ సాయంత్రం వేలమంది ప్రజలు దేవూర్ స్మశానంలో తమ పేష్వా అంత్యక్రియలని చూడటానికని వచ్చారు. మాధవరావ్ భౌతికకాయం దహనమేకాక రమాబాయి సాహెబ్ సహగమనం కూడా జరుగనున్నదని తెలుసుకుని ఇంతమంది వచ్చారు.

ఇంకాపాతిక సంవత్సరాల వయసు నిండని రమాబాయి పసుపుబట్టలతో చితి పక్కనే మంచుని ఉంది. పేష్వా మాధవరావ్ అంటే ఎంత ఇష్టమో

ఆయన ప్రజలకి ఆయన సతీమణి అంటే కూడా అంత ఇష్టమే. అటువంటి ఆమె సయితం ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోతున్నదని ఎందరో కంట తడిపెట్టారు.

అది గోధూళి సమయం. సహగమన ముహూర్తం సమీపిస్తోంది. బ్రాహ్మణులు మంత్రాలు వల్లిస్తున్నారు. ఎందరో స్త్రీలు ముందుకి వచ్చి పవిత్ర 'సతి' రమాబాయి పాదాలని తమ శిరస్సులతో స్పృశిస్తున్నారు. రమాబాయి నిశ్చలంగా, గంభీరంగా వారందరి పాదాభివందనలని స్వీకరించింది. అందరి వద్దా సెలవు తీసుకుంది. అందరి కన్నా చివరివాళ్ళు శ్యామా, చంపాజీలు. అశ్రువులు ధారలుగా ప్రవహిస్తూ ఉంటే ఇద్దరూ వచ్చి ఆమెకి పాదాభివందన చేశారు. రమాబాయి తక్కినవారిని దీవించినట్లే వారిద్దరినీ కూడా దీవించింది కాని శ్యామా పట్ల ప్రత్యేక వాత్సల్యం చూపించింది. ఆమెని లేవనెత్తి ఆప్యాయంగా కౌగిలించుకుంది.

"శ్యామా నువ్వు నా సోదరివి! నువ్వూ చంపాజీ నా మీద చూపిన ప్రేమకి నేనెంత కృతజ్ఞురాలిగా ఉంటున్నానో చెప్పలేకుండా ఉన్నాను. నా తుది కోరిక ఏమిటంటే, నారాయణరావ్, గంగాబాయిల పట్ల కూడా అంత ప్రేమాదరణలని చూపండి! పేష్వా సింహాసన గౌరవాన్ని కాపాడండి. మీ కొత్త పేష్వా, పేష్వా సతీమణికి అన్నివిధాలా సాయపడండి" అంటూ రమాబాయి సహగమనానికి చివర కార్యక్రమానికి ఉద్యుక్తురాలయింది. తన ఒంటి మీది ఒక ఆభరణాన్ని తీసి తనకి ఇష్టం వచ్చినవారికి ఇవ్వటానికి సిద్ధం అయింది.

అందరూ ఈ కార్యక్రమాన్ని కుతూహలంతో చూడసాగారు. ఎందుచేతనంటే, 'సతి' అంతిమ కానుకగా ఒక ఆభరణం ఎవరికయితే ఇస్తుందో వారంటే ఆమెకి అమిత గౌరవం అని అర్థం. అంతే కాక ఈ కానుక పవిత్రమయినది. స్త్రీలు దానిని తమ మంగళసూత్రాలతో సమానంగా చూసుకుంటారు. సతి ఇచ్చే కానుక ఒక పురోహితుడి ద్వారా చదివించటం అప్పటి అలవాటు. యథాప్రకారంగా పేష్వా వారి పురోహితుడు రమాబాయిని సమీపించి ఆమె చెప్పినది శ్రద్ధగా విన్నాడు. విని సతి రమాబాయి తన ఆభరణాన్ని తన అంతరంగిక సఖి శ్యామాకి దానం ఇస్తున్నదని ప్రకటించాడు. ఈ ప్రకటన విన్న అక్కడి జనం ఆశ్చర్యానికి అంతులేదు! సహగమనం చెయ్యపోతున్న సతి తన చివరి దానాన్ని ఒక భృత్య కుమార్తెకి అందులో బానిసగా ఉన్న దానికి ఇవ్వటమా, అనుకున్నారు.

ఇక శ్యామా సంభ్రమం వర్ణనాతీతం. నోట మాట లేక, వణుకుతూ ముందుకి వచ్చి రమాబాయి ఇచ్చిన ఉంగరాన్ని స్వీకరించింది. రమాబాయి తన వేలి మీది బంగారు ఉంగరం తీసి తనే శ్యామా వేలికి తొడిగింది.

ఈ దానం స్వీకరణ అవగానే డప్పులు మోగటం మొదలుపెట్టాయి. దూరంగా రాజమందిరం ఫిరంగులు కాల్చారు. వేలాది సైనికులు తలలు వంచి తమ ప్రభువు వద్ద సెలవు తీసుకున్నారు. చందనపు కర్రల చితి జ్వాలలో పైకి ఎగశాయి. పేష్వా శిరస్సుని ఒడిలో ఉంచుకుని నిశ్చలంగా కూర్చున్న రమాబాయి క్షణంలోనే ఆ జ్వాలలకి ఆహుతి అయిపోయింది.

(సశేషం)



సీరియల్



# జాహ్నవీ హైమవతులు

సి. ఆనందారామం

## జరిగిన కథ

ఉమాపతి అభం శుభం ఎరగని మనిషి. హైమవతి సత్యకాలపు మనిషి. వాళ్లిద్దరి దాంపత్యం ఎంతో అన్యోన్యంగా సాగిపోతూవుంది. హైమ చెల్లెలు జాహ్నవి. జాహ్నవి కాలేజి చదువుకోసం బావగారి వూరు వచ్చింది. మొదట్లో జాహ్నవి ఉమాపతితో కలిసి సినిమాకు వెళ్ళినప్పుడు ఏమీ అనుకోలేదు హైమ. కాని, కొన్నాళ్ల తర్వాత జాహ్నవి గర్భవతి అని తెలిసినప్పుడు భరించలేకపోయింది. చేసేదిలేక తన చేతులమీదుగానే జాహ్నవీ, ఉమాపతుల పెళ్లి చేయించింది. జమీందారీ వ్యవహారాలన్నీ తానే స్వయంగా చూసుకోసాగింది.

## 3

సర్వసాధారణంగా జాహ్నవి హైమ గదిలో కెప్పుడూ రాదు. ఇంట్లో మిగిలిన అందరి యోగ క్షేమాలతో పాటు జాహ్నవి క్షేమం కూడా రోజూ హైమే కనుక్కొంటూ ఉంటుంది.

ఆనాడు జాహ్నవి తన గదిలో కొచ్చేసరికి హైమ మొదట కొంచెం ఆశ్చర్యపోయింది. ఆర్ద్రస్వరంతో

"రా జాహ్నవీ! ఆరోగ్యం బాగుందా?" అంది.

జాహ్నవి కొంచెంసేపు మాట్లాడకుండా కూర్చుంది. తరువాత ధిక్కారం ధ్వనించే స్వరంతో "బావ నిన్ను నాకు యాభై వేలిమ్మన్నాడు" అంది.

ఉలిక్కిపడింది హైమ. ప్రస్తుతం యాభై వేలు ఖర్చు పెట్టవలసిన స్థితిలేదు. అదీగాక ఉమాపతి తన నెప్పుడూ అడ్డగించడని హైమకు రూఢీగా తెలుసు.

"ఎందుకంటా?" అంది సాధ్యమైనంత మృదువుగా.

"కావాలి" అతి నిర్లక్ష్యంగా అంది జాహ్నవి.

ఈ నిర్లక్ష్యం అంతకుముందు హైమ గుర్తించని ధిక్కార స్వరాన్ని కూడా కలుపుకుని హైమకు వాడిగా గుచ్చింది.

"సరే మీ బావ నడిగి తీసుకో!" గంభీరంగా అంది.

"బావ నిన్నడుగుమన్నాడు."

"తాళాలు నా చేతుల్లో ఉన్నా, మీ బావదే అధికారం. ఆయనొచ్చి అడిగితే తాళాలిస్తాను. ఆయన్నే అడిగి కావలసింది తీసుకో!"

"తాళాలు నాకే ఇయ్యి. బావ నన్ను తీసుకో మన్నాడు."

"పసిదానివి. నీకు తాళాలు దాచటం చేతకాదు."

"పెళ్ళయింది. తల్లిని కాబోతున్నాను. ఇంకా పసిదాన్నా?"

"అందుకే పసిదానివి."

ఇంక మాట్లాడటం ఇష్టం లేదన్నట్లు హైమ లేచిపోయింది.

ఆరాత్రి ఉమాపతి హైమ దగ్గిరున్నాడు. తనంత తానుగా హైమ డబ్బు ప్రస్తావన తేలేదు. తేదలచ లేదు. ఉమాపతి కసలు విషయమే గుర్తులేదు. తన అనుమానం నిజమని రూఢయింది హైమకు.

* * *

ఉమాపతి మీద కోపం పట్టేస్తూ అటు తిరిగి పడుకొంది జాహ్నవి.

"అదేవిటి జాహ్నవీ!"

"నేను చచ్చినా బాగుండేది" కసిగా అంది జాహ్నవి.

"ఇప్పుడెందుకు చావటం?" అమాయకంగా ఆశ్చర్యపోయాడు ఉమాపతి.

పళ్లునూరిన రోషంతో బుసకొట్టింది జాహ్నవి.

"అంటే?!"

"అంటే ఏముంది? అప్పుడు ఆ చికాకుల్లో అయితే ఈ మాటన్నా బాగుండేది. ఇప్పుడెందుకని." పాపం, ఓపిగ్గా వివరించాడు ఉమాపతి. జాహ్నవి భళ్ళున ఏడ్చేసింది.

"అంతే! మీకే లోకువయ్యాక అందరికీ ఇక లోకువే. నేను మీ మీద ప్రేమతో నన్ను నేను నాశనం చేసుకున్నాను. చేసిన అపరాధానికి శిక్ష అనుభవిస్తున్నాను.'

ఏడుపు నిగ్రహించుకో లేకపోయింది జాహ్నవి. నిస్సహాయంగా కొంతసేపు చూస్తూ నిలబడ్డాడు ఉమాపతి. తరువాత మెల్లిగా బయలుదేరాడు. జాహ్నవి టక్కున కళ్ళు తుడుచుకుంది.

"ఆగండి' గర్జించింది.

ఠక్కున ఆగాడు.

"కూర్చోండి."

బుద్ధిగా కూర్చున్నాడు.

"అయితే, ఇంక నాకీ ఇంట్లో ఏం స్థానంలేదా?"

"ఈ గది పెద్దదేగా! ఇంకా ఎక్కడ కావాలంటే అక్కడ తిరగొచ్చు."

నుదురు కొట్టుకుంది జాహ్నవి.

"అదికాదు. మీ భార్యగా నాకొక విలువ లేదా అని."

"హైమ నిన్ను నా భార్యను చేసింది. ఎవరు కాదన గలరు?" వింతగా అన్నాడు.

"హైమ హైమ...హైమ.. నేనేమీ కానా మీకు? నన్నెందుకు పెళ్ళి చేసుకున్నారసలు?"

"ఏం చెయ్యను పెళ్ళి చేసుకోక? నీకూ తెలుసుగా' సంజాయిషీ ఇచ్చుకున్నాడు ఉమాపతి.

జాహ్నవి ఉస్సురని నిట్టూర్చింది.

"ఒక్క రవ్వల అడ్డిగ చేయించుకునే పాటి స్వాతంత్ర్యం కూడా లేదా నాకు?"

"ఎందుకు లేదు?"

"ఏమో, నాకేం తెలుసు? అక్కయ్య మిమ్మల్ని అడిగి డబ్బు తీసుకోమంది."

"ఏన్నా?! నా దగ్గిరేముంది?"

"తాళాలక్కయ్య చేతుల్లో ఉన్నా, అధికారం మీదేట! మీరడిగితే తాళాలిస్తుందిట. అడిగి తీసుకుని నాకు డబ్బియ్యండి."

"అయ్యబాబోయ్! నాకా తాళాలొద్దు. ఆ తాళాలు హైమ చేతుల్లో పడినదగ్గిర్నుంచీ సుఖంగా వూపిరి తీసుకుంటున్నాను. ఆ బాదరబందీ హైమనే పడ నియ్యి. నాకా ఓపిక లేదు."

"మరి, నాకు డబ్బిస్తానన్నారు?"

"అవును. హైమ నడిగి తీసుకో!"

"అక్కయ్య ఇవ్వనంది."

"ఇవ్వనందా?" ఆశ్చర్యంగా అడిగాడు ఉమాపతి.

"ఎందుకూ?" అన్నాడు మళ్ళీ.

జాహ్నవి ఆలోచనలో పడింది. హైమ తనతో స్పష్టంగా ఇవ్వననలేదు.

"అధికారమంతా ఆవిడది. నా కెందుకిస్తుంది? నగలూ నాణ్యాలూ కావాలంటే ఆవిడ చేయించు కొంటుంది." ఉక్రోషంగా అంది.

"హైమ నగలు చేయించుకొంటుందా? ఏం నగలు?" పాపం, తన నగలన్నీ పీకిచ్చినప్పటి నుండే బోసిగా ఉంది. చేయించుకొమ్మని అప్పుడే చెప్పాను. వినలేదు. చూడు! ఇప్పుడు నువ్వు చెప్తే చేయించు కొంటుంది. హైమను కూడా నగలు చేయించు కొమ్మని చెప్తావు, కదూ! లేకపోతే తనంత తను చేయించుకోదు. నాకు తెలుసు. నువ్వు చాలా మంచి దానివి జాహ్నవీ!"

"ఈమధ్య కాలంతో జాహ్నవి ఎన్నడూ ఎరగనంత ప్రేమగా అన్నాడు ఉమాపతి. జాహ్నవి ముఖం పాలి పోయింది. క్రింది పెదవి కొరుక్కుంటూ కూర్చుంది. లాలనగా శిరసు నిమరబోయాడు. ఆ చేతిని విదిలించి కొట్టింది.

"వెళ్ళిపొండి. మీ కపటు నేనక్కర్లేదు."

"నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడగబోయి అంతలో తెలివి తెచ్చుకుని "వెళ్ళి పొమ్మంటావా?" అన్నాడు.

"త్వరగా వెళ్ళండి."

"సరే నీ యిష్టం! నీకెలా కావాలంటే అలా చేస్తాను."

నెమ్మదిగా నడిచి వెళ్ళిపోయాడు ఉమాపతి.

కుళ్ళి కుళ్ళి ఏడ్చింది జాహ్నవి.

బావా తనూ అచ్చం సినిమాల్లోలావే ప్రేమించుకున్నారు. సినిమాల్లో లావే తియ్యతియ్యని కబుర్లు చెప్పుకున్నారు. కానీ, సినిమాల్లో చిన్నభార్య ఆడింది ఆట. మరి. తన జీవిత మిలా తయారయిందేం? పెళ్ళి వరకూ అచ్చు సినిమాలోలా నడిచిన జీవితం పెళ్ళయ్యాక మరీ ఇంత అర్థంకాకుండా మారి పోయిందేం?

ఏడ్చి ఏడ్చి ఎప్పటికో నిద్రపోయింది జాహ్నవి ఇంత జగిరినా జాహ్నవికి రవ్వల అడ్డిగ మీద మోజు పోలేదు. తను అనుకున్నది సాధించకుండా ఉండలేదు జాహ్నవి.

మరునాడు ఏమైనా సరే, సాధించితీరాలని పట్టుదలతో జాహ్నవి హైమ దగ్గిర కొచ్చింది.

"అక్కయ్యా! నేను రవ్వలఅడ్డిగ చేయించుకోవా లనుకుంటున్నాను. నాకు యాభైవేలు కావాలి."

ఒకరకంగా ఆజ్ఞాపిస్తున్నట్లే అంది.

"ఇప్పుడు దాని అవసరమే మొచ్చింది జాహ్నవీ! ప్రస్తుతం మనం అప్పుల్లో ఉన్నాం. అప్పులు తీరాక చేయించుకుందువుగాని." నిదానంగా అంది హైమ.

"అప్పులా?" తెల్లబోతూ అంది జాహ్నవి.

"అవునమ్మా! ఇంచుమించు మన ఆస్తికి సరి పడే అప్పులున్నాయి. పరువు నడివీధిన పడకుండా జాగ్రత్తపడి అప్పులన్నీ తీర్చుకోవాలి. ఒకప్రక్క సంసారమూ పెరుగుతోంది. నీకు నెలలు నిండాయి నాకూ మూడోనెల!"

"ఏమిటీ? నీకు...."

"అవును. నాకూను.."

నీరసంగా నవ్వింది హైమ. జాహ్నవి ముఖం తెలిపోయింది. పెళ్ళయి అయిదేళ్ళయినా, అక్కయ్యకు పిల్లలు లేకపోవటంతో అసలిక పుట్టరను కుంది. అతని పిల్లలకు తల్లిగా తనకు ప్రత్యేక స్థాన ముంటుందని ఆశ పడింది. చివరికా ఆశ కూడా అడుగంటింది.

జాహ్నవి భావపరివర్తనను గమనించ లేనంతటి మూర్ఖురాలేం కాదు హైమ. లోలోపల నిట్టూర్పు విడుచుకుంది.

"ఇంతకూ నేను రవ్వల అడ్డిగ చేయించుకోడానికి వీల్లేదంటావా?"

"పరిస్థితులు తెలిసాక కూడా మూర్ఖంగా కోరతావా జాహ్నవీ!"

"ఛీ! ఎంత అధ్వాన్నపు బ్రతుకయిపోయింది నాది. చేతులారా చేసుకున్నాను.. అనుభవించాలి."

ఏడుస్తూ వెళ్ళిపోయింది జాహ్నవి.

వెళ్ళి పోతున్న జాహ్నవి వంక బాధగా చూస్తూ "ఇంతవరకూ ఎన్నేమీ అనుభవించలేదు జాహ్నవీ! అట్లాంటి అనుభవం నీ జీవితంలోకి రాగూడదనే కోరుకుంటున్నాను." అనుకుంది మనసులో హైమ.

*

ఉమాపతికి ఆస్తికి మించిన అప్పులున్నాయని హైమ కూడా గర్భవతి.

ఈ రెండు విషయాలూ రెండు విషసర్పాల్లా జాహ్నవి మనసులో బుసలు కొడుతున్నాయి.

ఉమాపతిలో తనకు ముఖ్యంగా ఆకర్షించింది అతని ఐశ్వర్యమని జాహ్నవి ఇప్పటికీ కూడా అర్థం



చేసుకోలేక పోయింది. ఒకప్పుడు బాగా బ్రతికి, మధ్యలో చితికిపోయిన సంసారంలోంచి రావటంవల్ల ఆమెకు మళ్ళీ వెనకటి దర్జా జీవితం మీద వల్ల మాలిన మమకారం పెరిగింది. ఉమాపతి కుటుంబంలో తనకు కనిపించిన దర్జా అంతా మేడిపండు వలు అని హైమ తేల్చి చెప్పగానే ఆమె మనసు కుతకుత ఉడకసాగింది. తన నెవరో దారుణంగా వే సగించినట్లు అనిపించ సాగింది. ఎందుకో, ఎవరి మీదో అర్థంకాని కసి. ఏమీ తోచనియ్యని అశాంతి తనకు తానే అర్థం చేసుకోలేని తిక్క.

శోక దేవతలా ఉన్న జాహ్నవిని చూస్తుంటే, నిజంగానే జాలి కలిగింది ఉమాపతికి.

"బాధ పడకు జాహ్నవీ! హైమతో చెప్పి ఎలాగో ఒకలా నీకు చేయిస్తానులే!' అన్నాడు లాలనగా.

ఉమాపతి లాలన జాహ్నవికి తృప్తి కలిగించలేదు. అసలు తనకు తృప్తి కలిగించే దేమిటో కూడా తెలియటం లేదు.

"మీరు చెప్పరు. ఆవిడ చేయించదు. ఇప్పుడకస్మాత్తుగా ఈ పొందిక ఎందు కొచ్చిందనుకుంటున్నారు?"

"ఇంకెందుకు? మనందరి కోసం.."

"సరే, మీ కోసం నా కోసం కాదు. ఆవిడకు సంతానం కలగబోతూంది. తన పిల్లల కోసం అంతా కూడబెట్టుకుంటూంది."

"ఏమిటే? హైమకు...నిజమా?"

పరుపు మీద వాలి ఏడుస్తున్న జాహ్నవిని గమనించకుండానే గబగబ పరుగెట్టాడు హైమ దగ్గరకు.

"హైమా! నిజంగానా? నాకు చెప్పలేదేం?"

అప్పుడప్పుడే నిద్రలోకి జారుతున్న హైమ కంగారుగా లేచింది.

"ఏమిటి చెప్పటం? చెప్పటానికే ముందీ? '

"అదే, నాకు బాబు పుట్టబోతున్నాడని..హైమ" ముసిముసిగా నవ్వింది.

"బాగుంది. బాబేనని ఎలా చెప్పగలరు?"

"కాదా?' వెంగగా అడిగాడు.

ఫకాలున నవ్వింది హైమ.

"ఏమో! అయినా ఇందులో అంత సంతోషించ

# జాహ్నవీ హైమవతులు

వలసిందేముందీ? ఇంతవరకూ రాకపోవటంతో ఇక నాకు పిల్లలు పుట్టరనుకొన్నాను. జాహ్నవి వల్ల మన వంశం నిలుస్తుందని అనుకున్నాను కానీ, నేనూ తల్లిని కాబోతున్నాను. అటు జాహ్నవీ, ఇటు నేనూ కంటూ కూర్చుంటే, కుటుంబమంతా ఎలా గడుస్తుందీ?' వెంగగా నిట్టూర్చింది హైమ.

"అదేమిటి హైమా! నాకెంత ........"

ఉమాపతిని మధ్యలోనే ఆపేసింది హైమ—

"మీరిక్కడి కెందు కొచ్చారు? జాహ్నవి దగ్గర కెళ్ళండి. రేపు మాట్లాడుకోవచ్చును."

"హైమా!"

"వెళ్ళండి."

మాట్లాడకుండా వచ్చేసాడు ఉమాపతి— జాహ్నవి ఇంకా ఏడుస్తూనే వుంది. ఉమాపతిని చూస్తూనే తోక త్రొక్కిన త్రాచులా లేచి "ఎందుకొచ్చారు?' అంది తీవ్రంగా.

"హైమ వెళ్ళమంది." వినయంగా అన్నాడు.

అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. జాహ్నవి కళ్ళలో నిప్పులు కురిసాయి.

"ఛీ! ఛీ! మీరసలొక మనిషేనా? లేక ఏద్తైనా మర బొమ్మా! మీకసలు మనసుందా? ఆలోచ నుందా?"

"మనసు ఆలోచనలూ లేనివాడను గనుకనే నువ్వు నా భార్య వయ్యావు జాహ్నవీ! ఇప్పుడు నాకాలోచనలు లేవని నిందించి ఏం ప్రయోజనం?"

ఎర్రగా కాలుతున్న కడ్డీతో వాత పెట్టినట్లయింది జాహ్నవికి—

మాటిగా ఉమాపతి ముఖంలోకిచూస్తూ "అందుకిప్పుడు బాధపడుతున్నారా? వదిలించుకోవాలని చూస్తున్నారా? చెప్పండి— రేపటికి నాకు బదులు నా శవాన్ని చూస్తారు.' అంది.

"ఇప్పుడింకేం బాధ? అలవాటయిపోయింది.. చచ్చిపోకు జాహ్నవీ! కేసులూ, అదీ చాలా గొడవవుతుంది. నలుగురి నోళ్ళలోనూ పడతాము."

"ఛీ! ఛీ! అవతలకు పొండి" గర్జించింది.

"వెడుతున్నాను జాహ్నవీ! కానీ, అనవసరంగా హైరాణ పడకు. వంటికి మంచిదికాదు. నిండు మనిషివి." గబగబ వెళ్ళిపోయాడు ఉమాపతి.

* * *

అదేమి సృష్టి చిత్రమో! ఉడుక్కునే వాళ్ళను చూస్తే సృష్టికికూడా సరదావే! మరి కాస్త ఉడికిస్తూ ఉంటుంది.

జాహ్నవికి ఆడపిల్ల పుట్టింది.

ఆ పిల్లకు పుట్టుకతోనే, ఒక చెయ్యీ ఒక కాలూ వంకరగా ఉన్నాయి.

"అట్లాంటి సంతానం అట్లాగే ఉంటుంది మామూలుగా." అంటూ వృద్ధ జమీందారిణి మరో సమిధ వేసింది.

ఉమాపతి బాధగా దిగులుగా హైమను చూసాడు. పాపం, హైమ మాత్రం ఏమని ఓదార్చగలదు?

"అందరి ఘోష కొట్టింది. ఇలా కాక ఎలా అవుతుంది?" అంటూ ఏడ్చింది జాహ్నవి.

హైమ బొమ్మలా వింటుంది. వృద్ధ జమీందారిణి ఊరుకోలేదు.

"ఘోష కాదమ్మా, ఉసురు. ఇల్లాలి ఉసురు కొడితే ఇలానే అవుతుంది." అంటూ సరి దిద్దింది.

జాహ్నవి చండికలా లేచింది.

"నేనెవరి ఉసురూ పోసుకోలేదు. మీ అబ్బాయి మంచి మాటలాడి నన్ను వలలో వేసుకుని నన్ను నాశనం చేసారు."

"ఏమో! ఎవరు ఎవరిని వలలో వేసుకున్నారో ఎవరు నాశనమయ్యారో, నాకేం తెలుసు?" అన్యాయకత్వం ప్రకటించింది. జమీందారిణి.

"అంటే ఏమంటారు మీరు? నేను కులటనా? నేనే వంచకినా? నేనే నాశనం చేసానా? అందుకు మీరంతా నన్ను చిత్రవధ చేస్తుంటారా అను క్షణం?" గట్టిగా అరిచి పొత్తిళ్ళో పడిపోయింది జాహ్నవి. హైమ అత్తగారికి నచ్చజెప్పి లోపలకు పంపి, గ్లూకోజు నీళ్ళు గ్లాసులో వంపి, తెచ్చి ఇచ్చింది. ఆ నీళ్ళు గడగడ తాగాక కొంత తేరుకుంది జాహ్నవి.

"పిచ్చిబాలింతరాలివి. అనవసరంగా వాదనలకు దిగకు జాహ్నవీ! అంత హైరాణ పనికిరాదు."

"హైరాణ పడితేనేం? నే చస్తేనేం? అదేగా మీరందరూ కోరుకునేది?"

జాహ్నవికి నచ్చజెప్పి ప్రయోజనం లేదని అర్థమయింది హైమకు. మాట్లాడిన కొద్దీ వాదన పెరుగుతుంది. దెబ్బలాటే ప్రధానోద్దేశంగా కలవారు ఏ మాటకైనా దెబ్బలాడగలరు. మౌనంగా కూర్చుంది.

"మాట్లాడవేం? అదే బాగుంటుందని నీ ఉద్దేశం కదూ! కాని ఏంచెయ్యనక్కా! నా చేతుల్లో లేదు. ఆత్మహత్య నాకు చేతకాదు నా బాధ మీకు తప్పదు" హైమ అక్కడి నుంచి లే పోయింది.

తన అంక పుస్తెనట్లు అంటుతేనడదాపేసత పెర్పిడింది జాహ్నవికి. హైమ ఆ పిల్లకు అన్ని సంరక్షణలూ చేసేది.

"అదెక్కడ చస్తుందోనని జాగ్రత్తగా సాకుతున్నావా అక్కా!" అంది జాహ్నవి నిస్పృహతో.

"ఛా! అలా అనకు. శరీరంలో ఏదైనా అవకరం ఉన్నవాళ్ళ మెదడు బాగా పని చేస్తుందట! ఎవరి



## జరిగిన కథ

సత్యమూర్తి, ప్రకాశం చిన్ననాటి స్నేహితులు. చాలాకాలానికి అనుకోకుండా కలిశారు. సత్యమూర్తి ప్రకాశం షుగర్ ఫ్యాక్టరీలో అకౌంటెంటుగా చేరాడు. ఆ చుట్టుప్రక్కల ప్రకాశానికి ఎక్కువ పరపతి వున్నట్టు గ్రహించాడు సత్యమూర్తి. ప్రకాశం, రామదాసుకు సంబంధించిన జాడ తెలియని ఒక అమ్మాయికోసం వెదుకుతున్నాడు. ఆమెను వశపరచుకుంటే కావలసినంత ఆస్తి దక్కుతుంది. ఆ అమ్మాయి భానుమతి. దామోదరం భానుమతిని మంచిచేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. సత్యమూర్తి, భానుమతి పరస్పరం ఆకర్షించుకున్నారు. భానుమతికి నెలనెలా డబ్బు పంపుతున్నవారెవరో తెలుసుకోవా అనుకున్నాడు సత్యమూర్తి.

# 18

చాలా దీర్ఘకాలిక చర్చల్లా కనిపించే ఆచర్చలు గడియారంలో మూడు దగ్గరగా చిన్న ముల్లు జరుగుతూండేసరికి ఆగాయి. అంతవరకూ ఎవరూ మనియార్డరు కట్టడానికి రాలేదు.

ప్రకాశంలేని సత్యమూర్తి ఉద్దేశించి "నువ్వు ఫ్యాక్టరీకివెళ్ళి నేనూ అయ్యరుగారూ విశాఖపట్నం వెళ్ళామని మేనేజరుతో చెప్పు. తనకి మాట్లాడా లని వుంటే, జగ్గారావుగారింటికి ఫోను చెయ్యమని", ముందు దామోదరాన్ని ఎక్కమని తరువాత తను జీపు ఎక్కాడు. దామోదరం గడియారంవైపు ఒకసారి చూచి జీపెక్కాడు. ప్రకాశం జీపెక్కగానే అది బుర్రుమని వెళ్ళిపోయింది. అతనితో వచ్చిన పెద్దమనుషు లక్కడే వుండిపోయారు.

వైకుంఠపాళిలో పెద్ద పాము నోట్లో పడకుండా తప్పించుకున్న ఆటగాడిలా "హమ్మయ్య!" అనుకున్నాడు సత్యమూర్తి. గడియారంలోమూడుకి ఇంకొక అయిదు నిముషాలుమాత్రమే వ్యవధివుంది.

"ఎంతసేపని అలా కూర్చోడం బాబూ. నాకు చిరాకుగావుంది" అంది. అప్పుడే తెరవెనుకనుండి బయటకు వచ్చిన భానుమతి.

ఆమెకు జవాబు చెప్పాలని అనుకుంటూండగా మనియార్డరు గుమస్తా "ఏమండోయ్! ఇదిగో మీకు కావలసిన మనియార్డరు వచ్చింది" అని కేకేశాడు. వెంటనే ఇద్దరూ కౌంటర్‌వద్దకు పరిగెత్తారు.

ఏ మనియార్డరుకోసం చాలా రోజులనుంచీ భానుమతి సత్యమూర్తులు ఎదురు చూస్తున్నారో ఆ మనియార్డరే అది. కానివాళ్ళుఏవ్యక్తిని చూడాలని ఎదురు చూశారో ఆవ్యక్తి మాత్రం రాలేదు.

ఆమనియార్డరు తెచ్చింది ఒకరైల్వే పోర్టరు!

"నువ్వా! ప్రతినెలా మనియార్డరు తెచ్చేది?" అని ప్రశ్నించాడు సత్యమూర్తి.

"ఏటిబాబూ అంటున్నారు?" అన్నాడా పోర్టరు. వాడొక ఏభైఏళ్ల ముసలివాడు. సన్నగా వంగి నడుస్తూంటాడు. సత్యమూర్తికి బాగాతెలిసినవాడు. సత్యమూర్తి మళ్ళీ తన ప్రశ్నవేశాడు.

"నేటిబాబూ ఆ మారాజిచ్చి పోస్టాఫీసుకెళ్లమన్నాడు."




"ఏమారాజా?" అంది భానుమతి ఆత్రుతతో.

"ఎవరు? ఎక్కడున్నారు? తొందరగాచెప్పు" అని సత్యమూర్తి అన్నాడు.

"ఆయన పేరేటో నాకుతెల్దుగాని, అందరూ దాసుగారంటారు. ఇయాల పొద్దుటేతే రైలుదిగి నాసేతికీడబ్బూ ఈకాగితంఇచ్చిసి పోస్టాఫీసులో కట్టమన్నారు. నాకీయాల్టివరకూ తీరనేదు." అన్నాడా పోర్టరు. వాడిపేరు సింహాద్రి.

"ఇప్పుడు స్టేషనులో వున్నారా?" అనిఅడిగింది భానుమతి.

"నేదు. ఆ జామునగా బండెక్కెళ్ళిపోయారు!"

"పోనీ ఏవూరెళ్ళారో తెలుసా?"

"యిసావట్నం కాబోలు." అన్నాడు విసుగ్గా సింహాద్రి.

"ఎలావుంటారో చెప్పగలవా?" అనడిగింది భానుమతి.

"ఎర్రగా, బలంగా, ముతకవాళ్ళ యేసుకు మంటారు.

"ఆ! అని భానుమతి గట్టిగా అంది. ఇద్దరి మనస్సుల్లోనూ ఒకేవూహ మెరిసింది. సత్యమూర్తి వాడిని ఇంకా వివరాలు చెప్పమన్నాడు గాని, అంతకన్నా వాడేమీ చెప్పలేక పోయాడు.

"తొరగాకట్టేయండిబాబు. నాకు యేళవుతుంది" అని మనియార్డరు గుమస్తాని తొందరచేశాడు సింహాద్రి. అతను, రశీదురాసి, స్టాంపువేసి ఇచ్చేశాడు. వాడదితీసుకొని వెళ్లిపోతూంటే భానుమతి అతనినింకా వివరాలుఅడుగుతూ, వెంటవెళ్లసాగింది, సులేమాన్‌గారు, "అసలు వ్యక్తిరాలేదన్నమాట. మళ్లీసారి చూద్దాం." అన్నారు సత్యమూర్తితో, కొద్దిగా వోదార్చే ఉద్దేశంతో. సత్యమూర్తి తలూపాడు. తనుకూడా భానుమతి ననుసరించసాగాడు. ముగ్గురూ స్టేషన్ చేరుకున్నారు.

అడిగిఅడిగి చివరకు భానుమతి హతాశురాలైంది. కాని, సింహాద్రి అంతకన్నా ఎక్కువవివరాలు చెప్పలేకపోయాడు. నిస్పృహగా స్టేషన్ ప్లాటుఫారం మీద నిల్చున్న భానుమతిని, సత్యమూర్తి తనయింటికి ఆహ్వానించాడు. అప్పటికి, రెండుగంటలకాలంవరకూ బస్సుకాని రైలుకాని, విశాఖపట్నానికి వెళ్ళేవిలేవు. గనుక, ఆమె అతని యింటికివెళ్ల నిశ్చయించింది. ఇద్దరూ దారిలో తమ ఆశాభంగం గురించి చర్చించుకున్నారు. "ఇవాళ తప్పకుండా ఈసమస్య తేల్తుందనుకున్నాను.' అంది భానుమతి నడుస్తూ.

"అసలువ్యక్తే మనియార్డరు కట్టడానికి వస్తాడనుకోడంలో మనం పొరబడ్డామేమో." అన్నాడు సత్యమూర్తి నడుస్తూ.

"అవును,అదీనిజమే. ఇన్నాళ్లనుండీ అజ్ఞాతంగా వున్నవ్యక్తి ఇప్పుడెందుకు బయల్పడతారు! నామెత్రి కాని." అంది మెల్లిగా తలవంచుకుని నడుస్తున్న భానుమతి, చాలా క్రుంగిన మనసుతో.

"అలాఅనకండి. విషయమేమిటో తెలుసుకోవాలని వుండడం సహజం, విద్యుక్త ధర్మమూను. అందులోనూ ప్రస్తుత పరిస్థితులలో ఈమనియార్డరు పంపుతున్నదెవరో తెలుసుకోవడం మరీముఖ్యం. ఏమంటారు?"

"అవుననుకోండి. కాని మనప్రయత్నం సఫలం కాలేదుకా." అనిభానుమతి, తమచుట్టూ కలియ జూసింది. తామునడుస్తున్న రోడ్డుకిరుప్రక్కలా చాలాదూరంవరకూ ఇళ్ళులేవు. స్టేషనుకి చాలాదూరం వచ్చేసారు. చిన్నపల్లెటూరుకాబట్టి వాతావరణం ప్రశాంతంగానే వుంది, కాని ఈవూరే తన జీవితంలో ప్రముఖపాత్రవహించింది. ప్రకాశం, దామోదరం, లాంటి వ్యక్తులున్నఈవూరిలో ప్రశాంతత వుంటుందనుకోడం, గాలిమేడలుకట్టడమే. అటువంటి వ్యక్తులమధ్య సత్యమూర్తి గారిలాంటి మంచి మనిషి ఎలా వుంటున్నాడో?

"మనప్రయత్నం సఫలం కాకపోవడమే మంచిదేమో. కొద్దినిముషాలు తేడావచ్చిందిగాని, ఆమనియార్డరు దామోదరం చేతిలో పడేదే. అప్పుడు మనం చాలాఇరుకున పడేవాళ్లం." అన్నాడు సత్యమూర్తి.

"అదీమంచిదే మమండి. దామోదరంగారు వెళ్ళేదాకా నాగుండెలెలాగోవున్నాయి. అతరువాత వచ్చింది ప్రకాశంగారు కదూ?"

"అవును."

సత్యమూర్తి ఇల్లుచేరుకుని, భానుమతిని రామదాసుగారి కూతురని తల్లికి పరిచయం చేశాడు. ఆమె భానుమతిని చూసి ఎంతోసంతోషించింది. తనకూతుర్ని చూసినట్లుందంది. ఆయింట్లోని వాతావరణం భానుమతికెంతో నచ్చింది. సత్యమూర్తివి, ఎన్నో పుస్తకాలున్నాయి. సాహిత్యం, వేదాంతం, రాజకీయాలు, విజ్ఞానం అన్నిటికీ సంబంధించిన పుస్తకాలున్నాయి. అతనిమాటలలోనూ, ప్రవర్తనలోనూ, గంభీరతా, వివేకం కన్పిస్తాయి. తల్లీకొడుకులమధ్య సంభాషణ వేదాంత విషయాలమీద నడిచింది.

తను కాలేజీలో చదువబట్టీ, ఆంగ్లవిద్యాభ్యాసం చేసి అనేక విషయాలు తెలుసుకోబట్టీ, ఎంతో విజ్ఞానం గ్రహించాననుకుంది. కాని వంటింట్లో కాలం గడుపుతున్న సత్యమూర్తి తల్లికున్న విచక్షణా, యోచనా, విషయగ్రహణా, తనకుందా అని సందేహం వచ్చింది. ఆమెకు న్యూస్‌పేపర్లోవున్న విషయాలు తెలియక పోవచ్చు. కాని శాశ్వతమూ, సనాతనమైన ధర్మమూ, మతమూ, మానవజీవిత పరమావధులగురించి తెలుసు. రాత్రి ఎనిమిదిగంటలకు, సత్యమూర్తి, భానుమతిని రైలువద్దకు దిగబెట్టడానికి ఆమెతో స్టేషనుకి బయల్దేరాడు. తననెంతో ఆదరంతోచూసిన, సత్యమూర్తి తల్లి చిరునవ్వుమొహమూ, ప్రేమపూర్వకంగా తనకు భోజనము పెట్టడమూ ఆమె సంభాషణా భానుమతి మనస్సులో నిల్చిపోయాయి.

ఇద్దరూ స్టేషను కెళ్తుంటే దారిలో భానుమతి "మీఅమ్మగారు చాలామంచి వారండీ" అంది పొంగుకుతున్న ఆనందంతో.

"మీ అమ్మగారు కూడా మంచివారేగా" అన్నాడు

సత్యమూర్తి.

"మా అసలు అమ్మను నేను చూడనేలేదు" అంది భానుమతి ఆలోచిస్తూ. సత్యమూర్తి గతుక్కుమన్నాడు.

"అమ్మలెవరైనా మంచివాళ్ళే. స్త్రీలకు మంచితనం భగవంతుడిచ్చినవరం" అన్నాడు సత్యమూర్తి.

"మీకు స్త్రీలంటే చాలాగౌరవమనుకుంటాను."

"ఒక్క గౌరవమేకాదు. మనదేశ భవిష్యత్తు వాళ్ళమీదనే ఆధారపడి వుందని నమ్మకం. యత్రనార్యస్తు పూజ్యంతే తత్రదేవో రమః అంటారుకదా. స్త్రీల ముందంజ వెయ్యని దేశం ముందుకు సాగదు."

అతను మాట్లాడుతూంటే తన మనసులో ఏదో ఒక మధురానుభవం కలుగుతుంది భానుమతికి. అతనికి గొప్ప ఆదర్శాలున్నాయి. మంచి తెలివి తేటలున్నాయి. ఉమ విషయంలో అతను ప్రవర్తించినతీరును బట్టి మంచి శీలంవుంది. అంతకన్నా పురుషుడిలో స్త్రీ ఏం కోరుతుంది ఇద్దరూ మెల్లిగా నడుస్తూ స్టేషను చేరుకున్నారు. రాత్రి బాగా చీకటిగా వుంది. స్టేషనులో ఆఫీసువద్ద లైట్లున్నాయి. ప్లాటుఫారం అంతా చీకటిలోనే వుంది. ఇద్దరూ ఒక రాతిమీద కూర్చున్నారు. రైలు రావడానికి ఇంకొక అరగంట వ్యవధి వుంది. ఇద్దరిమధ్యా అనేకవిషయాల మీద సంభాషణ జరుగుతోంది. భానుమతి "మీరు విశాఖపట్నం ఎప్పుడు వస్తారు?" అని అడిగింది.

"త్వరలోనే వస్తాను. ఏదైనా పనుందా?"

"అబ్బే మిమ్మల్ని చూస్తే నాకెంతో ధైర్యంగా వుంటుంది. ఈమధ్య నామనసు అనేక ఆందోళనలకు లోనయింది. అందువల్ల తరచూ మీరు కలుస్తుంటే శాంతిగా వుంటుంది. మీ మాటలలో ఏదో ఆత్మీయత కన్పిస్తుంది."

"మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను. ఈరామవరం వాతావరణం నాకు నచ్చటంలేదు. త్వరలోనే దీనినివదిలిపెట్టేద్దామని వుంది."

"కాని నాదొక కోరికవుంది. అంది భానుమతి.

"ఏమిటది?" అన్నాడు, ఆమెకళ్ళల్లోకి చూస్తూ.

"ఈ మనియార్డరు పంపేదెవరో తెలిసేదాకా, ఈ వూళ్ళో వుండండి."

"తప్పకుండా".

రైలు వచ్చింది. ఆమెను థర్డుక్లాసు ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కించాడు. ఇద్దరూ, మనసులలో ఏవేవో ఇంకా చాలా సన్నిహితంగా మాట్లాడుకోవలసినవి ఉన్నాయనుకుంటూనే, పైకి సాధారణ విషయాలు మాట్లాడుకున్నారు.

"ఈసారి మీరు మాయింటికి తప్పకరావాలి" అంది భానుమతి.

"అలాగే" అన్నాడు సత్యమూర్తి. ఇద్దరికళ్ళూ ఒక్కసారి కలుసుకున్నాయి. ఇద్దరి హృదయాలూ ఒక్కసారి కొట్టుకున్నాయి.

రైలు కదిలింది ఇద్దరి మనసులలోనూ ఒకవైపు విడిపోతున్నామనే వెలితి, మరొకవైపు ఒకరినొకరు అర్థం చేసుకున్నామనే తృప్తి, ఒకేసారి వ్యాపించాయి. ఆమె రైలు ద్వారంవద్ద నిలబడి దూరమైపోతూంటే, సత్యమూర్తి చెయ్యి వూపసాగాడు రైలు కనుమరుగయ్యేదాకా.

ఆ రాత్రి అతనికి గాలిలో తేలిపోతున్నట్లనిపించింది. రామదాసుగా రన్నమాటలు జ్ఞాపకమొచ్చాయి. భానుమతి అతని కలల్లో మెదిలింది. మళ్ళీ ఆమె నెప్పుడు కలియాలా? అని ఆలోచించసాగాడు.

* * *

సత్యమూర్తి ఆలోచించిన కొద్దీ తను రామవరంలో చెయ్యదగినది చాలావుందనిపించింది. ప్రస్తుత పరిస్థితులు ఎంత నిరాశా జనకంగావున్నా, ధైర్యంగా ఎదిరించి నిలబడితే, తప్పక తన ఆశయం నెరవేరగలదనిపించసాగింది. ప్రకాశం కూడా సామాన్య మానవుడే. కానీ అతనిలో అధికారవాంఛ ప్రవేశించి, మంచితనాన్ని కప్పివేసింది. అతనిలో మంచితనం మేల్కొన్ననాడు, ఆ వూరికి ఎంతో మేలుజరుగుతుంది.

ఒక వ్యక్తి సంపూర్ణ ఆత్మ విశ్వాసంతో తలపెట్టిన పని ఏదైనా తప్పక జయమవుతుంది. సంఘంలో అనేక మందికి జరుగుతున్న అన్యాయాలను ఒక్కడు ప్రతిఘటించినా, అతనికి ఎంతో శక్తీ, ప్రోత్సాహమూ వస్తాయి. స్వాతంత్ర్యానికి పూర్వం, నిద్రాణమైవున్న జాతిలో చైతన్యం ప్రవేశపెట్టి, కొత్తరకం విప్లవం తీసుకొచ్చి, చివరకు అనితర సాధ్యమైన కార్యాన్ని నిర్వహించింది ఒకే



ఒక వ్యక్తి యొక్క దృఢ సంకల్పమూ, నిర్మలాంతః కరణా.

ఏనాడైతే తాను అన్యాయమనీ, అసత్యమనీ భావించిన దానిపై ఒక వ్యక్తి సంపూర్ణ మనో బలంతో ఎదురు తిరిగాడో, అనాడే బ్రిటిష్ సామ్రాజ్యపతన మారంభమైంది. ఒక హైందవ యువకుడు, డర్బనునుండి ప్రిటోరియా వెళ్ళటకు 1893 వ సంవత్సరంలో ఒకానొక శీతాకాలపు రాత్రి ఫస్టుక్లాసుటిక్కెట్టుతో రైలు ఎక్కినప్పుడే ఈ సంఘటన జరిగింది.

ఆయన మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ అనే సాధారణ హైందవ యువకుడు. అతని కప్పటికి పాతిక సంవత్సరాలు. పొడుగూ, పొట్టీ కాని సన్నని వ్యక్తి. అతని చెవులు పెద్దవి. నెమ్మదైన ప్రవర్తనా, మెల్లిగా మాట్లాడడం అతని ప్రత్యేకతలు. అప్పటికి ఇంగ్లండులో న్యాయశాస్త్రం చదివి. దక్షిణాఫ్రికాలో అబ్దుల్లాసేఠ్ అనే భారతీయ వ్యాపారస్థుని కేసు విషయంలో వివరాలకోసం డర్బాన్ నుండి ప్రిటోరియా వెళ్తున్నాడు.

అతనెక్కిన రైలుపెట్టెలో రాత్రి తొమ్మిది గంటలకు మరొక ప్రయాణీకుడు ఎక్కాడు. అతను గాంధీనిచూసి, ఇద్దరు రైల్వే అధికారుల్ని వెంట బెట్టుకొచ్చాడు. అందులో ఒకాయన గాంధీని 'వాన్' పెట్టెలోకి వెళ్ళమన్నాడు. నల్లవారక్కడ అలాగే నీచంగా చూడబడడం సామాన్యమే. కాని గాంధిజీ తనా రైలుపెట్టె కాళీ చెయ్యడానికి నిరాకరించారు. ఆ అధికారులతనిని సాహసంగా తాము చెప్పినట్లు వినకపోతే అతనిమీద బలప్రయోగం చేస్తామని బెదిరించారు. "మీరు నన్ను తోసేసినా సరే, ఇక్కణ్ణుంచి కదలను" అని ఆయన అన్నారు. ఆ క్షణంలోనే నూతన విప్లవం ఆరంభమైంది.

పోలీసు కానిస్టేబుల్ని పిలిపించి ఆయనను బయటకు నెట్టించారు. వాన్ పెట్టె ఎక్కడానికి నిరాకరించి ఆయన ప్లాటుఫారమ్‌మీద నిల్చుని, రైలు వెళ్ళిపోతూంటే చూస్తున్నారు. ఆ రాత్రి ఆయన వెయిటింగ్ రూములో గడిపారు. చలికి వణికిపోతూ, ఆయన సామాను రైలులో ఉండి

# సుప్రభాతం

పోవడంవలన మరునాటి సాయంకాలం ఛార్లెస్ టవున్ వెళ్ళే రైలు ఎక్కివెళ్ళారు, ఏ ప్రమాదము లేకుండా.

చార్లెస్ టౌన్‌నుంచి జోహాన్సెస్‌బర్గుకోచ్‌లో ప్రయాణం చేస్తూంటే మళ్ళీ అవమానం ఎదురైంది. కోచ్ ఏజంటు తను కోరినట్లు ఫుట్ బోర్డుమీద కూచోలేదని గాంధీని చెవులుపిండడం, తోద్యడం మొదలైన హింసలకు గురిచేశాడు. అయినా గాంధిజీ బాధను భరిస్తూకూడా తన హక్కును వదులుకోలేదు. చివరి కెలాగో ప్రిటోరియా చేరుకున్నారు.

ప్రిటోరియా చేరుకున్న తరువాత, తను వచ్చినది అబ్దుల్లాసేఠ్ కేసు సందర్భంలోనే అయినా, ఆయన అంతకన్నా ఎక్కువ సాధించదల్చుకున్నారు. ప్రిటోరియాలోని భారతీయులనందరినీ పిల్చి ఒక మీటింగుపెట్టి, తన అనుభవాన్ని వెల్లడిచేసారు. వారు కూడా తను కటువంటి అనుభవాలెన్నో ఎదురయ్యాయని చెప్పారు. అప్పుడు వారినందరినీ ఒక సంఘంగా ఏర్పాటుచేసి, వారి ఇక్కట్లను అధికార్లకు వెల్లడించుకోవాలని తీర్మానించారు.

దక్షిణాఫ్రికాలో ఆసియన్లను కూలీలని పిలుస్తారు. వీరు ఎంతసేపూ కూలీ వృత్తులనేచెయ్యాలి. వారు పబ్లిక్ ఫుట్‌పాత్‌లపై నడువరాదు. ఒకనాడు గాంధీజీ ఫుట్‌పాత్‌పైన నడుస్తూంటే, గార్డుచేత త్రోసివెయ్యబడ్డారు. కానీ అదే సమయంలో ఒక ఆంగ్ల మిత్రుడది గమనించి, ఆ గార్డును మందలించి తన ప్రవర్తనకు క్షమాపణ కోరుకోమన్నారు. కాని గాంధిజీ అందుకు అవసరంలేదనీ, తానతని అంతకుముందే క్షమించానని చెప్పారు. అన్యాయాన్ని ఎదిరిస్తూ, మనసులో క్రోధంగాని, ద్వేషంగాని ఉంచుకోకూడదనే నూతన విప్లవ పంథా ప్రారంభమైంది.

అబ్దుల్లాసేఠ్ కేసును సంప్రదింపులవల్ల రాజీ మార్గంలో పరిష్కారంచేసి ఉభయపక్షాలకూ నచ్చేటట్లు




సంధి కుదిర్చారు గాంధిజీ. సేఠ్‌కి ఒకరు 40,000 పౌన్లు ఇవ్వవలసివుంది. గాంధీగారి శ్రమకు ఫలితంగా, ఆ బాకీని సామాన్య వాయిదాలలో తీర్చేందుకు ఏర్పాటు చెయ్యబడింది. తద్వారా బాకీపడ్డ వ్యక్తికి కష్టమూవుండదు. నలుగురిలో అవమానం తప్పింది. ఈ సంఘటన పరస్పర వైషమ్యాలు సమసిపోవడానికి సంప్రదింపులు ముఖ్యమార్గం అనే విషయాన్ని స్పష్టం చేసింది. భారత స్వతంత్ర సమరంలో ఒక మెట్టుకు పునాది వేసింది.

గాంధిజీ ఆఫ్రికాను వదిలే సమయంలో, నేటాలు అసెంబ్లీకి ప్రతినిధులను ఎన్నుకునే హక్కు భారతీయులకు లేకుండా చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలిసింది. వెంటనే ఒక సంఘాన్ని నియమించి, అటువంటి బిల్లు పాసవకుండా ప్రభుత్వాన్ని అర్థిస్తూ, విరోధక ప్రయత్నాలు ప్రారంభించారు గాంధీజీ. అనేకమంది సంతకం చేసిన విన్నపాన్నొకటి ప్రభుత్వానికి సమర్పించారు. ఆ ప్రయత్నం అక్కడి భారతీయులలో చైతన్యం రేపి, వారిని ఏకోన్ముఖం చేసింది. చివరకు వారి శ్రమ ఫలించక, బిల్లు పాసయింది. కానీ ఆ ప్రయత్నం, కొద్దిమంది మనుషులు స్వల్పావకాశాలతోనే ఎంతో సాధించగలరని గాంధిజీకి తెలిపింది.

అప్పుడు వలస రాజ్యాల అధికారియైన లార్డ్ రిప్పన్ పేరిట ఒక మహజరును పదివేల సంతకాలతో పంపాలనే నిర్ణయం జరిగింది అందుకు అనేకమందివద్దకువెళ్ళి, వాళ్ళకూ విషయం బోధపరిచి వారి సంతకం తీసుకున్నారు. ఈ అర్జీకి వెయ్యి కాపీలు అచ్చొత్తించారు. దక్షిణాఫ్రికాలో భారతీయుల పోరాటం దీర్ఘకాలికమని గ్రహించి గాంధిజీ ఆ పోరాటాన్ని కొనసాగించటానికి నేటాల్ ఇండియన్ కాంగ్రెసును స్థాపించారు. ఈ సంస్థ తమ పోరాటానికి ఒక కొత్త విధానం అవలంబించసాగింది. దాని పేరు సత్యాగ్రహం. సత్యాగ్రహం అంటే అహింసతో కూడిన సహాయ నిరాకరణ. ఇది ప్రభుత్వం యొక్క దుర్మార్గపు చట్టాలను ఎదిరించడం కోసం ఉపయోగిస్తారు. దీనిని భారతీయులపై విధింపబడిన మూడు పౌనుల వార్షిక పన్నులు నిరోధించటానికి కూడా ఉపయోగించదల్చారు.

ఈ పన్ను రద్దు కావడానికి ఇరవైయేళ్ళు పట్టింది. ఆఖరి ఉద్యమంలో గాంధిజీ ఆరువేల గని పనివారలను ట్రాన్సువాల్‌నుండి నేటాల్‌కు తీసుకు వెళ్ళారు. వారందరూ సత్యాగ్రహులే. వారందరూ ఎన్నిహింసలనైనా సహించి ఖైదుకు సిద్ధపడ్డవారే.

దారిలో గాంధిజీ అరెస్టు చెయ్యబడ్డారు. వెంటనే నేటాల్‌లో 20,000 మంది కార్మికులు, ఇది విని సమ్మెచేశారు. బెల్‌ఫోరులో ప్రభుత్వంవారు ఈ సత్యాగ్రహ యాత్ర జరిపిన వారి నరెస్టుచేసి నేటాల్‌కు పంపి కఠిన శిక్షలు విధించారు.

ఈ యాత్ర ఇంగ్లండులో పెద్ద విశేషంగా పరిగణింప బడింది. ఇండియాలో మును పెన్నడూ కనీ విని యెరుగని అలజడి రేపింది.

1914 లో స్మట్సు— గాంధి ఒడంబడిక ఫలితంగా ఈ పన్ను రద్దయింది.

అంతలో దక్షిణాఫ్రికాలోని భారతీయుల ఇక్కట్లు అంతం కాలేదు. కాని ఒక లక్ష్యం సాధింపబడింది. ఒక ఉద్యమం విజయవంతమైంది.



మితమైన ధర



Graphic CP-1

# మొటిమెలు మీకు మీ వివాహానికి మధ్య అవరోధకం కాగూడదు

## నిటాల్ ఔషధయుక్త పింపుల్ క్రీమ్ వాడండి మరి వాటిని నిర్మూలించుకోండి

మీరు కూడ అందమైన వధువు కాగలరు. మిమ్మల్ని బాధించుచున్న మొటిమెలు మరియు నల్ల పొక్కులు మచ్చ మాసి పోయిన ప్రకాశమాన నున్నటి చర్మమును కలిగియుందురు. నిటాల్ ఔషధయుక్త పింపుల్ క్రీమ్‌ను 7 రోజులు వాడండి అంతే. ఇంక చూడండి మీ ముఖము మొటిమెలు, నల్లపొక్కులు మరియు ఇతర దద్దుర్లు వంటివి లేకుండా నున్నగా వుంటుంది. మచ్చలుగాని లేక పొడలుగాని ఏర్పడవు; చర్మ అంతర్గత నిర్మాణమును ఆరోగ్యవంతమొనర్చి చర్మమును బలిష్ఠంగాను ప్రకాశమానంగాను వుంచును. నిటాల్ యొక్క క్రిమినిరోధక సూత్రమును డాక్టర్లు ఎక్కువగా సిఫారసు చేసియున్నారు. అది మనోహరంగా పరిమళమొసర్చబడి బాలికలకు బాలురకు కూడ ఉద్దేశింపబడినది.

వాడే విధము—ప్యాకెట్‌లో వున్నది.





**nital**

**MEDICATED PIMPLE CREAM**

నిటాల్ మొటిమెల మందు



**7** రోజుల మొటిమెల చికిత్స

నిర్మాతలు: కొచ్చిన్ పామ్ ప్రైవేట్ లిమిటెడ్, నవరత్న హౌస్, మంత్ర రోడ్, కొచ్చిన్-2.
మద్రాస్, ఆంధ్రప్రదేశ్, మైసూర్ అండ్ కేరళ రాష్ట్రములకు డిస్ట్రిబ్యూటర్లు:
గణపతి అండ్ కం., 103-104, లింగి చెట్టి స్ట్రీట్, పోస్టు బాక్స్ నం. 1986, మద్రాస్-1.

ప్రఖ్యాత కెమిస్టులందరివద్ద లభించును.

భారతదేశంలో 1915 లో, బ్రిటిష్ సామ్రాజ్యాన్ని, ఏ సైన్యమూ, ఏ అధికారమూ, ఏ పరిస్థితులూ కూడా, స్వాతంత్ర్యేచ్ఛగల ప్రజల నుంచి వేరు చేయలేవని నమ్మి, బలమైన ఆత్మశక్తిచేత ఎదురించ బడే సమయమాసన్నమైంది. 1919 సంవత్సరాంతంలో ఇండియాలో సత్యాగ్రహోద్యమం ప్రారంభము అయింది. అనేక మంది దేశభక్తులు తమ తమ ప్రాణాల నర్పించారు దేశంకోసం.

అహింసా సిద్ధాంతం ప్రపంచ చరిత్రలోనే ఒక నూతన అధ్యాయం సృష్టించింది. ధర్మానికీ, సత్యానికీ గల బలం ఋజువు చేసింది. ఇరవైయ్యవ శతాబ్దంలో వైజ్ఞానిక చరిత్రలో అణుశక్తి ఒక ప్రత్యేక స్థానాన్నలంకరిస్తే మానవ జాతి చరిత్రలో అహింస ఒక వినూత్న అభ్యుదయాన్ని సూచించింది. ఈ రెండూ అద్భుత శక్తి గలవే, భౌతిక జీవితంలో అణుశక్తి ఎటువంటి విప్లవం తెచ్చిందో, మానవుని నైతిక జీవితంలో అహింస అటువంటి విప్లవం తెచ్చింది. మానవాళి కోల్పోనున్న ఆధ్యాత్మిక సంపదను మళ్ళీ తిరిగి పొందేటట్లు చేసింది. సంకుచిత మనస్తత్వంతో, దైవం యందు నమ్మకం లేక భౌతిక సంపదలే శాశ్వత మనుకునేవారికి, వారు మరచిపోయి, చరిత్ర మరుగున పడిపోయిన అహింస సిద్ధాంతం, మరల వాళ్లకు జ్ఞానోదయం కావడానికి, భారత స్వాతంత్ర్య సమరంలో ప్రముఖ పాత్ర వహించింది.

ఈ విషయాలన్నీ తల్చుకుంటూంటే ఒళ్లు ఉప్పొంగి పోతుంది. గాంధీజీ యొక్క పూనికలో సంచోవంతున్నా, ఏ మానవుడూ, పరిస్థితులకు లొంగిపోడు. సత్యాన్ని, ధర్మాన్ని వాంఛించేవారికి ఆయన జీవితమే ఒక ఆదర్శం. సత్యమూర్తి తనా

# సుప్రభాతం

ఆదర్శాన్నెప్పుడూ మనోనేత్రం నుండి మరుగు పడనియ్య లేదు. కాని తనొక జడుడిలా ప్రవర్తిస్తున్నాడు. మనసులో గంపెడు ఆలోచనలున్నాయి, ఎన్నో ఆశయాలున్నాయి. కాని ఒక్కటీ క్రియా రూపం దాల్చటం లేదు. అంతకన్నా చెడుమార్గంలో వెళ్తున్నప్పటికీ ప్రకాశం విషయమే చెప్పుకో దగ్గదిగా వుంది. ప్రకాశం తను తలపెట్టిన ప్రతి కార్యాన్ని తీవ్రమైన కృషి చేసి సాధిస్తున్నాడు. అందువల్ల అతనికి మేలు కలుగుతోంది, ఇతరులకూ మేలు కలుగుతోంది. అతనిలో నాయకుడికి కావల్సిన గుణాలున్నాయి. ఎవరితో ఎలా మాట్లాడాలో అలా మాట్లాడగలడు. పల్లెటూరిలోని వాళ్ళందరూ 'ప్రకాశం మావాడు' అనిపించేటట్లు ప్రవర్తించ గలడు. పెద్ద పెద్ద రాజకీయనాయకుల వద్ద, వాళ్లకు అంతరంగిక మిత్రుడిలా ప్రవర్తించగలడు. అన్ని తెలివి తేటలు గల వ్యక్తిని చెడుమార్గం ఆకర్షించి నట్లుగా, మంచి ఎందుకు ఆకర్షించలేక పోయిందో సత్యమూర్తి కర్థంకాలేదు.

మిల్లు కార్మికులలో, కొత్త మేనేజరుగా దానోదరం మట్టం నాథన్ రావడంతో చాలా అలజడి బయల్దేరింది. వారందరూ తమకు జరుగుతున్న అన్యాయాలను సత్యమూర్తికి చాలాసార్లు మొర బెట్టుకున్నారు. ఆఖరుకి వాళ్ల బాధ చూడలేక ప్రకాశం వద్దకు వెళ్లి వాళ్ల విషయం మాట్లాడి, నాథన్ దుర్మార్గాలు తెల్లియ జేశాడు. ప్రకాశం అవి వినీవిననట్లు వూరుకుని, చివరకు, 'చూస్తాలే' అని పంపివేశాడు, కాని నెలరోజులైనా నాథన్ని ఖండించలేదు, పనివాళ్ల ఇబ్బందులు పట్టించుకో లేదు. దానితో సత్యమూర్తికి ఒళ్లు మండింది.

ప్రతి పనివాడూ సత్యమూర్తి వద్దకు వచ్చి తమ గోడు తెల్పుకోసాగారు. ఒకనాటి సాయంకాలం కార్మికులంతా ఒక సభ చేశారు. అందులో తామందరము ఒక సంఘంగా ఏర్పడాలని, ఆ సంఘం తమకు జరుగుతున్న అన్యాయాల గురించి పోరాడాలనీ, అవసరమైతే అంతా కలిసి సమ్మె చెయ్యాలనీ నిశ్చయించారు. ఆ సంఘంలో పలువురు మాట్లాడారు. సత్యమూర్తిని కూడా మాట్లాడ మన్నారు. సత్యమూర్తి, తామందరూ అవలంబించవలసిన విధానాన్ని గురించి మాట్లాడాడు. బలప్రయోగంకన్నా అహింసాయుత పోరాటమే మంచిదన్నాడు. అందరూ సమిష్టి ప్రయోజనంకోసం, స్వార్థం త్యాగం చెయ్యాలన్నాడు. అందరికీ అతని మాటలు నచ్చాయి. వెంటనే తమ సంఘానికి కార్యదర్శిగా అతనిని ఎన్నుకున్నారు.

కార్మిక సంఘానికి నాయకుడవడం ఎంత ప్రమాదకరమో కొద్ది రోజులలో సత్యమూర్తి తెలుసుకున్నాడు. కార్మికుల కోరికలు చాలా వుంటాయి. వాటిని తీర్చమని మిల్లు యజమానులను కోరడం ఒకొక్కప్పుడు అసాధ్యమవుతుంది. తామొక సంఘముగా ఏర్పడగానే, అన్నీ సాధించగలమనీ. ఆ విషయము నెరవేర్చవలసిన బాధ్యత సత్యమూర్తిదనీ వారి నమ్మకం. రోజూ ఏదో ఒక విషయంలో కార్మిక సంఘం తరఫున అధికారుల వద్దకు వెళ్లవలసి వస్తోంది సత్యమూర్తికి. కాని నెలరోజులు జరిగినా కార్మికుల సంక్షేమం గురించి వాళ్ళు పట్టించుకో లేదు. దానితో కార్మికులంతా సమ్మెచెయ్య నిశ్చయించారు. సత్యమూర్తి అధికారులకు సమ్మె నోటీసు ఇచ్చాడు.

(సశేషం)




అనుమోదన్నిజమే– సెటైర్గా స్పైన నడిచేది కుర్రకారు కథ.



ప్రేమని నేను ప్రేమించిన సంగతి ప్రేమకి తెలుసో తెలీదో నాకు తెలుసు. ఆ సంగతి తరవాత చెప్తాను. నేను మాత్రం ప్రేమని చాలా గాఢంగా, దేశాన్ని దరిద్రం ప్రేమించినట్టు, (సిమిలీ బావులేదని తెలుసు. అందుకే ప్రేమ కవిత్వాన్ని నేర్పుతుందన్న విషయం నేనింకా నమ్మలేదు.) జనరలెలక్షన్ రోజుల్లో మనని అభ్యర్థులు ప్రేమించినంతగా గాఢంగా ప్రేమించేను.

అసలు ప్రేమతో పరిచయం చాలా ప్రేమటిక్‌గా జరిగింది. ఓరోజు పెందరాళే లేచి, వాచీలో ఎనిమిది చూసి బెడ్‌కాఫీ తాగుదామనుకొని మానేసి నవ్వుకొని, 'నా చిగుళ్ల ఆరోగ్యము కొరకై నేనెల్లప్పుడూ వాడే బినాకా టూత్‌పేస్ట్‌ని బ్రష్ పైనుంచి, కిటికీ లోంచి ఎందుకోగాని చూసేను. అలా చూసి చాలా అబ్బురపడి, ఆశ్చర్యపోయేన్నేను. ఎందువల్లంటే, ఎదురింటి కిటికీలో మెరిసిన ఎర్రటి టెర్లిన్ పైట, ఆ పైన తెల్లని నాజూకైన చేయి, అంతేకాక ఆపైట, చెయ్యిగల అసామీ కిటికీ పక్కనించి బహు నాజూకుగా నడిచి వెళ్లడం, చూసి నా అబ్బురం ఆశ్చర్యం పూర్తయేలోపుని, ఆ ఎర్రపైట, తెల్ల చెయ్యి గల అమ్మాయి మొహం కూడా నాకు కిటికీ లోంచి కనిపించేయి. అది మాత్రమే కాక ఆమె కళ్లు రెండూ నా పక్క పరీక్షగా 'ప్రేమిష్'గా చూడడంతో నా అబ్బురం ఆశ్చర్యం అవధుల్లేకుండా అదిరి పెరిగేయి. "తొలిప్రేమలో ఇంత బల మున్నదా..." అని సోలో పాడుదామనుకున్నాను. కాని కవిత్వం పూర్తిగా రాకా నోట్లో బ్రష్ వుండడం వల్లా పాడలేకపోయేను. ఆవిధంగా నేను ప్రేమని తెలియకముందే ప్రేమకు నన్ను తెలియకముందే ప్రేమించడం ప్రారంభించేను.

ఆ తరవాత నాకు ప్రేమతో పరిచయం ఐంది. ఎలాఐందంటే మామూలుగా హీరో హీరోయిన్లకి ఎలా అవుతుందో అలాగే! ఎదురిల్లు అంటే నా రూమ్ కి ఎదురుగానే వాళ్ల ఇల్లన్నమాట. పైనలియర్లో ఆ 'రూమ్ కి కొత్తగా మారినందుకు (లేక ఆ కొత్త రూమ్‌కి మారినందుకు) చాలా సంతోషించేను నేను... ఇంతకీ ప్రేమ 'వుమన్స్ కాన్వెంట్'లో నాలాగే బి. యస్సీ పైనలియర్ చదువుతోంది. (నాలాగే 'కాన్వెంట్'లో కాదు బాబోయ్! నాలాగే బి. యస్సీ) ఆమె అతి మోడర్న్‌గా వుంటుంది. తెల్లగా పొడవుగా వుంటుంది. సన్నగా వుంటుంది. నాజూగ్గా వుంటుంది అందంగా వుంటుంది. ఎప్పుడూ చేతికి స్క్వేర్ వాచీ కలిగి యుంటుంది. అతిథులతో మర్యాదగా వుంటుంది. నాలాటి ఫ్రెండ్స్‌తో సోషల్‌గా వుంటుంది.... ఆ విధంగా ఆమె అన్నివిధాలా 'డిజైరబుల్'గా వుంటూ సోకాల్డ్ మోడర్న్ సివిలిశేషన్‌ని ఉదాహరణంగా నిరూపించేటట్టు వుంటుంది.

రానురాను ప్రేమ నా ప్రేమని గ్రహిస్తుందని నేను తెలుసుకున్నాను. తెలుసుకొని సంతోషించేను. కాని అప్పుడప్పుడు ముఖ్యంగా ఈ మధ్య ప్రేమ వైఖరి అదోలా వుంది. అది నాకు చాలా చిరాకుని కలిగించింది. ఓరోజు వాళ్లింట్లో బాల్కనీలో కూర్చొని మాట్లాడుతున్నాం. ఒక్కసారిగా ప్రేమ "కిషన్! నీకీ క్రిష్ణారావనే పేరెవరు పెట్టేరు?" అంది.

"జ్ఞాపకం లేదుకాని మా అమ్మా నాన్నా పెట్టి వుంటారు." అన్నాను. "ష్! వాట్స్ దట్‌నేమ్? కిషన్ అనో కిశోర్‌కుమార్ అనో మార్చుకో కూడదూ?" అంది. నేను నవ్వేసి వూరుకున్నాను. నవ్వేసేనే కాని నాకు కొంచెం చిరాకు కలిగింది.

ఇంతలోనే ప్రేమ టాపిక్ మార్చి "నువ్వు సిగరెట్లు కాల్చవా?" అంది.

"కాల్చను." అన్నాన్నేను.

"షేమాన్ మై హీ..." అంది. అని వాళ్ళ డాడీని పిల్చి గోల్డ్‌ఫ్లేక్ పేకెట్టు తెప్పించింది. నేను సిగరెట్టు వెలిగించేక

"ఓ! వాట్ మోడ్ న్యాస్ బోయ్." అంది.

"ఏముంది? పాపం బీహారులో చూసేవా? ఎంత కరువు? ఎన్ని కష్టాలు.. అక్కడి ప్రజలు..." అని నేను పూర్తి చేయకుండానే

"డేమిట్! దరిద్రం తప్ప నాతో టాపిక్కులే డిస్ట్రయు ఫైండ్? దొరకలేదా నీకు?!" అంది. కాస్సేపాగి "ఎల్విస్‌వి కొత్తరికార్డు లొచ్చేయి తెలుసా?" అంది.

నేను అవి ఏ బాటనీవో, కెమిస్ట్రీవో రికార్డు లనుకున్నాను. అనుకుని "ఇంకా పుస్తవి చాలవేమిటి?" అని విసుక్కున్నాను.

అప్పుడు ప్రేమ నన్ను గ్రేస్ట్ చేసి పారేసిన బొద్దింకను చూసినట్టు చూసి, "నాట్! ఎల్విస్ పాటలు బోరా?" అంది. అప్పుడు నాకొంచెం అర్థమైంది. అర్థమయేక "పాటలా!" అని "రిలాక్స్" అయేను. అయేక పాత సిగరెట్టు పారేసి, కొత్త సిగరెట్టు వెలిగించేను.

* * *

మరో రోజులు, మరికొన్నాళ్లు గడిచేక ప్రేమ చాలా మోడర్న్ టైపని, నేను ఇంకా ముందు మోడర్న్ నాలెడ్జితో ట్యాగురల్[illegible] ముందు జిరో కాండిల్ బల్బులాటి వాగ్దానం [illegible] నాకు, అలి సిక నేను కొంచెం [illegible] ప్రేమ దగ్గిర కొత్త విషయాలు చాలా [illegible] ప్రారంభించేను.

# ప్రేమ

ఓరోజు సాయంత్రం కలియగానే ప్రేమ "ఫోర్ ఫార్టీనైన్! ఫోర్ ఫార్టీనైన్!" అని సంతోషంగానూ గాభరాగానూ అంది.

నేను కంగారుపడి, "ఏమిటి? సిబ్లడ్ ప్రెషరా?", అనడిగేను.

అప్పుడు ప్రేమ చాలా కోప్పడి, నా అజ్ఞానానికి అమితంగా విచారించి చెప్పింది. "క్రికెట్ స్కోర్" అని చెప్పి, "సాబర్స్ సెంచరీ" అని కలిపింది.

నేను సెంచరీ అంటే ఏమిటో అర్థం చేసికొని, అన్నీ తెలిసినవాడిలాగ, "నిజమే! సాబర్స్ లేందే మన దేశపు క్రికెట్ టీమేలేదు." అన్నాను ఉద్రేకంగా. అప్పుడు ప్రేమ ఏమీ మాట్లాడకుండా కళ్ళలోంచి కోపాన్ని కురిపించి గబగబా ఎందుకు వెళ్ళిపోయిందో అర్థం కాలేదు నాకు.

ఆ తరవాత నేను ప్రేమించిన మిత్రుడూ, మేలురకపు క్రికెట్ ఆటగాడూ ఐన 'జగన్'ని కలిపి



ఈ ఫార్సంతా చెప్పేను. అతను కోప్పడలేదు కాని విపరీతంగా నవ్వేడు. అతను నవ్వడం ఐపోయేక, నేను అతనికి అద్భుతమైన ఐస్క్రీం యిప్పించి, క్రికెట్ గురించి క్షుణ్ణంగా తెలుసుకున్నాను. అంతేకాక, మిగిలిన స్పోర్ట్స్ గురించి కూడా 'డీప్'గా తెలుసుకుని, రోజూ పేపర్లో ఆఖరి పేజీ చదవ నారంభించేను. అన్నిరకాల ఆటల గురించి యింత 'డీప్'గా స్టడీ చేయడం వల్ల నేను కన్ఫ్యూజ్ అయేను. ఓరోజు, ప్రేమని కలియగానే నేను ఆత్రంగా "ప్రేం! మిల్కాసింగ్ ఎనిమిదివికెట్లు తీసాడా?" అన్నాను. అది అనె ప్రేమని దాదాపు సంపాదించినంత సంతోషిస్తుండగా ప్రేమ విసుగ్గా నావైపు చూసి "యు ఆర్ మేడ్. నీకు పిచ్చెక్కింది." అని క్రికెట్కీ మిల్కాసింగ్కీ సంబంధంలేదని చెప్పింది. చెప్పి కళ్ళలోంచి నిప్పులు కక్కింది. నేను సిగరెట్టు తీసి వెలిగించేను. నేను ప్రేమ గురించింత కష్టపడుతున్నా ప్రేమ నాకు దూరమైపోతోందేమోనని పించి, నేను చాలా గాభరా పడ్డాను.

యింతలోనే "ఏ పెంటు వెడల్పెంతో?" అంది.

ప్రేమ. "వదహారించిలు" అన్నాను.

"వోవో! దట్సనాటిట్. మేకిట్ ట్వల్వ్" అంది ప్రేమ. "అలాగే ' అన్నాను. ఆ తరవాత అంతకు ముందు నేర్చుకున్న "జీన్" పాటల గురించీ మిస్ యూనివర్స్ పోటీల గురించీ, బినాకా గీత్‌మాలా గురించీ అనర్గళంగా మాట్లాడేస్సేను. మాట్లాడి నా నాలెడ్జ్‌కి అప్పుడు ప్రేమ కళ్లలో వెలిగిన వెలుగుల గురించీ చాలా సంతోషించేస్సేను. అప్పుడ ప్రేమ నాతో చాలా ప్రేమగా మాట్లాడింది. "రేపు నూన్ షో హేవర్డ్ పిక్చరుంది. వెళదామా?" అంది.

"వెళదాం. తప్పక వెళదాం. అతనేనా అభిమాన హీరో. ఆమధ్య ఒకసినిమాలో ఆయన చేసిన స్టంటు నేను లైఫ్‌లో మర్చిపోను ప్రేం! లైఫ్‌లోమర్చిపోను." అన్నాన్నేను.

అప్పుడు ప్రేమ మళ్లీ నవ్వుకొన్నాడి 'సూసాన్' హీరోకాదనీ హీరోయిన్ననీ చెప్పింది. "యింకా నీ నాలెడ్జి చాలదు కిషన్! యుహావ్‌టుగ్రో స్టిల్." అని కూడా అంది.

నేను కొంచెం విచారించి స్కైలబ్ దగ్గరికి కదిలేను.

* * *

ఇలా కొన్ని రోజులు గడిచేక నాకు మా వూరి నించి వుత్తరం వచ్చింది. అందులో మానాన్నగారు ఆఖరి పేరాలో ఇలా రాసేరు.

"ఈ నెలలో నువ్విప్పటికి ఖర్చు పెట్టింది మూడొందల ఇరవైనాలుగు రూపాయలు, మళ్లీ నేను పంపేలోపున డబ్బు పంపమని రాస్తే, మని యార్డర్ రాదు. నేనే వస్తాను. మీ తాతగారి చేతి కర్ర నీకు గుర్తు వుండే వుంటుంది."

వుత్తరం చదివి నేను కొంచెం భయపడి, ఎక్కువ గాభరాపడ్డాను. కాని ప్రేమించడంలో త్యాగాలు చాలా చేయవలసి వుంటుందని ఆమధ్య శర్మ చెప్పేడు. వాడగ్గర తొమ్మిది సిగరెట్లు గల గోల్డ్‌ఫ్లేక్ పేకెట్టు తీసికొంటూ. అందువల్ల నేను ఆ డైలాగ్‌ని తల్చుకొని ధైర్యాన్ని తెచ్చుకున్నాను.

* * *

"ప్రేమించడం ఒక కళ. ప్రేమికుడు గొప్ప కళాకారుడు." అని కూడా ఆమధ్య శర్మే చెప్పేడు. నేను ప్రేమిస్తూ కూడా ప్రేమకి ఆ విషయం తెలియజేయకుండా వొట్టి 'కలాకారుడు'గా వుండి పోవడం నాకు ఇష్టం లేకపోయింది. అందువల్ల నొకరోజు ధైర్యం చేసి ప్రేమా వాళ్లింటి బాల్కనీ మీద సోఫాలో కూర్చుని

"ప్రేం! నీ కోసం నేను ఎన్నిత్యాగాలు చేసేనో నీకు తెలుసు. మా నాన్నగారు చూస్తే ఇంట్లోంచి తగిలేస్తారని తెలిసికూడా డబ్బు ఎలా ఖర్చు పెట్టేనో తెల్సు. పెంట్లాలు ఎంత ఇరుగ్గా కుటిస్తున్నానో ఆ పెంట్లని వాడడంలో ఎంత కష్టము ఖర్చు పెడుతున్నానో తెలుసు. ఎల్విస్, కిల్ క్లిఫ్ రిచర్డ్ డోరిస్‌డే... వీళ్లందరి పాటలూ రాబర్ట్స్, హోల్స్, హంట్... వీళ్లందరి రికార్డులూ



జీవిత చరిత్రలూ ఎంత కష్టపడి కంఠతా పెట్టేనో నీకు తెలుసు. ఇంకా మరెన్నెన్ని త్యాగాలు చేసేను నీకు తెలుసు...తెలుసు ప్రేం! అందుకే ఇన్ని త్యాగాలూ చేసేను. నా పెంట్లాలు చూసి, అందరూ కిళ్ల బిబ్బంటున్నా, నా వ్యవహారం చూసి కొలీగ్ చెందు తున్నా, మానాన్నగారు మొన్న మనం చూసిన సినిమాలో హీరోయిన్నాన్నలాగ కోపంగా బెదిరిస్తూ వుత్తరాలు రాస్తున్నా..నేను మారలేదు. ఇదంతా నీ కోసం ప్రేం! నిన్ను నేను మనస్ఫూర్తిగా ప్రేమిం చేను. ప్రేమిస్తున్నాను.." అని ప్రేమతో అన్నాను. అని కళ్లు మూసుకొని సోఫాలో చేరబడ్డాను.

ప్రేమ లేచి నిలబడిన శబ్దం అయింది. మరి కాస్సేపటికి రికార్డ్ ప్లేయర్ చేసిన శబ్దంఅయింది. ఏదో ఇంగ్లీషు పాట కంగారుగా కడుపులో తిప్పిన వాడు పాడినట్టుగా వినిపించ నారంభించింది. ఆ తర వాత ప్రేమ గొంతుక వినిపించింది. "కిషన్! నువ్వెన్ని త్యాగాలు చేసేనో ననుకున్నావా? ఇవన్నీ త్యాగాలా? యు ఆర్ ఎ ఫూల్! మోడర్న్‌సొసైటీలో బతకడానికి, ప్రిలిమినరీ రైట్స్ ! ప్రథమ హక్కులు........ ఐనా ప్రేమిస్తున్నానంటున్నావు కనక, నాడెసిషన్ త్వరలోనే చెప్తాను ' అంది ప్రేమ.

నేను ఆలోచిస్తూ లేచి వచ్చేసేను.



ఆమర్నాడు నే వెళ్లేసరికి చెవి దగ్గర ట్రాన్సి స్టర్ పెట్టుకుని, ప్రేమ కూర్చునివుంది. మాట్లాడ వద్దని నాకు సంజ్ఞ చేసింది. "ట్రాన్సిస్టర్ సొండు ఎక్కువ పెట్టుకోవచ్చుకదా? చెవి దగ్గరెందుకు ప్రేం? బ్రహ్మ చెముడు వాళ్లలాగ?" అని నేను ఆమె సంజ్ఞని పట్టించుకోకుండా జోకు వేసేను. ఆ జోకుకి ప్రేమకి చాలా కోపం వచ్చిందని, ఆమె కళ్లద్వారా నేను పసిగట్టేను. ఆమె గభాలున ట్రాన్సి స్టర్ కిందపెట్టి, "కామెంటరీ వింటున్నాను. నీ జోకు నా మొహంలా వుంది" అని గభాలున మళ్లీ ట్రాన్సిస్టరు చెవిదగ్గర పెట్టుకుంది "అంత బావుందా? ' అందామనుకుని, మరి పాతజోకని మానేసేను.

ఆ తరవాత ఎంత సేపటికీ ట్రాన్సిస్టర్‌ని ఆమె దించకపోవడంతో నేను చదువుకుందామని వచ్చే సేను.

* * *

ఆ తరవాత నేను చదువు గొడవల్లోపడి వారం రోజులు ప్రేమని కలియలేదు. ఎనిమిదోరోజున నాకు లోకల్‌గా ఒక కవరొచ్చింది. తీస్తే అందు లోంచి తెల్లని కాగితం వచ్చింది. ఆ కాగితంలోని చదివేస్సేను.

కిషన్,

నువు చేసినవి త్యాగాలుకావని చెప్పేను. గుర్తుందా? నువు నన్ను ప్రేమిస్తున్నావని నా కిదివరకే తెలుసు. కాని నేను ప్రేమించడానికి నీ నాలెడ్జి చాలదు కిషన్. నువు నేర్చుకున్నవన్నీ మనిషికి తెలియడం అవసరం. అందువల్ల నేను నిన్ను మోడర్నైజు చేయగలిగేనేకాని, ప్రేమించ లేకపోయేను. నువు , నేననుకున్న స్టాండర్డ్‌కి ఎదగ లేదు. అందుచేత నేను నిన్ను ప్రేమించి, ఫ్యూచర్‌ని తెలుగు సినిమా పాటలాగ చేసికోలేను. అంతే సంగతి.

ప్రేమ.

అని వుందా కాగితంలో.

నేనది చదివి 'షాక్' తిన్నాను. మంచి నీళ్లు తాగి, బట్టలు వేసుకొని గబ గబా జగన్ దగ్గరికి పరిగెత్తేను. అతన్ని కలిసి,

"నా కిష్టం లేకపోయినా, నే నెన్ని త్యాగాలు చేసేనో విన్నావా? లేకపోతే, ఏమీ తెలియనిఇంగ్లీషు పాటలు, ఆ క్రికెట్టు, ఈ గొట్టాం పేంట్లు, ఇవన్నీ నా కెందుకు చెప్పు. అస లివన్నీ నా కెంత బోరో నీకు తెలుసుకదా? ' అని అతనితో అన్నాను.

జగన్ సిగరెట్టు వెలిగించి, పొగతో నవ్వి,"ప్రేమ క్రికెట్టు ఆటలాటిది నాయనా. నువ్వెన్ని త్యాగాలు సెంచరీలు కొట్టినా, ఒక్క రికెట్టుతో నువ్వు అవుటవక తప్పదు. ఆ కెప్టు సరి...... ఇదే ప్రేమలో ఫిలాసఫీ" అన్నాడు

నేను తల పట్టుకుని, ఆ తరవాత జగన్‌చెయ్యి పట్టుకొని హోటల్‌వేపు నడచేను. ●



మారుతి

ఊరు మాటు మణిగింది. చూరులోనించి బాణాకర్ర అందుకుని బయటకు నడిచాడు పాపారావు. కుక్కపిల్లలు కాళ్ళకు చుట్టుకుని 'కుయ్యోకుయ్యో' మన్నయి. కాళ్ళతో వాటిని విదిలించాడు. ఒకటి రెండు పిల్లలు ఎగిరి అంతదూరానపడి లేచి ఒళ్ళు దులుపుకుని మళ్ళీ అతనివేపే వచ్చినయి.

కాని పాపారావు నడక వేగాన్ని అందుకోలేక కొంత దూరం వచ్చి ఆగిపోయినయి. బనీను జేబులోనుంచి బీడీతీసి నోట్లో పెట్టుకుని అగ్గిపుల్ల వెలిగించాడు. గాలికి ఆరిపోయింది. యింకో పుల్లగీసి బీడీ వెలిగించుకున్నాడు. అడుగులు జోరుగా పడుతున్నయి.

ఒక గుడిశముందు ఆగాడు పాపారావు. అగ్గి దగ్గాడు. ఆ సవ్వడికి జవాబుగా గుడిశలోనుంచి రెండు ముంతలు పట్టుకుని ఈరన్నబయటకి వచ్చాడు.

ఆ ముంతలు చూస్తూనే అన్నాడు పాపారావు. "వద్దు ఈరన్నా! యియ్యాల పేణం బాగులేదు" అని.

"ఏం కత!" అడిగాడు ఈరన్న.

"కత ఏంలేదుగాని, గురువులుగాని యిటు వచ్చాడా!" అని అడిగాడు పాపారావు.

రాలేదన్నాడు ఈరన్న. ముంతలు లోపలికి తీసుకెళ్ళబోతుంటే పాపారావు కోరికను అదుపులో పెట్టుకోలేకపోయాడు.

"సరేలే!" అన్నాడు.

ఈరన్న నవ్వుకుంటూ వెనక్కి తిరిగి రెండు ముంతలూ పాపారావుకు అందించాడు. ముంతలు రెండు గుటకల్లో ఖాళీ చేశాడు. రూపాయి కాయితాలు ఈరన్న చేతిలో పెట్టాడు.

"యియ్యాల అయిపో వయిపో తేల్చుకోవాలి" అనుకున్నాడు పాపారావు.

"ఎవురిదో!" ఈరన్న కుతూహలంగా అడిగాడు.

"యిదుగో ఈరన్నా! నీ నోట్లో నువ్వుగింజ నానదు. అన్ని సంగతులూ నీకే కావాలి. కాటికి కాళ్ళు చాచుకున్న నీకు యింత యావ యెందుకు రన్నా! నీ యాపారం నువ్వుచూసుకో!" అని పాపారావు అక్కడినుంచి కదిలాడు.

"ఆడి బుర్ర రామకీర్తన పాడిస్తా! ఒక్కయేటుకు రెండు చెక్కలు అవ్వాలి! గిలగిలా తన్నుకుంటూ పేణాలు వదలాల! సచ్చిపోయేటప్పుడు, ఆ చావు దెబ్బ. కొట్టిందెవరో తెలుసుకుని మరీ సచ్చిపోవాల! అప్పుడుగాని గోదారి పొంగులాంటి తన పగ సల్లారదు. నీతి, జాతిలేని మనిసి! డబ్బుండగానే సరిపోద్దా! పానిది సంపాయిత్తంది డబ్బు. దొంగసారా అమ్ముకుని ఈరన్నా సంపాయిత్తన్నాడు వందల కొందలు......మనిసై పుట్టినాక నీతి ఉండాల! అది లేకపోయినాక కుక్కతో సమానం! అటువంటి మనుసుల్ని భూమ్మీద ఉండనీయకూడదు..... కూడదు....సుబ్బులు సంగతి తనకు తెలుసు. దాని వంటిమీద చెయ్యేయబోయినోడి చెయ్యి ఒక్క దెబ్బకు యిరిగి కిందపడాల. సుబ్బుల్నిచూసి నవ్వినవాడినోటంట రకతం కక్కించాల. సుబ్బుల్ని చూసి కన్నుగొట్టిన వాడి కళ్ళు దెబ్బకు చిట్లిపోవాల! అప్పుడుగాని, నీతిగల ఆడదాని జోలికి పోయినోడి గతి ఏమవుతుందో తెలిసిరాదు. ఆడి సావుతో లోకం కూడా తెలుసుకోవాల. ఆడికి పెళ్ళాంలేదూ! అప్పజెల్లెళ్ళులేరూ! ఆళ్ళ ఒంటిమీద పరాయి మగాడెవరయినా చెయ్యేస్తే ఆడికి ఎట్లాఅనిపిస్తది! ఏమీ అనిపించదేమో! నీతిలేనినాయాలికి ఏమీ అనిపియ్యకపోవచ్చు. ధూ! అట్టాంటిబతుకు బతికేకంటే సచ్చేది మేలు! డబ్బుతో ఎంత అవినీతి అయినా కప్పి పెట్టుకోవచ్చు. పెద్దాళ్ల లోగిళ్ళల్లో ఎన్ని అన్నేయాలు జరుగుతుంటాయో ఎవరి కెరిక! ఆళ్ళా, ఆళ్ళా ఎట్టా సచ్చినా, మాలాంటి బీదోళ్ళజోలి కెందుకు రావాల! కూలి నాలి చేసుకుని పొట్టనింపుకునే మా అమ్మలక్కలంటే యీళ్ళ కెందుకు యింత లోకువ ఆళ్ళకు డబ్బుంటే ఆళ్ళకే ఉంటదిగాని మాకేవన్నా పెడతారా! మనిసికి నీతి కావాల! ఆతర్వాతనే ఏదన్నా!"

జిల్లేడు డొంకలో నడుస్తున్న పాపారావు ఆగిపోయాడు. ఎదరగా ఎవరో వస్తున్నారు.

"నువ్వేనంటరా గురువులూ! యీయాల్టప్పుడు ఎక్కడికెళ్ళివత్తన్నా" వనడిగాడు పాపారావు.

వళ్ళు తెలీకుండా తాగి ఉన్నాడు గురువులు. వాడు చెప్పిన సమాధానం పాపారావుకు అర్థంకాలేదు. వాడి రెండు బుజాలు పట్టుకుని ఊపి "ఉశే

గురువులూ, నీ చెల్లెలిమీద చెయ్యి యెయ్య బోయాడంటరా నాయుడు. ఆడి అంతుసూడాల! నువ్వూ రారా నాతో" అన్నాడు పాపారావు.

గురువులు మంచి నిషాలో ఉన్నాడు. "నాగేస్రావు ఏవన్నాడో తెలుసా... జగమే మాయా, బతుకే మాయా .....యింతేనయా.....బతు కింతేనయా........సఫా!......దెబ్బకి ఠా.....గిలగిలా గిలగిలా తన్నుకుని.. ..."

అర్థం పర్థం లేకుండా వాగుతున్న గురువుల్ని తప్పించుకుని ముందుకు నడిచాడు పాపారావు.

'గురువులికి చెల్లెలంటే పేణం. దానికోసం తను సచ్చిపొమ్మన్నా పోతాడు. సుబ్బుల్ని తన కప్పజెప్పిన రోజున అందరి ముందరా అట్టాగంటే గొప్పకోసం అన్నాడేమో ననుకున్నా డతను. 'ఒరే పాపిగా, నా చెల్లెల్ని పువ్వుల్లోపెట్టి పూజ సేసుకోరా! దాని మనసు నొప్పించకుండా ఏలుకో! దానిమీదేరా నా పంచపేణాలు. అదేరా నాకు అమ్మయినా, నాయనయినా" అన్నాడు కళ్ళ నీళ్ళెట్టుకుంటా. ఆడికి గనక యీ సంగతి తెలిస్తే..... ఆ నాయుడి పీక నులిమేస్తాడు. గొయ్యి తీసి నిలువునా పాతేస్తాడు....కాని.....యిప్పుడు వాడు వినిపించుకునేస్థితిలో లేడు. అన్నీ మంచి గుణాలేగాని, తాగుడే వదల్లేకుండా ఉన్నాడు. తాగినా మోతాదుగా తాగడు. ముంతలు ముంతలు నీళ్ళలాగ తాగేస్తాడు. వళ్ళు స్వాధీనం తప్పేదాకా తాగుతాడు. వద్దంటే యినడు. 'దానివల్ల నేనెవ్వరికీ అపకారం చెయ్యటంలేదుగా!' అంటాడు.

పాపారావు ఆరిపోయిన బీడీముక్కను విసిరేసి యింకోటి వెలిగించాడు. డొంకదాటి పుట్టరోడ్డెక్కాడు. బురద బురదగా ఉన్నది దోవంతా. మూడురోజులనాడు కురిసినవానకు తడిసిన రోడ్డు యింకా ఆరలేదు. పక్కన తుమ్మచెట్లకిందనున్న పిచ్చిమొక్కలమీద మిణుగురు పురుగులు ఎగురుతున్నాయి. కీచురాళ్ళు గీపెడుతున్నాయి. అతని అడుగుల చప్పుడుకు బురద పాములు బెదిరి గింగిరాలు తిరిగి పంటకాలవలోకి జారిపోతున్నాయి. ఆకాశంలో చుక్కలు, వాటికడ్డంగా పరుచుకున్న పాలపుంత. చేలమీదనించి రివ్వున వస్తున్న చలిగాలి.. యివేమీ బాధించడం లేదతన్ని. లోపల అగ్గిరాచి పెట్టు మంట! క్రోధం, రోషం, పగ కుత కుత ఉడికిపోతున్నది. నాయుడి శిరస్సు వక్కలు కావాల, యీ వేడి సల్లారాల!

సుబ్బులు కళ్ళ నీళ్ళు పెట్టుకోటం సూత్తంటే తన గుండె తరుక్కుపోయింది. మనువు ఆడింతర్వాత దాని కళ్ళమ్మట తడి చూడటం యియ్యాలే! దానికి ధైర్యం చెప్పి, తెల్లారితే నరకాసురుడు సత్తాడే! అదే యాళకి నీమీద చెయ్యేసినోడి తల రెండు చేస్తానని మనసులో అనుకున్నాడు. పండక్కి తల్లిగారింటికి పంపేశాడు సుబ్బుల్ని.

'ఆడు మంచోడుగాడు. ఆడి జోలికిపోమాకు' అన్నది 'సుబ్బులు. సరేలేయే' అన్నాడు. నమ్మకం చాలనట్టు చేతులో చెయ్యి వేయించుకుని మరీ యిల్లు కదిలింది సుబ్బులు. 'దీపావళమాసవాడు నీకోసం ఎదురుసూత్తుంటా' అన్నది అతని గుండెల మీద తల ఆన్చి. సుబ్బులు తలమీద గోముగా పెదాలతో తాకాడు.

"మీ యమ్మతోచెప్పే అల్లుడొస్తున్నాడు. కోడిపలావు చెయ్యమని" అన్నాడు.

సుబ్బులు నవ్వింది. ఆ నవ్వే నాయుడిలాంటి వాళ్ళని రెచ్చగొట్టుద్ది! స్వచ్ఛమయిన వెన్నెలలాంటి నవ్వు అది. తలమీద ముద్దుపెట్టుకుని ఆమెను సాగ నంపాడు. నాసొత్తుమీద చెయ్యి వెయ్యగల మగాడా ఆ యెదవ! ఉఫ్‌న వూదితే ఎగిరిపోయే యెదవన్నర యెదవ! నీతిలేని యదవ!! పాముకి ఒక్క తలలోనేనంట యిషముండేది. డబ్బుతో మదించిపోయినోళ్ళకి వళ్ళంతా ఉంటది యిషం. ఆ యిషం ఏంటో ఒక్కదెబ్బకు దిగిపోవాల! పాపిగాడి తడాఖా తెలుసుకోవాల! మళ్ళీ జల్మలో ఏ ఆడగూతురిజోలికీ పోకుండా ఉండాల! గురువుల్నిగూడ సాయం ఉండరా అంటే నాయాల్ది, నిషామీద ఉండి.....తన మాట యినిపించుకోడేనా!.....సీదా పెంకి యదవ. కట్టపడి సంపాయిత్తాడు. దమ్మిడీ మిగల్చకుండా చిత్తుగా తాగేత్తాడు.... ఎవుడి పిచ్చి ఆడికి ఆనందమంటని బావనాయన చెప్పింది నిజమే! అత్యలుచేత్తే పాపం సుట్టుకుంటదంటగాని, మరి పగ ఎట్టా తీరాల! అన్నేయంగా ఒక పరాయి ఆడగూతురిమీద అగాయిత్తెం సేత్తే ఆ పాపం వూరికే ఎట్టాపోవాల! బాణాకర్రదెబ్బకు తల పగలాల, నెత్తురు చిమ్మాల, భూమ్మీదబొట్లు పడాల......అప్పుడు పగ సల్లారాల!

సీతమ్మోరిని సెరబట్టిన రావణాసురుణ్ణి సంపిన రాములోరికి పాపం అంటుకుందా! మరి అటువంటి పనే తనూ సేత్తే తప్పేంటి! దురమారగంగా నడిచేటోళ్ళని దురమారగంగానే బుద్ధి సెప్పాల! పాపం అంటదు......సుబ్బులిని బలవంతంగా చెరబట్టబోయిన నాయుడికి రావణాసురుడి గతే పట్టాల!

బురదలో కూరుకుపోయిన కాలికి తుమ్మముళ్ళు గావాల గుచ్చుకున్నయి. తిట్టుకుంటా ముందుకి వంగి కాలులో దిగబడిన ముల్లు వూడపెరికి కసిగా విసిరేసి ముందుకు సాగాడు.

ఎదరగా కొంతమంది లాంతర్లు పట్టుకుని పాపారావు కెదురుగా వస్తున్నారు. వాళ్ళు గొడవగా మాట్లాడుకుంటున్నారు. పాపరావు తొందరగాఅడుగు లేశాడు.

నాయుడిగారి పాలేళ్ళు, యింకా వూరి పెద్ద కాపు, చిన మునసబు, యింకా ఎవురెవురో చాలా మంది ఉన్నారా గుంపులో. పాపారాయుడి గుండెలు గుబగుబలాడినయి. పంటకాలవ కడ్డంపడి పక్కనున్న వరి చేనులో దాక్కున్నాడు. తను చేసిన పనికి నవ్వుకున్నాడు. ఏ నేరమూ చెయ్యని తను ఎందు కిట్టా దొంగలా దాక్కున్నాడు!

లాంతర్ల వెలుతురు దాటిపోయిందాకా అక్కడే నక్కి, మెల్లగా లేచి బురద రోడ్డువెంట నడిచి వూళ్ళోకి చేరుకున్నాడు.

వూరి మొదట్లో వేపచెట్టుకింద చేరిన జనం చెప్పుకునే మాటలకి పాపారావు దిమ్మరపోయాడు.

నాయుణ్ణి లాకులకి దిగువన పంటచేనుదగ్గర ఎవళ్ళో తల పగలగొట్టి చంపారు! ఎవరు కొట్టారో చూసిన వాళ్ళెవరూ లేరంట! వూరంతా గుప్పుమన్నది.

పాపారావు వడివడిగా అత్తగారింటికిపోయి చూరుకిందుగావంగి యింట్లో దూరాడు. సుబ్బులతన్నిచూసి ఆశ్చర్యపోయింది.

దగ్గరగావచ్చి అతని చేతులు తన చేతుల్లోకి తీసుకుని పరిక్షగా చూసింది. అతని చొక్కామీద రక్తం మరకలుచూసి కెవ్వున అరిచింది సుబ్బులు.

"అనుకున్నంత పనీ చేశావా!" అన్నది ఏడుస్తూ.

"ఏంటే నువ్వనేదీ!" అన్నాడేగాని పాపారావుకు తన బట్టలమీద రక్తం మరకలు ఎట్టా అయినయ్యో ఆలోచించలేకపోయాడు.

పొలంలో దాక్కుంటే ఏదయినా గుచ్చుకుందా.....కాలిలో ముల్లు లాగినప్పుడు అయిందా... ముంతలో కల్లు తాగినప్పుడయిందా.....దారిలో గురువుల్ని పట్టుకున్నప్పుడు....వాడన్నమాటలు!! ......జగమేమాయా, బతుకేమాయా..... యింతేనయా!.....సఫా.......దెబ్బకి ఠా......

చెల్లెలికి జరిగిన అవమానానికి ప్రతీకారంవాడు తీర్చుకున్నాడు! తనకా అవకాశం దక్కకుండా జేశాడు!

"సుబ్బులూ! నేను మాత్రం ఆపని చెయ్యలేదు నన్ను నమ్ము......నీ కిచ్చిన మాట నిలుపుకున్నాను" అన్నాడు పాపారావు జగమేమాయా.....బతు మాయా అని జ్ఞాపకం చేసుకుంటూ. ●









# విజయ-వాడ-విశేషాలు

వేదుల కామేశ్వరరావు

ఆంధ్రదేశం నడి బొడ్డులో అందాల నగరంగా విలసిల్లుతున్నది విజయవాడ. ఆంధ్రుల సంస్కృతికీ, నాగరికతకూ ఆటపట్టని కాదుగాని, విజయవాడకు ఏమిటో అదొక ప్రత్యేకత వుంది. ఉద్యోగం కోసం చూస్తూ వుండగా ఎవరో పుణ్యాత్ములు ఇంటర్వ్యూకి రమ్మని శుభలేఖ పంపించారు. ఈ రోజుల్లో ఇంటర్వ్యూలకు పిలుపు చాలా సులభంగా లభిస్తుంది. వాళ్ళు ఖర్చులివ్వరు గనుక. ఉద్యోగం రావడం చాలా కష్టం. ఎంతో ఖర్చుపెట్టగలిగితేకాని!

స్టేషనులో బండి ఆగింది. ప్లాట్‌ఫారాలు దాటుకొంటూ బయటకు వచ్చాను. రిక్షావాళ్లు ముట్టడించి కుశల ప్రశ్నలు వేస్తున్నారు. పందుల కొద్దీ రిక్షాలు బారులు తీర్చివున్నాయి. పూలవానలు వెయ్యరుగాని విజయవాడ వచ్చినవాళ్ళకెవరికైనా వచ్చే రిక్షావాళ్లు ఘనమైన స్వాగతం ఇస్తారు. వాళ్ళ బాధ భరించలేక గబగబావెళ్ళి ఒక రిక్షాలో కూర్చున్నాను.

"ఎక్కడికిసార్!" తొక్కుతూ ప్రశ్నించాడు రిక్షావాడు.

"సత్యనా......" ఎక్కడ్నుంచొచ్చిందో బెడ్డింగు పడిపోయిందని నా నెత్తిమీదపడింది. అంతే కూలీ ఏమీ తెలియనట్లువచ్చి బెడ్డింగు తీసుకొంటున్నాడు.

"ఏమిటయ్యా ఈ దారుణం!" అన్నాను ఉద్రేకం ఆపుకోలేక. జరిగినదానికి కనీసం విచారమైనా వెలిబుచ్చకూడదూ?

"నేనేం చేసేది? ఎనకాల రిక్షా గుద్దేసింది" అంటూ నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు కూలీ. ఆ రిక్షావాడికేసి చూశాను. వాడి రిక్షాను చిన్నకారు బారినుండి తప్పించుకోవటంలో నా కేసి చూడలేదు. అప్పటికే ఆ చిన్నకారులోని పెద్దమనిషి రెండు మూడు రిక్షాలనూ, సైకిళ్ళనూ, పాదచారుల్ని గుద్దుకొంటూ జారుకుని ముందుకు సాగిపోయాడు.

రిక్షా రయ్యమని వెళ్ళిపోతోంది. రిక్షావాడికి గోతులూ, గొప్పులూ తెలియవు. వాడి అనుభవం అలాంటిదా? బహుశా విజయవాడ మున్సిపాలిటీ కన్నా పాతదై వుండవచ్చును. ఒకచోట రోడ్డు అడ్డంగా త్రవ్వి వదిలినచోట రిక్షా కుదుపుకు ఈ వైపునుండి ఎగిరి ఆ వైపుకు పడ్డాను. ఇంకో గొయ్యిదగ్గర సీటులోంచి ఎగిరి కాళ్ళుపెట్టుకొనే "బాడీ"లో పడ్డాను. నేను పడే అవస్థతో సంబంధం లేకుండా రిక్షావాడు 'ఎక్స్‌ప్రెస్' స్పీడులో వెళ్ళిపోతున్నాడు. పైగా ఈలపాట పాడుకొంటున్నాడు!

గమ్యస్థానం చేరుకొనేటప్పటికి మృత్యువుబారినుండి అరంగుళంలోనూ కొండొకచో వెంట్రుకవాసి లోనూ ప్రాణాపాయం తప్పించుకొన్నాను. ప్రాణాలతో స్నేహితుడ్ని చూస్తాననుకోలేదు. నన్నుచూసి మా సింహాద్రి ఆశ్చర్యచకితుడయ్యాడు. నేను బ్రతికి బయటపడినందుకు కాదు. ఉత్తరమైనా వ్రాయకుండా హఠాత్తుగా అంటుకోనూ విజయవాడ వచ్చినందుకు! సింహాద్రి నా బాల్య మిత్రుడు. నన్నుచూసి వాడు జారిపడబోయినా వాడ్నిచూసి నేను జారిపడ్డాను. వాడే విజయవాడలో నాలుగు సంవత్సరాలనుంచి వుంటూన్నందుకు!

"ఎలాగైతేం! మొత్తంమీద ఉద్యోగం సంపాదిస్తున్నావు" అన్నాడు సింహాద్రి సంభాషణకు ఉపక్రమిస్తూ. ఆ సందర్భంలో వాడి పరామర్శ నాకేమీ రుచించలేదు. బియ్యంకోసం రెండు రోజుల్నుంచి క్యూలో నిలబడ్డవాడిని. "ఏమోయ్! కులాసానా?" అని అడిగినట్లుంది.

"ఈ పూట్లో కాస్త కాఫీపోస్తావా?" అంటూ సీరియస్‌గా మాటమార్చాను. "అరరే! మరచిపోయాను. పద కాస్త కాఫీ త్రాగుదాం" అంటూ బయలుదేరాడు. పక్క సెంటర్లోని హోటల్లో జొరబడ్డాం. కాఫీ ఆర్డరిచ్చాం. కాఫీ గ్లాసు పెదవికి తెచ్చి గుటకవేయబోతున్నాను. "ఉగు! ఒక్క నిమిషం" అన్నాడు సింహాద్రి. ఇక్కడ మనకు కాఫీ త్రాగటానికి కూడా అడ్డంకులేమిటి! "ఇక్కడి పద్ధతి తెలియదు గురూ! ఈ హోటలులో కాఫీ త్రాగ్గానే వక్కపొడి నోట్లో వేసుకోవాలి. లేకపోతే వాంతవుతుంది" అంటూ గబగబా బయటకువచ్చి వక్కపొడితెచ్చాడు. తరువాత తెలిసిందినాకు. విజయవాడ హోటళ్ళలో చిన్నవాళ్ళు వక్కపొడి, పెద్దవాళ్ళు నస్యమూ ఎందుకు ఎక్కువగా వాడతారో!

మా సింహాద్రి గదిలోనే కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని, స్నానం చేద్దామని తువ్వాలు కట్టుకొంటున్నాను.

"ఏంటి గురూ! స్నానమా?" అని పకపకా నవ్వుతున్నాడు సింహాద్రి.

"ఈ ఇంట్లో కుళాయిలేదు. మాతోట నీళ్ళు మనకు అందవు. సాయంత్రం పనిమనిషివస్తే మనకు నీళ్ళు తెస్తుంది" అన్నాడు.

"మరి ఇంటర్వ్యూకు ఎలా వెళ్ళను?" అని అడిగాను బాధగా.

"ఆ కూజాలో నీళ్ళున్నాయి. కాళ్ళూ, చేతులూ, ముఖం కడుక్కో. స్నానంచేసినట్లే వుంటుంది" అని సలహా. పైగా ఇక్కడ చాలామంది అలానే చేస్తారుట.

మెల్లిగా రిక్షా మాట్లాడుకొని ఇంటర్వ్యూకి బయలుదేరాను. మళ్ళీ గుండె వేగంగా కొట్టుకోవటం మొదలుపెట్టింది. రిక్షా ఒక ఫర్లాంగు కూడా వెళ్ళలేదు. "ఠస్" మని శబ్దమయింది. ఒక వస్తాదు దండకు తగులుకొని రిక్షాటైరు పంక్చరయింది. వస్తాదు ఒక్కసారి దండను చేత్తో రాసుకొని మామూలుగానే నడుస్తున్నాడు. రిక్షావాడు ఏమీ జరగనట్లే తొక్కుకు పోతున్నాడు. రిక్షావాడ్ని ఆ వస్తాదు ఏమైనా చేస్తాడేమోనని నేను

యపడ్డానుగానీ, అలాంటిదేమీ జరగలేదు. వస్తాదుకు ఈ దెబ్బ ఒక లెక్కా? ఇలాంటి దెబ్బలు ఎన్ని తింటే, అతని శరీరం గట్టిపడి, అతను ఒక వస్తాదుగా తయారయ్యాడో! అయినా ఈ రిక్షావాళ్ళకి బుద్ధిలేదు. కాని వాళ్ళుమాత్రం ఏంచేస్తారు? విజయవాడలో అందరూ రోడ్డు మధ్యగా నడుస్తారు. అలాంటి వీరప్రవృత్తి పెంచుతోంది విజయవాడ. ఎందుచేతనంటే రోడ్డుమీద నడిచేవాడు గమ్యస్థానం చేరుకొనేలోగా విజయమైనా సాధిస్తాడు. లేదా ఏ లారీక్రిందైనాపడి, వీరస్వర్గమైనా అలంకరిస్తాడు.

రిక్షా ఒక ఫర్లాంగు నడిచింది. అక్కడ రోడ్డు మధ్యగా నిలబడ్డ వ్యక్తి ఇంకో వ్యక్తిని "ఏమండీ గాంధీనగరం ఇదేనా?" అని అడుగుతున్నాడు. రెండో ఆసామీ సమాధానం ఇచ్చేలోగా నేను కూర్చొన్న రిక్షా గుద్దుకొని మొదటి ఆసామీ సడన్‌గా క్రింద పడ్డాడు. పాపం అతడు లేచి ఒళ్ళు దులుపుకొనే వరకూ రెండవ ఆసామీ అలానే వేచివుండి, ఆ తరువాత "గాంధినగరం ఇదేనండి" అని సమాధానం చెప్పాడు. మొదటి ఆసామీ "థాంక్యూ సార్" అంటూ మెల్లగా ఒళ్ళు దులుపుకొంటూ ముందుకు సాగిపోయాడు. రిక్షాక్రింద పడటం అందరికీ అలవాటే గనుక, చూసినవాళ్ళు ఆత్రుతగా వచ్చి వాళ్ళని నిలదీయరు. అంతటితో విజయవాడ పౌరులకు గౌరవ మర్యాదలు తెలియవని మనం అనుకోకూడదు.

ఇంటర్‌వ్యూకి వెళ్ళి, తిరిగి వచ్చేటప్పుడు రిక్షా ఎక్కడానికి భయపడి, నడుస్తూనే వస్తున్నాను. ఒకచోట రోడ్డుమీద డ్రయినేజికోసం కాబోలు గోతులు త్రవ్వి ఆ తరువాత ఎందుకో తదుపరి కార్యక్రమం మర్చిపోయారు. జన సమ్మర్దం ఎక్కువగానేవుంది. అంతమందిలోనూ ఎంతో ఠీవిగా చక చకా రోడ్డు మధ్యగా నడుస్తూ వెడుతున్న ఒక ముసిలావిడ కన్పించింది నాకు. ఏ రాజవంశంలోనో జన్మించివున్న ఆ వృద్ధమాత చరిత్ర పుటల్నుంచి హఠాత్తుగా జారి ఈ విజయవాడలో పడిందేమోననుకొన్నాను. ఆమె చేతిలో నాలుగు నిమ్మపళ్ళున్నాయి. బస్సుల్నీ, లారీలనూ, రిక్షాలనూ లెక్క చెయ్యకుండా ఆమె ఎంతో ఆత్రంగా గబగబా వెళ్ళిపోతోంది. కాని, రెప్పపాటుకాలంలో ఆమె కనుమరుగైపోయింది. ఆ వైపునుంచి ఓ లారీ ఖర్రుమని వచ్చి ఆవిడను తప్పించుకోలేక సడన్ బ్రేకుతో పెద్ద రొద చేసుకొంటూ ఆగిపోయింది. ఈ వైపునుంచి ఒక పెద్దకారు లారీకి దగ్గరగా ఆగిపోయింది. రెండు రిక్షాలు వేరో వైపునుంచీ వచ్చి లారీనీ, బస్సునీ గుద్దుకొన్నాయి. శత్రు సైన్యం నలువైపులా ముట్టడించినట్లు ఆ ముసిలావిడను వీళ్ళు నలుగురూ చుట్టూ ముట్టడించారు. ఈ సంఘటన చూసి రోడ్డుమీద నడుస్తున్న వాళ్ళందరూ తక్కున ఆగిపోయారు. ఈ నాలుగింటి సందునపడి ఆమె నలిగిపోయి వుంటుందనిన్నీ, ఆవింత చూద్దామనిన్నీ అందరూ అక్కడే నిలబడ్డారు. లారీవాడికీ, బస్సువాడికీ ఘర్షణ ప్రారంభమయింది. ఎవరు ముందు వెనక్కు తప్పుకోవాలి?

"ముసిలావిడ ప్రాణాలు మీ పట్టుదలకన్నా ముఖ్యం. తొందరగా మీ బళ్ళు వెనక్కు తియ్యండి నాయనలారా" అని ఒక పెద్దమనిషి వాళ్ళను సమాధానపరిచాడు. లారీ వెనక్కు జరిగింది. బస్సు కూడా కొంచెం వెనక్కు నడిచింది. విరిగిన రిక్షాలను వెనక్కు తీశారు. ఆశ్చర్యం! ఆ ముసిలావిడ అక్కడలేదు! నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

"ముసిలావిడ భలే తప్పుకొందయ్యా! ఇంకా పాపం చచ్చిపోయిందేమోననుకొన్నాను" అన్నాడు ఒక మధ్య వయస్కుడు.

"ముసిలావిడ ఎక్కడకు తప్పుకొంటుందండీ? లారీకి అడ్డంగా ఆమె దిక్కుతోచక నిలబడటం నేను కళ్ళారా చూశాను" అని నేను చూసిన సంగతి చెప్పాను.

"బహుశః బొందితో కైలాసానికి వెళ్ళిందేమో!" అన్నాడు ఒక ఆసామీ.

"ముసిలావిడ చచ్చిపోవటమా! ఏదీ, పోనీ ఎముకలైనా కన్పించవద్దూ? రక్తపు మరకలైనా లేవే! ఆవిడ ఎప్పుడో వెళ్ళిపోయివుంటుంది. అయినా ఆవిడ చచ్చిపోతే అరగంటకైనా పోలీసులు రారూ?" అంటూ దీర్ఘాలు తీస్తున్నాడు మధ్యవయస్కుడు. కేవలం విజయవాడలో జరిగే ఏక్సిడెంట్లను కన్నుల పండుగగా చూడటమే ఆయన హాబీగా పెట్టుకొన్నట్లున్నాడు. "ఆమధ్య ఇలానే ఒక కుర్రవాడు లారీక్రిందపడి చచ్చిపోయాడు. శవం లారీతో అరమైలు కొట్టుకుపోయింది. మరి, ఇక్కడ ఈ లారీ, బస్సూ, రిక్షాలూ ఇక్కడే వున్నాయిగా! ఒకవేళ ముసలమ్మ వీటిమధ్యనపడి చచ్చిపోతే కనీసం ఎముకలైనా కన్పించాలిగా!" అంటూ సూటిగా ప్రశ్నించి చుట్టూచూశాడు ఆయన. కొంత తర్జన భర్జన జరిగిన తరువాత ముసలమ్మ చావలేదని తీర్మానించారు ప్రేక్షకులు. ఏక్సిడెంటు జరిగిన తరువాత దాన్ని గురించీ, జరిగిన తీరు గురించీ చర్చించుకోవటం వాళ్ళకు బాగా అలవాటు కాబోలు.

జన సమ్మర్దం ఇంకా సర్దుకోలేదు గనుక లారీ, బస్సూ, విరిగిన రిక్షాలూ అక్కడే నిలబడవలసి వచ్చింది. లేకపోతే ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోవలసిందే! ఇంతలో లారీవాడు ముసిలావిడను తాను ప్రత్యక్షంగా చూశాననీ, అందుకే తాను సడన్ బ్రేకు వేశాననీ ఒప్పుకొన్నాడు. బస్సువాడు కూడా ఆ నగ్న సత్యాన్ని బహిరంగంగా ఒప్పుకొన్నాడు. ఒక రిక్షావాడు తన రిక్షాకు ఆమె అడ్డం వచ్చిందనీ, రిక్షా ఆమెకు బలంగా తగిలిందనీ, అందుకే రిక్షా విరిగిపోయిందనీ వాఙ్మూలం ఇచ్చాడు.




అప్పటికి ప్రేక్షకుల్లో కొంత ఆసక్తి కలిగింది. ముసిలావిడను గురించి ఎక్కువగా నేను జాలిపడ్డాను. గనుక అందరూ నా చుట్టూచేరి ఓదార్చటం మొదలుపెట్టారు.

"ఏకేమవుతుంది నాయనా! పాపం మీకీ విజయవాడకు క్రొత్త కాబోలు. ఆవిడకు ఇక్కడ రాసిపెట్టివుందేమో! ఏం చేస్తాం నాయనా. విచారించకు. కనీసం ఈ అంత్యకాలంలో శవమైనా దొరకలేదు చూడు!" అంటూ ఓదార్చటం మొదలు పెట్టాడొక ముసలాయన. ఓదార్చటంలోనూ, పరామర్శ చెయ్యటంలోనూ ఆయన ఘనాపాటీ అనీ, అందులో పెద్ద రీసెర్చి చేసివుంటాడనీ, ఆయన ముఖమే చెబుతోంది.

ఆవిడ నాకేమీ అవదని ఎట్టకేలకు మొరపెట్టుకొన్నాను. అందరూ ఒక్కసారి జావలా జారిపోయారు. ఇంకా కాసేపు అక్కడేవుంటే పోలీసులు నన్ను అనవసరమైన ప్రశ్నలతో విసిగిస్తారని భయపడి, మెల్లగా జారుకొందామని రెండడుగులు వేశాను. ఆశ్చర్యం! రెండు నిమ్మపళ్ళు కన్పించాయి రోడ్డుమీద. ఒకటి చితికిపోయింది. రెండవది చెక్కు చెదరకుండా అలానేవుంది. మిగతా రెండు నిమ్మళ్ళు ఏమైనట్టు? ఆ పళ్ళు పట్టుకొనివున్న ముసిలావిడ ఏమైనట్లు" ఇదేదో పెద్ద మిష్టరీలావుంది. ఒక్కసారి వెనక్కు తిరిగి పరామర్శల ప్రముఖునికీ, ఏక్సిడెంట్ల రీసెర్చి స్కాలర్ మధ్య వయస్కునికీ ఈ సంగతి మనవి చేశాను.

ఏక్సిడెంటు జరిగిందేమో చూద్దామని వచ్చి జరగలేదేమో ననే అనుమానంతో నిరాశ చెంది, చెదిరి పోతున్న ప్రేక్షకు లందరూ ఈ మాట విని మళ్ళీ వెనక్కు వచ్చారు. నిమ్మ పళ్ళను చూశారు. ఈసారి ఆమె చచ్చిపోయి వుంటుందని ధృవపరుచుకొని, శవం కన్పించ నందుకు విచారిస్తూ నిలబడ్డారు. ఇంతలో ఆకాశవాణి పలుకుల వలె "నా నిమ్మపళ్లు ఇంకా రెండు వుండాలి! మా అబ్బాయి నిమ్మరసం పిండనిదే మజ్జిగ పోసుకోడు. పళ్ళు

"ఏమైనట్టు?" అని విన్పించాయి. ప్రేక్షకులు ఒకళ్ళముఖాలొకరు చూసుకొంటూ వుండగా ఆ ముసలావిడ రంగస్థలం మీదకు వచ్చింది. ఆమెకు ఒంటిమీద ఎక్కడా దెబ్బలు లేవు. ఒక్క ఎముకైనా విరగలేదు. రక్తపు మరకలు లేవు. ఎప్పటి వలె అలానే ఒక మిగల ముగ్గిన పండులా వుంది.

పత్రికా విలేఖరులు మూగినట్లు ప్రేక్షకులు ఆమె చుట్టూ చేరి ప్రశ్నల వర్షం కురిపించారు. "నాయనలారా! నాకీ విజయవాడ క్రొత్త కాదు. ఇక్కడే ఏభై సంవత్సరాల నుంచి ఈ ప్రమాదాలు తప్పించుకొంటూ బ్రతికి బట్టకడుతున్నాను. ఈరోజు మా అబ్బాయి మజ్జిగలోకి నిమ్మకాయ రసం వెయ్యకపోతే కొప్పడతాడని, నాలుగు పళ్ళు కొనుక్కొని వస్తున్నాను. ఇదిగో ఈ "సెంటరు" కు వచ్చేటప్పటికి ఒకవైపున లారీ ఒకవైపున బస్సు శరవేగంతో దూసుకు రావటం చూశాను. ప్రక్కకు తప్పుకొందామంటే లేకుండా రెండు వైపులా రెండు రిక్షాలు! ఏం చెయ్యను చెప్పండి? అదిగో చూశారా! డ్రయినేజి కోసం తవ్విన గొయ్యి? దబ్బున అందులో ఉరికాను. పైకి రావటానికి వీలుగాక కొంతదూరం ఆ డ్రయినేజి గోతుల్లోనుంచి నడుచుకుంటూ వెళ్ళి, అదిగో ఆ పై వీధిలో గోతిలోనుంచి పైకి ఎక్కాను. మన ప్రభుత్వంవారు ఈ డ్రయినేజి గోతులు పూడ్చకుండా వుండటం వల్లనే నేను బ్రతక గలిగాను." అంటూ ముగించింది ముసలావిడ.

చితకని నిమ్మపండు కూడా తీసుకొనిమళ్ళీ నడవటం ప్రారంభించింది. ఇలాంటి వీరపుంగవులనూ వీర వనితలనూ సృష్టించిన విజయవాడ చరిత్ర ప్రసిద్ధము గదా!

## విజయవాడ— విశ్వరూపం

ఇంటర్వ్యూలో నాకు ఉద్యోగం ఇచ్చేదీ లేనిదీ తెలియలేదు. నాలుగు రోజుల్లో నా అడ్రసుకు తెలియ చేస్తామన్నారు. మా సింహాద్రి గదికివెళ్ళి, సంచి పుచ్చుకొని తిరుగు ప్రయాణానికి సిద్ధమయ్యాను. సింహాద్రి బాధగా వీడ్కోలు చెప్పాడు.

వెళ్ళేటప్పుడు రిక్షా ఎక్కడం తప్పలేదు. ఒక వీధి దాటి, ఇంకో వీధిమలుపు తిరిగింది రిక్షా. ఒక సుందరాంగి అటు తిరిగి నిలబడి వుంది. వెనక వైపునుంచి చూస్తేనే ఆమె అవయవాల బిగువు, వాటి సొంపూ కళ్ళకు కట్టినట్టు కన్పిస్తోంది. 'ఏ మందాకినీ సైకత స్థలిలోనో విహరిస్తూ వుండ వలసిన రంభో, ఊర్వశియో వైతరణీ సమీపంలో దిగులుగా నిలబడ్డట్టు ఈ సుందరాంగి ఇక్కడెందుకు నిలబడింది. పాపం!' అనుకొంటున్నాను. ఆమె నా రిక్షా వైపుకు తిరిగి చూస్తోంది. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. ఆమె ముఖంలో ఎక్కడా కళ లేదు. కళ్ళు పీక్కుపోయి గుంటలు పడిపోయి వున్నాయి. ఆరిపోతున్న బ్యాటరీ లైటులా ఆమె కళ్ళు గుచ్చి గుచ్చి ఎవరికోసమో చూస్తున్నాయి. ముఖానికి అతిగా పులిమిన పౌడరు వికృతంగా ఉంది. కొద్దిగా మీసాలు కూడా వున్నట్లుంది. ఎంత బిగించినా బిగువని జాకెట్టు, దాని తాలూకు వాడిన సౌందర్యమూ, చౌక బారు నైలాను చీరలో నుంచి కొట్టొచ్చినట్లు కనబడుతూనే వుంది. "ఈ వేళ ఇక్కడేసేవేం బీటు? పోలీసోళ్ళొస్తున్నారు జాగ్రత్త" అంటూ ఓ కొంటె కుర్రవాడు ఆమెను రాసుకొంటు వెళ్ళిపోయాడు.



"పోలీసోళ్ళు నన్నేం చేస్తార్రా?" అంటోంది ఆమె.

రిక్షామీద వెడుతూ ఇవన్నీ ఎలా చూశానని మీరు అనుమాన పడుతున్నారు గదూ! సందు మలుపులో పేరుకు పోయిన మూడు లెండెడ్ల బళ్ళూ! ఒక గడ్డి లారీ, నాలుగైదు [illegible], ఏడెనిమిది రిక్షాలూ, పది పన్నెండు సైకిళ్ళు ఒక్కొక్కటే కూడ బలుక్కుంటూ వెళ్ళే వరకూ నా రిక్షాకు ముందుకు కదలడానికి దారి లేకపోయింది. గడ్డిలారి క్రింద పడబోయిన ఒక ముసలమ్మను ఎవరో గబగబా ప్రక్కకు లాగివేశారు. "ఓరి వెధవా! నా కూడు పడగొట్టావురా!' అని తిడుతోంది ఆ ముసలమ్మ. సంగతేమిటని రిక్షావాడిని అడిగాను. "తిండికి లేని రోజున ఇలానే లారీ క్రిందపడ కొంచెం దెబ్బతగుల్చుకొంటారండీ చాలా మంది. అప్పుడు లారీవాళ్ళు పదో, పాతికో ఇచ్చి వీళ్ళనూ పోలీసు వాళ్ళనూ వదిలించు కొంటారు. ఏం చెప్పను సార్! కోటివిద్యలూ కూటికొరకే!" అన్నాడు రిక్షావాడు.

స్టేషను దగ్గర రిక్షా దిగి, చుట్టూ వున్న భవనాలు చూస్తున్నాను. ఇప్పటివరకూ తన ప్రసక్తి నాకు రానందుకో ఏమో ఒక పెద్ద సైజు వరాహ స్వామిగారు ఆగ్రహంతో గుర్రుమంటూ నన్ను రాసుకొంటూ వెళ్ళిపోయారు. విజయవాడలో ఎక్కడ చూసినా సులభంగా లభ్యమయ్యే బురదను నా బట్టలనిండా చిమ్ముతూ వెళ్ళిన ఆ వరాహస్వామి వారు విజయవాడ పౌరుల ఇష్ట దైవమట! నాకు జరిగిన సన్మానానికి సిగ్గుపడుతూ ఎవరైనా చూసి నవ్వుతున్నారేమోనని చుట్టూ చూశాను. అక్కడ వున్న చాలామంది విజయవాడ పౌరులు నా అవస్థ చూశారుగాని ఎవరూ పట్టించుకోలేదు. ఎవరికీ నవ్వు రాలేదు. వాళ్ళేవో రాజకీయాలు చర్చించు కొంటున్నారట. ●

కాస్తుంటే చద్దును గదయ్యా!



# ఆడవాళ్ళదే ముందంజ!

## దిగంబర వాద్యం

కామం విశృంఖలంగావుండే స్వీడన్‌లో ఏది జరిగినా వింతలేదు. కాని ఇటీవల జరిగిన దిగంబర 'సెల్లిస్ట్' (ఫిడేల్) వాద్యం కొంత కొత్తదనాన్ని కలగజేసింది. (ఈ ఫిడేల్, వయొలిన్ జాతికి చెందిన వాద్య విశేషం. పెద్దదిగా వుంటుంది. కుర్చీలో కూర్చుని మోకాళ్ళసందునుంచుకొని వాయిస్తారు. వాయించేవారిని 'సెల్లిస్ట్స్'అంటారు) చార్లో అనే ఆమె ఒక కచేరి చేస్తానని ప్రకటించింది. మామూలు 'మాల్మోటవున్ హాలు'లోనే అయివుంటుందని అందరూ అనుకున్నారు. సుమారు అయిదు వందలమంది ప్రేక్షకులు తయారైనారు.

వేదికమీదకు వచ్చిన చార్లో చేతిలో ఒక కత్తెర మాత్రమేవుంది. అందరూ కుతూహలంగా చూడసాగారు. పత్రిక చెప్పిన విధంగా అక్కడ జరిగిన విశేషం ఇది: లోపల ధరించుకునే బట్టలవరకూ అన్నిటినీ ఆమె కత్తిరించి పారేసింది. నగ్నంగా నిలబడింది. స్వాతంత్ర్యంకోసం పోరాడే సౌందర్యాన్నంతా ఆమె ప్రదర్శించింది!

ఇలా ప్రేక్షకుల్ని ఉత్తేజితుల్నిచేసి అక్కడే వున్న తటాకంలోకి దూకింది. (తటాకం స్టేజిమీదే ఏర్పాటయివుంది.) ప్రేక్షకులు వింత అనుభూతుల్లోనుంచి తేరుకునేసరికి ఆమె మళ్లీ నీళ్లనుంచి గట్టెక్కింది. అప్పుడు కూడా శరీరంమీద ఏమీలేవు. పుట్టినప్పు డెలాంటి బట్టలు ధరించిందో ఇప్పుడూ అంతే! నీళ్లనుంచి నేలమీదకొచ్చి ఒక అనుచరుడి మీదవాలిపోయింది. ఆ తర్వాత 'సెల్లో'ను మూడు గంటలసేపు వాయించింది. ఒక్క పిట్టకూడా కదల్లేదు!

## గ-గా వెళ్లిన 'గు-గూ'

బ్రిజిట్‌బోర్డో ప్రఖ్యాత హాలీవుడ్ తార. వేళ్ల మీద లెక్కించే వాళ్లలో నాలుగో అయిదో ఆమె. ఆమె భర్తపేరు గుంటర్‌సాష్. కాని ముద్దుగా అతన్ని 'గు—గు' అని పిలుస్తుందని వినికిడి.

ఒకరోజు ఒక తమాషా జరిగింది. ఫ్రాన్సులోని ఒక రేడియో కంపెనీ ఈ 'జోక్'ను ఉపయోగించుకుని ఒక ఆట ఆడించాలనుకున్నది. "17—19" అనే పేరుతో ప్రదర్శన యిస్తున్నామని ప్రకటించి, అందుకోసం ఒకఅమ్మాయిని మాట్లాడారు. ఆమెను రేడియో కంపెనీవారు ఇంటర్వ్యూ చేసే దృశ్యమది. "ఈ సెలవుల్లో నేను కొండల మీదుండాలనుకుంటున్నాను. కాని 'గుగు' పేరిస్‌లోనే వుంటానంటున్నాడు" అన్నదామె. ఇది నిజమైన ఇంటర్వ్యూ కాదని అందరికీ తెలుసు. దృశ్యాన్ని చూస్తున్న బ్రిజెట్‌బోర్డో అందరు ఆనందించినట్లే ఆనందించింది. కాస్సేపటికి అది తన గురించే అని తెలుసుకున్నప్పుడు ఆమె ముఖం చిన్నబోయింది!

* * *

## అరుణ వాతావరణంలో ప్రేమ

తూర్పు జర్మనీకి ప్రేమ గీమ అంటే ఆట్టే పట్టవు! 'ప్రేమలోపడ్డ యువతీ యువకులు' అనే పుస్తకాన్ని 240 పేజీల్లో ముగించింది. అందులో కొన్ని లెక్కల వివరాలు ఇవి: 18 వ సంవత్సరం రాకముందే కామప్రవృత్తిలో మునిగి పోయిన బాలికలు 21 శాతం. 20 ఏళ్ళ లోపులో వున్నవారు 78 శాతంవరకు ఇటువంటి సంబంధాలు పెట్టుకొనివుంటారు. ప్రేమఅంటే అర్థవంతంగా వ్యవహరించేవారు 38 శాతం. 15 శాతంమాత్రం అదంటే పాపంగా భావిస్తారు.

పెళ్లికిముందు పతివ్రతలుగా వుండడం అనేది పాతకాలపు పద్ధతి అని 62 శాతం బాలికలు భావిస్తున్నారు 'జత దొరికే వరకునే' ఇలాంటి ప్రేమ కలాపాలు సాగుతుంటాయని 84 శాతం బాలికలన్నారు.

* * *

ఫ్రెంచి వ్యవసాయదారుని కుటుంబం ఒకటి వంశపారంపర్యంగా తమ తమ మూల ధనాన్ని పరుపు కింద దాచుకుంటూ వచ్చారు. డన్‌కిర్క్ దగ్గరగా వున్న కుటీరంలో మేడమ్ సయ్‌మన్ వాన్‌హావ్ 73 వ ఏట మరణించింది. ఆమె చాల నిరాడంబరమైన, సాత్వికమైన జీవితం గడిపింది. అనుకునే దానికన్నా తక్కువగా ఖర్చుచేసి ఆమె జీవితాన్ని వెళ్లబుచ్చింది. ఆమెచచ్చిపోయిన తర్వాత కుటీరాన్ని పోలీసులు సోదాచేయగా 450,000 డాలర్లు లభించాయి. అందులో బంగారు నాణాలు, కరెన్సీ నోట్లు ఒక టేమిటి రకరకాల ధనం వుంది. ఇదంతా అర్థాకలితో కూడబెట్టిన ధనం!

* * *

## అప్పుడప్పుడు

"పెళ్లి గురించి ఆలోచించినప్పుడు సీపి (గుల్లచేప) మీద నిమ్మరసం పిండినట్లుగా భావిస్తాను" ఫ్రెంచి గాయని జూలియెట్ గ్రెకో ఒక సంవత్సరం క్రితం అన్న మాట లివి.

"అతను నా ప్రాణంలాంటి మనిషి. నేను డబ్బునే ప్రేమిస్తానని అందరూ అనుకుంటూ వుంటారు. తక్కిన వటుల్లానే మైకేల్ కూడా పేదవాడే!" మైకేల్ పిక్కోలీని పెళ్లి చేసుకున్న నెల తిరక్కముందే ఆమె మళ్లీ ఇలా అన్నది.

* * *

## విన్నవన్నీ చెప్పింది...

ఆస్ట్రేలియాలో 'నేచర్' అనే పత్రిక ఒకటుంది. అది దిగంబరులకు ప్రత్యేకం. అది దిగంబరత్వాన్ని గురించి ఇలా చెప్పింది:

"స్త్రీలు, పురుషులు అనే భేదం లేకుండా బీచిల్లో సర్వ స్వతంత్రంగా తిరిగే మనుష్యులు ఎవరిమట్టుకు వాళ్లే ఏమీ పట్టనట్లు నిర్వికారంగా వుంటూ వుంటారు. ఆడవాళ్లకు మొగవాళ్లకి వున్న తేడా అంతా, పాదం పెద్ద చిన్న భేదాన్నిబట్టే తెలుస్తుంది. అన్నంతగా వారు ఉపేక్షించి తిరుగుతారు."

* * *

## బాలురు-బాలికలు

"ఇంగ్లీషు పిల్లవాళ్లు బొత్తిగా అధ్వాన్నం. వాళ్లలో కామాన్ని ప్రకోపంపజేసేగుణంతక్కువ—" అంటూ రష్యాలో జన్మించిన 20 ఏళ్ల 'అన్నాక్లేవ్' అనే విద్యార్థిని ఇంగ్లండులో చదువుకు స్వస్తి చెప్పేసింది.

"పూర్వం రోజుల్లో అయితే కేవలం ప్రేమను ఆధారం చేసుకుని అమెరికాకు విఫలంగా తిరిగి వచ్చిన వాళ్లు చాలా అరుదు. పెళ్లి చేసుకుని, ఆ బాదరబందీనంతా భరించేకంటే 'పార్ట్ టైమ్' గానో 'ఫుల్ టైమ్' గానో ఒక ప్రేమికుణ్ని అందుబాటులో వుంచుకోవడం మేలు" అన్నది అమెరికా జానపద గాయని జూలీ ఫెలిక్స్. (జూలీ ఫెలిక్స్ యూరప్‌లో పెద్ద పేరు మోసిన వనిత.)

—ఇనఫా





# నా విదేశయాత్ర

## జమునారమణారావు



27వ తేదీ ఉదయం ఎనిమిదిన్నరకి 'లెనిన్‌గ్రాడ్' చేరాము. అక్కడ కూడా మన ఆంధ్ర సోదరులు స్వాగతం చెప్పారు మాకు. లెనిన్‌గ్రాడ్‌లో హోటల్ చక్కగా వుంది. మామూలు ప్రకారం బ్రేక్‌ఫాస్ట్ పూర్తి కావటానికి పదికొండున్నర అయింది. మమ్మల్ని రిసీవ్ చేసుకున్న పరిశ్రమ ముఖ్యులతో సైట్ సీయింగ్‌కి బయలుదేరాం. ఊళ్లో ముఖ్యమయిన ప్రదేశాలు చూశాక, వూరికి పది మైళ్ల దూరంలో వున్న గ్రేవ్‌యార్డ్‌కి తీసుకువెళ్లారు. స్వాతంత్ర్య సమరంలో పాల్గొని, దేశం కోసం ప్రాణాలు ధార పోసిన యుద్ధవీరుల సమాధులవి. రెండెకరాల స్థలంలో నల్లటి పాలరాతితో నిర్మించిన ఆ సమాధులు కనుచూపు మేరదాకా ఆక్రమించి వున్నవి. అంతటా అవే కనిపిస్తున్నవి. ఆ నల్లరాయిని తెల్లటి మంచు కప్పివేసింది. ఎక్కడ చూసినా తెల్లగా పరచిన దూదిలా మంచు తప్ప సమాధులు మాకు పూర్తిగా కనిపించలేదు.

తిరిగి వస్తున్నపుడు తొలిసారిగా 'స్నోఫాల్' ఆరంభం అయింది. సన్నగా తెల్లగా తుప్పరలాగా మీద పడసాగింది. వాన కురుస్తుందనుకున్నాం. అది మంచు అనీ, యిపుడు పడుతున్నది చాలా తక్కువనీ, పోను పోను పెద్ద పెద్ద పువ్వుల్లా పడుతుందనీ మాతో వచ్చిన మన తెలుగు సోదరులు చెప్పారు. ఏమయినా అదే నేను మొదటిసారి చూడటం! సంతోషం పట్టలేక చిన్నపిల్లలా చప్పట్లు కొడుతూ గంతులు పెట్టాను. అప్పటికే నేను కలవరిస్తున్నా. యీ మంచు వాన ఎపుడు పడుతుందా అని! గుమ్మడి గారు, మధుగారు వాళ్లల్లరి చూసి "మన అమ్మాయికి పెళ్లి అయినా చిలిపితనం వదల్లేద"న్నారు ఒకేసారి. పక్కనున్న తెలుగు సోదరులతో గుమ్మడిగారు "మా అమ్మాయికి రెండే కోర్కెలండీ! మంచులో నడవటం, మంచి మొగుడు దొరకటం—యీ రెండు కోర్కెలూ తీరాయి" అంటూ నవ్వారు. నేనూ వారితో పాటు నవ్వేశాను.

కార్ల దగ్గరికి నడుస్తున్నాం. ఆ కాస్త దూరం నడిచేలోగా మొహం మీద మేం వేసుకున్న ఓవర్ కోట్స్ మీద బూడిద చల్లినట్టు మంచు పేరుకు పోయింది. యుద్ధంలో మరణించిన వీరుల డైరీలు, వారి పుత్తరాలు, యుద్ధరంగపు చిత్రాలు మొదలయిన వాటిని అక్కడ ఒక చిన్న మ్యూజియమ్‌లా అమర్చారు. అందులోకి వెళ్లి చూశాం. యుద్ధంలో మృతులయిన వారి ఛాయాచిత్రాలు, శిథిలాలు ఎంతో విషాదకరంగా వున్నవి. ముఖ్యంగా యుద్ధంలో ప్రాణాలు కోల్పోతూ ఒక అయిదేళ్ల పసిపాప రాసిన పుత్తరంలోని సారాంశం వింటూంటే మనసు కరిగింది. కంట నీరు తిరిగింది. చిరిగిపోయిన ఒక చిన్న కాయితంలో రష్యన్‌లో 'అమ్మా, నేను చని పోతున్నా. నన్ను చూడకుండా మీరంతా ఎక్కడ వున్నారో?' అని రాసిన ఆ పుత్తరం అతిభద్రంగా ఉంచబడింది. తెలుగు మిత్రులు దాని అర్థం చెప్పారు. యుద్ధం ముగిశాక దొరికిన శవాల్లో యీ అయిదేళ్ల పసిపాప బిగించి పట్టుకున్న పిడికిట్లో దొరికిందిట యీ లేఖ. అంతవరకూ మంచు కురిసిన ఆనందంతో వున్న నా మనసు—ఈ విషాదగాథ విన్నాక, యీ చిత్రాలు చూశాక తెలియని బాధతో నిండిపోయింది.

మార్గమధ్యంలో యింకొక చరిత్రకు సంబంధించిన చిత్రం చూశాం. ఒక ముఖ్యమయిన కూడలి స్థలంలో వంద అడుగుల ఎత్తున గుర్రాన్ని అధిరోహించి వున్న నల్లరాతి శిల్పం అది. లెనిన్‌గ్రాడ్ నగరాన్ని మొదటిసారిగా నిర్మించిన మహనీయునిది. పారిస్ లాంటి పట్టణంలా రమ్యంగా రూపొందించాలని అక్కడి ఇంజనీర్స్‌ని పిలిపించి నిర్మించిన వ్యక్తిట! (పీటర్ దిగ్రేట్.) యుద్ధం జరిగే రోజుల్లో శత్రువుల్ని ఎదిరించి పోరుతూ, అంత ఎత్తున వున్న యీ శిల్పాన్ని శత్రువుల శతఘ్నులకు ఆహుతి కాకుండా పూర్తిగా యిసుకతో కప్పి వేశారుట! అంతేకాక, యింకో విషయమూ అక్కడి వారు చెప్పారు. ఒక కొండరాయిని కొన్ని వేలమంది కూలీల చేత ఆ ప్రదేశానికి తెప్పించి, ఆ శిల్పాన్ని చెక్కించారుట. మరో చోట వేడినీళ్ల స్విమ్మింగ్‌పూల్ ఉన్నది. అందమయిన శిల్పాలు, జలయంత్రాలు—పట్టణం మధ్యలోనే ప్రవహిస్తున్న విశాలమయిన నదులు, రెండు తీరాలనూ కలిపే చక్కని బ్రిడ్జిలు—వీటన్నిటినీ చూసుకుంటూ హోటల్ చేరాం.

'అర్మిటాజ్' ప్రపంచ ప్రసిద్ధిగాంచిన మ్యూజియమ్. నాలుగున్నరకి అక్కడికి వెళ్లాం. వెళ్లాం అనటం కంటే పరుగెత్తుకు వెళ్లాం అంటే ఉచితంగా ఉంటుందేమో! మాకున్న వ్యవధి చాలా తక్కువ. రెండుగంటల్లో ఏం చూడగలం? ఆ మ్యూజియమ్‌ను విశదంగా చూడాలంటే ఒక నెలయినా పడుతుందిట! అంతటి మహత్తర వస్తుప్రదర్శనశాల.

ఈ ప్రదర్శనశాల 'కింగ్‌జార్' యొక్క రాజభవనంలో వుంచబడింది. నెలరోజులు చూడవలసిన దీన్ని రెండుగంటల్లో ఏం చూడగలం? అయినా వెళ్లాము. ముఖద్వారం దగ్గర నుంచే నిలువెత్తు పాలరాతి శిల్పాలు యిరుపక్కలా అమర్చబడి వున్నవి. నాలుగు విశాలమయిన గదులను దాటించి మమ్మల్ని ముఖ్యంగా చూడవలసిన బంగారు విభాగాన్ని చూపించటానికి తీసుకువెళ్లారు. మేం దాటిన వాటిని గదులని చెప్పే కంటే, రాజప్రాసాదాలని చెబితే బాగుంటుంది.

ముఖ్యులయిన వారికీ, ప్రభుత్వం తరఫున వచ్చిన వారికీ మాత్రం దగ్గరుండి యీ బంగారు విభాగాన్ని చూపిస్తారు. మా చేతుల్లోని హేండ్ బాగ్స్ అన్నీ బయటి వాళ్లకి అప్పచెప్పి అంతా లోపలికి వెళ్లాం. రెండువేల సంవత్సరాలకు ముందు దొరికిన బంగారం రోమన్ రాజులు ధరించిన కిరీటాలు, క్లియోపాత్రా ధరించిన కొన్ని ఆభరణాలు, కింగ్ జార్ యొక్క ఆభరణాలు, స్త్రీల ఆభరణాలు, రత్నాలు పొదిగిన వివిధరకాల ఆయుధాలు అప్పటి రాజులు వుపయోగించిన ముక్కుపొడి డబ్బీలు, రకరకాల ఆకారాలతో వజ్రాలు, రత్నాలు పొదిగినవి చూపారు. వాటి అందం చెప్పనలవికాదు. వారు 'ఫాన్సీ'గా అంటే అందంగా టేబిల్ పైన అలంకరించుకునే సామగ్రి—నెమలి ఆకారంలో, సోఫాసెట్ ఆకారంలో, పక్షి ఆకారంలో—వజ్రాలతో చేసిన వస్తువులు ఉన్నవి.

ఎక్కువగా మనకు ఆశ్చర్యం కలిగించేది ఒకటి. మనం యీనాడు ఏది అతి మోడరన్ (ఆధునికం)గా భావిస్తున్నామో, అది రెండువేల సం.రాల కిందటే వారు ఉపయోగించారు. అవి "రిస్ట్‌వాచీ"లు. ఈ రోజున మనం మెళ్లో వాచి, చేతి వేలికి వాచి, మణికట్టుకు వాచి, గొలుసు వాచి—ఎన్నో రకాల వాచీలు ధరిస్తున్నాము. వారు యివి మాత్రమేకాక వాకింగ్ స్టిక్ (చేతికర్ర)లో కూడ వాచీలు అమర్చుకున్నారు. చిన్నప్పుడు మన అమ్మమ్మలు మనకు కథలు చెప్పేవారు. 'రాజకుమారుడు బంగారు కవచం ధరించాడనీ, నవరత్నాలు పొదిగి బంగారు జీను గుర్రానికి వేశాడనీ... యిట్లాంటివి. నిజంగా అక్కడ యీ వస్తువులన్నీ ఉన్నవి. బంగారు జీను, దానిపై వజ్రాలు పొదగబడి ఉన్నవి. ఇటువంటి వివిధ వస్తుసముదాయాన్ని చూసేందుకే వున్న రెండుగంటల కాలమూ సరిపోయింది.

మూసివేసే టైము అయిందని గుర్తుచేస్తూ గణగణ గంటలు మోగాయి. బయటికి వచ్చేశాం. తిరిగి వెళ్లిపోతూ దారిలో వున్న మరికొన్నింటిని

# ప్రేమకు నిర్వచనం



"రామక్రిష్ణకు మశూచి.........." నిలువునా వణికిపోయింది రాధ. తన బావకు మశూచి— తనకు కాబోయే జీవిత సహచరునికి మశూచి! భగవాన్!! ఎంత నిర్దయుడవయ్యా. నేరంచేస్తే నేరస్థునికి శిక్ష విధిస్తున్నాడు మానవుడు. కాని, ఏ నేరంచేయని బావకు యింత పెద్ద శిక్ష విధించుట నీకున్యాయమా? నీ హృదయం మానవ హృదయంకన్నా కఠినమైనదా??

కనుకొలకులనుండి కందిన చెక్కిళ్ళ మీదుగా జాలువారే కన్నీటిని జారిపోయే పమిటతో తుడుచుకొని, తిరిగి వుత్తరం చదవటం మొదలుపెట్టింది రాధ.

...మశూచిపడి లేచినప్పటి నుండి రామకృష్ణలో చాలా మార్పు వచ్చింది. ఇదివరకులా వుత్సాహంగా వుండటంలేదు. ఏకాంతతను కోరుకుంటున్నాడు. పిచ్చిగా యేవేవో ఆలోచిస్తాడు. తెలియని బాధ యేదో ప్రవేశించింది వాడిలో. కొన్నాళ్ళు స్థలమార్పు జరిగితే వాడిలో మార్పు రాబట్టవచ్చని మానమ్మకం. అందుకే వాడ్ని విశాఖ పంపిస్తున్నారు నాన్నగారు, రెండు రోజుల్లో. నీ సాన్నిధ్యంలో వాడు తప్పకుండా మారుతాడని నా నమ్మిక.

— ఆశీస్సులతో,
మీ వదిన.

హోరున వీచే సముద్రపుగాలికి డోర్‌కర్టెన్సు పైకి లేచిపోతున్నాయి. రాధ చేతిలో వుత్తరం రెపరెపలాడింది. "బావ అందమైన ముఖం నిండా నల్లని మచ్చలు, గుంటలు.......... భగవాన్!" ఎదురుగా టేబిల్‌మీద ఫోటోలో రామక్రిష్ణ నవ్వుతున్నాడు. ఎప్పుడూ నవ్వుతూ, త్రుళ్ళుతూ వుండే బావ మూగగా తయారయ్యాడా! అందరితో కలిసి తను నవ్వుతూ నవ్వించేబావ యీనాడు యేకాంతంగా పిచ్చిగా ఆలోచిస్తున్నాడా! కుదరదు. అలా ఎన్నటికీ కుదరదు. తన బావ మునుపటి మనిషిలా కావాలి. బావ అధరాలపై ఎప్పటిలా చిరునవ్వులు చిందాలి. చిందేలా తను చేయాలి! బావ తనవాడు!! తన బావగురించి తనేమైనా చేయగలదు; స్థిర నిశ్చయానికి వచ్చినట్టు గంభీరతను పుంజుకొంది రాధ.

స్టేషన్లో, చిరునవ్వులు చిందిస్తూ తనకు స్వాగతం పల్కడానికి వచ్చిన రాధను చూచి యెంతో సంబర పడిపోయాడు రామక్రిష్ణ.

బంగారు కాంతులీనే పసుపు వన్నెగల రాధ ముఖ వర్చస్సూ, ఎన్నెన్నో వింత వింత భావాలు స్ఫురింపజేయగల ఆమె గుండ్రని అందమైన కళ్ళు, లలాటాన్ని తీర్చిదిద్దిన కుంకుమ, సన్నని నడుము, పిరుదులను జయించిన నల్లని శిరోజాలూ, "అబ్బ! దేవతా సౌందర్యాన్ని మరపించగల రూపసి రాధ. రాధ నిజంగా రాధాదేవే!!" అనుకున్న రామక్రిష్ణ చటుక్కున తన ముఖం చేతో తడుముకున్నాడు. నల్లని మచ్చలూ, గుంటలతో తన ముఖం........ తను కురూపి— రాధ ప్రక్క తను నిజంగానే

కోటిపల్లి వీర వెంకట సత్యన్నారాయణ

కురూపి. మరుక్షణంలోనే రామ క్రిష్ణ వెల వెల బోయాడు.

"బావా!" అంటూ తనకు దగ్గరగా నడచి వచ్చే రాధను చూచి, అవమానంగా, తప్పుచేసినట్టు, నేరను నిలా తలవంచుకొన్నాడు రామ క్రిష్ణ.

"విధి చేసిన విపరీతానికి మనమేం చేయగలం." అనుకుంది రాధ మనస్సులో. యోగక్షేమాలు అడిగిన తర్వాత, "రా బావా! ట్రయిన్ చాలా లేటయ్యింది. ఎప్పుడు బయలుదేరావో యేమో. ముందు యింటికి. తర్వాత మాట్లాడుకోవచ్చు." అంది రాధ.

ఏదో సిగ్గుపడుతున్నట్టు రాధ ముఖంలోకి చూడలేక పోతున్నాడు. ఏదో ఆలోచిస్తున్నట్టు రాధ ప్రక్కనే నడుస్తున్నాడు రామక్రిష్ణ. కారులో స్టీరింగ్ దగ్గర కూర్చున్న రాధ ప్రక్కనే ముభావంగా కూర్చున్నాడు రామక్రిష్ణ. కారు విశాఖ వీధుల్లోని రోడ్లపై ఎక్కుతూ దిగుతూ జర జరా దూసుకెడుతోంది. నవ్వుతూ విశేషాలు చెపుతోంది రధ. అతనిని మాత్రం ఆమె నవ్వించ లేకపోతోంది. మధ్య మధ్య రాధవేసే ప్రశ్నలకు చాల ముక్తసరిగా సమాధానం యిచ్చాడు రామక్రిష్ణ.

రోజులు వెనక్కి జారిపోతూనే వున్నాయి. రామ క్రిష్ణలో యేమాత్రం మార్పు రాబట్ట లేకపోతూంది రాధ. ఒకరోజు సాయంకాలం పార్టీకని స్నేహితు రాలింటికి వెళ్లిన రాధ, రాత్రి ఎనిమిది దాటిన తర వాత తిరిగి వచ్చింది. వస్తూనే 'బావేడీ' అని వెతుక్కుంటూ మేడమీదికి నడిచింది.

పిట్టగోడనానుకొని తదేకంగా ఆలోచిస్తున్నాడు రామక్రిష్ణ. అప్పటికే మంచు బాగా కురుస్తోంది. ఎర్రాల్ని 'వప్పు' మనిపిస్తూ చలిగాలులు వీస్తు న్నాయి. పన్నెండ్రొజులంటి వెన్నెల భూవలయాన్ని ఆక్రమించుకోలేది. సముద్రుడు మాత్రం తన ఘోష మానలేదు. వెన్నెల కాంతులకు లేచిపడే కెరటాలు పాలనురుగులా కనిపిస్తున్నాయి. దూరం ముగా లంగరు వేసిన వోడలు రంగు రంగుల దీపాల తోరణాలతో అలంకరించిన రాజభవనాల్లా కని పిస్తున్నాయి.

"బావా!" రాధ పిలుపుకు వులిక్కిపడి వెను దిరిగిన రామక్రిష్ణ, రాధ ముఖంలోకి సూటిగా చూస్తూ నిలబడి పోయాడు. సహజ సౌందర్యిణి రాధ, పాల మీగడవంటి తెల్లని టెర్లిన్ చీర, తెల్లని వెల్వెట్ చోళీలలో వెన్నెల కాంతులకు పాల రాతి విగ్రహంలా మెరిసిపోతోంది. కాని, తన రూపం......... లేదు. ఆ అందమైన విగ్రహం ప్రక్క నిలవడానికి - తగడు!! విషాదగ్రస్తంగా మారింది రామక్రిష్ణ ముఖం. కన్నులనుండి రెండు కన్నీటి బొట్లు క్రిందికి జారాయి. అతని పరి స్థితికి అదిరిపడింది రాధ.

"ఏమిటి బావా!, ఏం జరిగింది.......... ఎందుకా కన్నీరు?" అంటూ కన్నీటిని తుడవ బోయిన రాధ చేతిని, తన చేతితో పట్టుకొని "వద్దు రాధా! తుడవకు........ ఆ కన్నీళ్ళలా కారనీ, నా హృదయభారం తగ్గుతుంది." అన్నాడు రామ క్రిష్ణ.

"నీలో నువ్వే అలా బాధపడితే యెలా, అసలేం జరిగిందో చెప్పు బావా....... నేనేమైనా పొరపాటు ........"

"లేదు రాధా! నీ పొరపాటేమి లేదిందులో."

"అయినప్పుడు ని బాధేమిటో నాతో చెప్ప కూడదా? నాతో కూడా చెప్పరాని బాధ నీలో వుందా! చెప్పు బావా........... చెప్పవా" బ్రతి మాలుకుంటోంది రాధ. "నీతో చెప్పకూడనిది కాదు రాధా! అసలు యిప్పుడే కాదు ఎప్పుడూ నీతో చెప్పరాని సమస్య నాకు వుండదు! కాని, ఇప్పుడు మాత్రం నన్ను బలవంత పెట్టకు. నా మనస్సంతా వికలమై పోయింది." రెండు కళ్ళూ మూసుకొని నిలబడ్డ రామక్రిష్ణను చూచి ఎంతో జాలి పడి పోయింది రాధ.

ఎలా బావను ఓదార్చటం. ఏవిధంగా బావ మనస్తాపం పోగొట్టగలదు తను. అసలు బావ యింతగా బాధ పడటం దేనికి? అర్ధంగాని సమస్యల మధ్య మెల్లిగా రామక్రిష్ణ చేతిని పట్టుకొని "పదు బావా......... మంచు చాల ఎక్కువ పడు తోంది." అంది రాధ. అప్రయత్నంగానే రాధననుస రించాడు రామక్రిష్ణ.

రోజులు గడుస్తున్నాయి. క్షణ క్షణమూ అతని గురించే ఆలోచిస్తుంది రాధ. నిముష నిముషానికీ రామక్రిష్ణను పరిశీలిస్తూనేవుంది రాధ. ప్రతిరోజూ సాయంకాలం షికారుకని బయలుదేరి, అలా తిరిగి వచ్చేవారిద్దరూ. రాధ బలవంతంమీదే రామక్రిష్ణ బయటికి వచ్చేవాడు. తక్కిన సమయంలో యింట్లోనే గడిపేవాడు. ఎప్పుడు చూదామన్నా అతనిముఖంలో నవ్వు కనిపించేదికాదు. మూగగా ముభావంగా వుండే వాడు.

ఒక సాయంకాలం షికారుకని రామక్రిష్ణను బయలుదేరతీసింది రాధ. ఇద్దరూ కారుమీదవచ్చి, రామక్రిష్ణ మిషన్ దాటిన తరువాత కారు రోడ్డు పక్కనే పార్కుచేసి దిగి యిసుకలో నడచి వెళు తున్నారు. క్రిష్ణ రెండు చేతులూ వెనుకకు పెట్టు కొని మెల్లిగా నడుస్తున్నాడు. ఆమె అతని అడుగు జాడలను అనుసరిస్తోంది. ఇద్దరూ యిసుకలో ఒకరిప్రక్క ఒకరు కూర్చున్నారు.

విరిగిపడుతోన్న కెరటాలు, అ వెనుక నీలిమ వర్ణంతో నిశ్చలంగావున్న సముద్ర గర్భం. లేచిపడే కెరటాల్లో స్నానమాడే నల్లని బండలు. ఆ అపార పారావారాన్ని, మోకాళ్ళపై చుబుకాన్ని ఆనించి చూస్తోంది రాధ. పల్చని సూర్యకాంతిలో గోధుమవర్ణంతో మెరిసిపోతున్న యిసుకపై 'రాధ' అని వ్రేలితో వ్రాసాడు రామక్రిష్ణ. మెల్లిగా తల త్రిప్పి చూచిన రాధ కిలకిలా నవ్వింది. 'రాధ' అని అతను వ్రాసిన అక్షరాలు ప్రక్కనే 'క్రిష్ణ' అని తను వ్రాసింది. చటుక్కున 'క్రిష్ణ' అన్న అక్ష రాలు చేతితో చెరిపివేసాడు రామక్రిష్ణ. విస్మయంగా చూసింది రాధ.

"అదేమిటి బావా! అలా చేశావేం" బాధ ధ్వనిం చింది ఆమె స్వరంలో. "అలా వుండటానికి వీల్లేదు, రాధా."

"బావా! నీకు నేను తగనా" నిలదీసినట్టడిగింది రాధ. "నీకే నేను తగనురాధా! నీవు దేవతా స్వరూ పిణివి......... నేను కురూపిని. నీవు ఆకాశంలో.... నేను కటికి నేలమీద. నిన్ను నేను అందుకోలేను."

చిన్నగా నవ్వింది రాధ.

"అయితే నన్ను దేవతా స్వరూపిణిగా చూస్తున్నా వన్నమాట. అదృష్టవంతురాల్ని బావా! నాకు కాబోయే జీవిత భాగస్వామి నన్ను దేవతామూర్తిగా చూస్తోంటే యింతకన్నా నేను జీవితంలో కోరు కొనేది లేదు!"

"వద్దు రాధా! అంత అదృష్టాన్ని నాకు కల్పిం చకు. నీకు నేను తగను. యీ కురూపిని చేసుకొని నీవు సుఖించలేవు."

"బావా! నీలో నీవే కురూపినని కుంచించుకు పోతున్నావు. నీవు కురూపి కావు బావా! ఎన్నటికీ కావు." సహజత పుట్టిపడుతోందామె కంఠంలో.

పేలవంగా నవ్వాడు రామక్రిష్ణ.

"నేను కురూపిని కాదూ! యిలా చూడురాధా.... యీ ముఖంలో నల్లని మచ్చలూ, గుంటలూ. .... చూడురాధా! ఇప్పుడు చెప్పు.! నేను కురూపినేగా!!" వల వలా కారే కన్నీటిని తుడిచి రామక్రిష్ణ ముఖాన్ని తలనూ జాలిగా నిమురుతూ అంది రాధ:

"నా వూహలో నాకన్నా నీవే అందమైనవాడివి బావా! అయినా అందానికి అంత ప్రాధాన్యం యివ్వ కూడదు. ప్రతివాళ్ళకు వుండవలసింది మనో సౌందర్యం, కాని బాహ్య సౌందర్యంకాదు." చెదిరిన అతని ముంగురులను సవరిస్తోంది రాధ.

మరునాడు ఉదయం, ఇంజనీరింగ్ కాలేజీలో తన పాత స్నేహితులను కలుసుకోవడానికని వెళ్ళిన రామక్రిష్ణ ఒక క్రొత్త వ్యక్తిని వెంటబెట్టుకొని తిరిగి వచ్చాడు. చిరునవ్వుతో ఎదురు వచ్చిన రాధ క్రొత్త వ్యక్తిని చూచి జంకినట్టు ఒక అడుగు వెనక్కి వేసింది.

"రాధా! యితను నా జూనియర్, క్లోజ్ ఫ్రెండ్, పేరు రాజు." అంటూ పరిచయాలు చేశాడు రామ క్రిష్ణ. ముగ్గురూ రాధ రీడింగ్‌రూమ్‌లో కూర్చు న్నారు. రామక్రిష్ణ, రాజు ఏవి యివీ మాట్లాడు తున్నారు. రాధ ప్రేక్షకురాలిగా మిగిలిపోయింది. మధ్య మధ్య తనవేపు అదోలాచూచే రాజు చూపుల్ని రాధ గమనిస్తూనే వుంది. కాని, రామక్రిష్ణ స్నేహి తునితో చిన్నగా నవ్వి సమాధానాలు చెపు తోంటే రాధకు సంతోషమనిపిస్తుంది. కాఫీలయిన తరువాత రాజు మేట్నీకి వెళదామన్నాడు. రామ క్రిష్ణ బాధపడతాడేమోనని రాధ కూడా బయలు దేరింది. దారి పొడవునా వసపిట్టలా వాగుతున్న రాజును చూస్తే రాధకు చిరాకనిపించింది. సినిమా హాల్లో సహితం అదేగొడవ. పిక్చరు అయ్యేవరకు వోపికపట్టి బయటపడింది రాధ. రాజు హాస్టలుకు వెళిపోతానని చెప్పి వెళ్లిపోయాడు. రాధా, రామ క్రిష్ణ కాస్సేపు బీచ్‌లో తిరిగి వచ్చారు.

వీలు చిక్కినపుడల్లా రాజు వస్తూనే వున్నాడు. రాజు వస్తున్నప్పటినుండీ రామక్రిష్ణ యిదివరకటి కన్నా సంతోషంగా కనిపిస్తున్నాడు. మూగగా ముభా వంగా వుండటం లేదు. అప్పుడప్పుడు సరదాగా కబుర్లు చెపుతున్నాడు, బలవంతం లేకుండానే రాధ

# ప్రేమకు నిర్వచనం

ఎక్కడికి రమ్మన్నా వస్తున్నాడు. తనవాళ్ళు కాకపోయినా ఒక స్నేహితుని వల్లనైనా తన బావ మామూలు మనిషిలా మారుతూ, సంతోషంగా వుంటున్నందుకు ఎంతో ఆనందించింది రాధ.

రాజు ధోరణి మాత్రం రాధకు నచ్చలేదు. తనని నఖశిఖ పర్యంతం విషపు చూపులు చూస్తూ వెకిలిగా మాట్లాడే రాజు మాటలు విననట్టు వూరుకొనేది. ఒకసారి రామకృష్ణ యింట్లోలేడు, రాజు వచ్చాడు. రాధ అతనితో మామూలుగానే మాట్లాడి, మర్యాదకు కూర్చోమంది. "సినిమాకు పోదాం" అన్న అతని మాటలకు చిరాకుగా కొసలు చిట్లించి, అభ్యంతరం చెప్పింది. మరోకమారు 'రాధా' అని అతను పిలిచినందుకు నిర్ఘాంతపోయింది. "ఏమిటి యీ మనిషి చొరవ, యీతని వుద్దేశ్యమేమిటి." అనుకుంది. రాజు ప్రవర్తన చాలా అసహ్యం వేసింది రాధకు. రాజు రావటం ఆమె కిష్టంలేకపోయినా తన బావ ఎక్కడ బాధపడతాడోనని అభ్యంతరం చెప్పలేకపోయింది.

చీకటి పడింది. చీకటిని తొలగిస్తూ వెన్నెల కూడా వస్తోంది. సన్నజాజులు పళ్ళెంలో పోసుకుని మాలకట్టుకుంటూ రామకృష్ణ గదిలోనికి వచ్చింది రాధ. రామకృష్ణ కిటికీ వూచలు పట్టుకొని బయటి ప్రకృతిని చూస్తూ నిలబడి వున్నాడు. రాధ వచ్చిన గుర్తే అతనికి తెలియదు. టేబిల్ దగ్గర కూర్చుని రాధ మాలకట్టడం పూర్తిచేసి, మెల్లిగా అడుగులో అడుగువేసికొని రామకృష్ణ వెనుకగా వచ్చి, జాజిపూలదండ అతని ముఖంమీదికి పెట్టింది. సన్నజాజి పరిమళాల గుబాళింపుతో కృష్ణ వెనుతిరిగి చూచాడు. సిగ్గు తెరలమధ్య రాధ ముఖాన్ని దించుకొంది. రామకృష్ణ టేబిల్ దగ్గరకు నడచి వెళ్ళిపోయాడు. తన బావ ప్రేమతో ఆ పూలమాలను తనకురులలో తురుముతాడను కొన్న రాధ లేత హృదయం చివుక్కుమంది. నవ్వబోయిన ఆమె వదనం చిన్నబోయింది.

"రాధా!" రామకృష్ణ పిలుపుకు దగ్గరగా వచ్చింది రాధ. "రాధా! నిన్నొక విషయం అడుగాలను కొంటున్నాను." అన్నాడు. ఏమిటన్నట్టు చూసింది రాధ. "అడుగు బావా." అంది. "రాధా! నీ జీవితం సుఖమయంగా, నీ నూరేళ్ళ పంట మూడు పూవులు ఆరు కాయలుగా వెలగాలని, నీ శ్రేయస్సుకోరే వ్యక్తిగా నిన్నారాధించే భక్తునిగా చెపుతున్నాను. నన్ను వేరుగా అర్థం చేసుకోవద్దు."

అర్థంగాని ముఖం పెట్టింది రాధ.

"ఏమిటి బావా క్రొత్తగా మాట్లాడుతావు. సూటిగా చెప్పగూడదూ."

"అదేరాధా! రాజు విషయంలో నీ వుద్దేశ్యం?"

"మొదట నీకు స్నేహితుడు, నిన్నుబట్టి నాకు స్నేహితుడు. అంతే" అని సమాధాన మిచ్చింది రాధ.

"స్నేహితుడిగానే కాదు రాధా! అన్నివిధాలా రాజు నీకు సరిపోయిన వాడని, నీ అందానికి జోడీ కుదిరిన.."

"బావా!" రాధ గొంతు వణికింది. గతంలో వూహించని యిక వూహించలేని యీ విషమ పరిస్థితికి ఆమె కంపించింది. కన్నీటి చుక్కలు, ఏకధారగా చెక్కిళ్ళు మీదుగా కారి, వూపిరితోపాటు వంపులుగా లేచిపడే ఆమె వక్షాన్ని తడిపి వేస్తున్నాయి. మునుపంటితో క్రింది పెదవిని నొక్కిపెట్టి పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకొంటోంది. కన్నీటి పొరల మధ్య రామకృష్ణను చూడలేక గిరుక్కున వెనుదిరిగి బయటికి పారిపోయింది. అచేతనుడై పోయాడు రామకృష్ణ, రాధ పరిస్థితికి.

వారిద్దరి మధ్యా బరువుగా రెండు రోజులు దొర్లిపోయాయి. ఆ రెండు రోజులు రాధ రామకృష్ణకు కనిపించనే లేదు. రాధను చూడటానికి రామకృష్ణ కూడా ప్రయత్నించలేదు. పగలంతా యెక్కడెక్కడో తిరిగేవాడు చీకటిపడేటప్పటికి యింటికి చేరుకునేవాడు.

మూడోనాడు చీకటి పడిన తరువాత యింటికి తిరిగివచ్చాడు, ప్రొద్దుటే వెళ్ళిన రామకృష్ణ. తిన్నగా తన గది తలుపులు తీసికొని లోనికి వెళ్ళాడు. గదంతా చీకటిగావుంది. లైట్‌వేసి కుర్చీ, టేబిల్‌కు దగ్గరగా లాగుకొని కూర్చున్నాడు. కిటికీగుండా తెలుపు తెరలుగా వచ్చే సముద్రపుగాలికి టేబిలు మీద వున్న కాగితం, పేపరువెయిట్ క్రింద టపటప కొట్టుకొంటోంది. క్రొత్తగవున్న ఆ కాగితాన్ని చేతిలోకి తీసికొని చూచాడు. 'బావా', అని వున్న సంబోధనకు ఆశ్చర్యపోయి చదవటం మొదలు పెట్టాడు రామకృష్ణ.

బావా,

పుట్టినప్పుడే నేను నీ భార్యనని అత్తయ్య అందట. పెద్దలవాక్కు వేదవాక్కని నమ్మినేను, అది జరుగుతుందని కూడా నమ్ముతున్నాను. చిన్నతనంలో అందరి పిల్లలతో కలిసి ఆడుకొనే దాన్ని, కాని నీవు దగ్గరగ వస్తే చప్పున సిగ్గు ముంచుకొచ్చి దూరంగా పారిపోయేదాన్ని. గుర్తుందా! ఆ లేత సిగ్గెందుకో నాకు వూహ తెలిసిన తరువాత తెలిసింది. నిన్ను నా భర్తగా వూహించుకొన్నపుడు వూహాలోకపు పరిధుల్ని అధిగమించి మైకంలో పడిపోయేదాన్ని. వయస్సు వచ్చేకొలది నా వూహా జగత్తులో సింహాసనాన్నధిష్టించ గలిగావు, నాకలల్లో కాపురం చెయ్యగలిగావు. ఆ కలల్లో తీయగా, అలాగే వుండి పోతే ఎంతో బావుండునని పిస్తోంది. కాని, ఒక్క విషయం మాత్రం నిజం బావా, శారీరకంగా కాకపోయినా, మానసికంగా నీతో వ్యభిచరించాను. ఒక విధంగా నేను పతితననే చెప్పవచ్చు. గర్భగుడిలో వున్న అమ్మవారి విగ్రహాన్ని భక్తుడు రోజూ పూజించి వెళ్ళిపోతుంటాడు. ఆ భక్తుడు అమ్మవారిని పవిత్రస్థానంలో, భక్తితో పూజిస్తున్నాడు. అతని దృష్టిలో అమ్మవారు ఒక్కర్తే దేవత. కాని, అమ్మవారి దృష్టిలో అతనితోపాటు తనని ఆరాధించే భక్తు లనేకముంది. ఆ భక్తుడు అమ్మవారి కిచ్చినంత వున్నత స్థానంలో నన్ను కూర్చోపెట్టి నీవు నన్నారాధిస్తున్నావు అదే నీవు చేసిన పెద్ద పొరపాటు. అమ్మవారికీ భక్తుడికీ మధ్య వున్న సంబంధము వేరు నాకూ నీకూ మధ్య వున్న సంబంధం వేరు. రెండిటికీ కోటి యోజనాల తేడావుంది. నీ హృదయంలో వున్నతమైన స్థానాన్ని పొందగలిగాను, కాని సామాన్య దృష్టితో నన్నర్థం చేసుకోలేక పోతున్నావు. క్షణికమైన అందానికి అంత ప్రాధాన్యం యివ్వటమే నీవు చేసిన పొరపాటు. అసలు అందంగాలేనిది భగవత్ప్రసాదితమైన యీ సృష్టిలో యేదీ లేదు. రమణీయమైన యీ సృష్టిలో అణువణువూ అందమైనదే, యీ అంద చందాల తారతమ్యాలు, పెద్దలు తక్కువ మానవ దృష్టిలో మాత్రమే. అందానికి మారు పేరుగా వర్ణించే చందమామలో మచ్చలు లేవు? మచ్చని చూసినంత మాత్రాన చంద్రుని అందం తగ్గిపోయిందా? ఆ మచ్చలుండబట్టే చంద్రుని అందానికీ, తెలుపుదనానికీ మరింత ప్రాధాన్యం వచ్చింది. బావా! యిప్పటికైనా అర్థమైందా, నీ వెంటగా నన్నర్థం చేసుకున్నదీ. నీలోని ప్రతి అణువణువునూ పరిశీలించి అర్థం చేసుకోగలిగాను. కేవలం రూపాన్ని ప్రాతిపదికగా తీసుకొని నీవు నన్ను దూరంగా వుంచాలని ప్రయత్నిస్తున్నావు. నీవు నన్ను దూరంగానే వుంచి, గర్భగుడిలో వున్న అమ్మవారిని పూజించే భక్తునిగా వుండాలనుకుంటే, త్వరలోనే ఆ గుడి తలుపులు మూతబడతాయి, అమ్మవారి దర్శనం నీకు కరువవుతుంది. అమ్మవారు గర్భగుడిని భేదించుకొని నీకు కనిపించని లోకానికి వెళ్ళిపోతుంది. బావా! యిప్పుడు తొలిసారిగా నాకు కాబోయే జీవిత భాగస్వామిగా నీకు నా హృదయాన్ని అంకితం చేసుకున్నాను. ఒకరి కంకిత మిచ్చింది, యింకొకరి కంకిత మివ్వటానికి ప్రయత్నించటం లోకవిరుద్ధం. అది జరుగకూడదు. జరుగ కూడదు బావా! నీవు ప్రయత్నించినా జరుగదు. ఈ దీనురాల్ని అనుగ్రహించు బావా, సర్వం నీ కర్పించుకోవడానికి సిద్ధంగా వున్నాను. ఆ అదృష్టాన్ని నాకు కల్గజేయి బావా! కలుగజేస్తావనే అనుకుంటున్నా, ఆ ఆశతోనే మిగిలున్నా.

— నీ రాధ.

అయితే లోలోతుల గాఢంగానూ రాధ కూడా తనని ప్రేమిస్తోంది. రాధకు తను కురూపి కాదు! తన రాధకు తను శ్రీకృష్ణుడే!! గోదావరి వరదలా సుళ్ళు తిరిగి పొంగింది రామకృష్ణలో ఆనందం. "శ్రీ లక్ష్మీదేవిలా, చదువుల సరస్వతి, సౌందర్యవతి మీదు మిక్కిలి చెప్పాలంటే అమృత హృదయిని రాధ తనకు తనే తన సర్వస్వం అర్పించుకోవడానికి సిద్ధంగా వుంది. ఇంతకన్నా ఏమికావాలి. అసహనంగా రాధ మనస్సు నొప్పించాను. ఏదీ రాధ! రాధెక్కడుంది."

రెండడుగుల్లో రాధ గదిలో ప్రవేశించాడు రామకృష్ణ. గదంతా చీకటిగా వుంది. లైట్ వేశాడు. బెడ్‌మీద వెల్లికిలా పడుకునుంది రాధ. రెండు చేతులూ గుండెలమీద పెట్టుకొని అటే సుక్కు దూరంగా పడుకున్న ఆమె కన్నులనుండి కన్నీటి ధారలు చెంపలు మీదుగా కారిపోతున్నాయి.

"రాధా!" ఆమెముఖం మీదికి వంగి పిలిచాడు రామకృష్ణ. మెల్లిగా కళ్ళు విప్పిన రాధ, "బావా!" అంటూ, రామకృష్ణ కంఠాన్ని రెండు చేతులతో పట్టుకొంది. అతను ఆమె మీద వాలిపడ్డాడు, చెంపల మీదుగాజారే వెచ్చటి కన్నీటిని తుడిచివేస్తూ "నన్ను........ మన్నించు రాధా!" అన్నాడు.

నిండుగా నవ్వుతోంది రాధ వదనం. బయటినుంచి సన్నజాజి పరిమళాలు గుప్పున గుబాళించి కొట్టాయి.

"రాధా! నీకోసం సన్నజాజులు ఎదురు చూస్తున్నాయి." అన్నాడు రామకృష్ణ. ఒకరినొకరు అనుకొనే సన్నజాజి పందిరి దగ్గరకు వచ్చారు. పూలగుత్తులు కోసి రాధ పొడుగాటి కురులలో అందంగా అమర్చాడు రామకృష్ణ.

# చిత్రలహరి



"గృహలక్ష్మి" లో నాగేశ్వరరావు, భానుమతి



"మా వదిన" లో కృష్ణకుమారి, మాస్టర్ బాబు

పద్మశ్రీ వారి "ప్రాణమిత్రులు" చిత్రానికి యిటీవల పదిరోజులపాటు విశాఖపట్టణంలో అవుట్ డోర్ షూటింగ్ జరిపారు. రెండుపాటల్లు, కొన్ని దృశ్యాలు అక్కడ చిత్రీకరించారు. సుశీల పాడిన 'తలుపుతెరు, తలుపుతెరు' పాటను సావిత్రి, నాగేశ్వర రావుల మీద, ఎల్. ఆర్. ఈశ్వరి పాడిన "నువ్వు కావాలి, నువ్వే కావాలి!" పాటను గీతాంజలి, జగ్గయ్యల మీద—యారాడ హిల్స్, షిప్‌బిల్డింగ్, సము



"గొల్లభామ" లో దేవిక

ద్రం లోపల షూట్ చేశారు. హార్బరు ఆఫీసులో తీసిన కొన్ని దృశ్యాలలో గుమ్మడి, రేలంగి, చదలవాడ పైవారితో పాటు పాల్గొన్నారు. మొదటి గీతం ఆత్రేయ, రెండవది సి. నారాయణరెడ్డి రాశారు. ఇంతవరకు మొత్తం ఆరుపాటలు చిత్రీకరణ జరిపారు. మరొక్కటి మాత్రం మిగిలి వున్నది. మార్చి రెండవ వారానికి యీ చిత్రనిర్మాణం పూర్తి కాగలదని నిర్మాత శ్రీ వి. వెంకటేశ్వర్లు చెప్పారు. కాంచన రావికొండలరావు, శాంతకుమారి, గిరిజ కూడా తారాగణంలో ఉన్నారు. కథ మాటలు: ముళ్ళపూడి వెంకటరమణ, సంగీతం: కె. వి. మహాదేవన్, నృత్యాలు: తంగప్ప, కెమేరా: సెల్వరాజు కళ: కృష్ణారావు, నూరన్న. కూర్పు: ఎన్. ఎం. శంకర్, సహకార

దర్శకుడు: సి. వి. సుబ్బారావు (అబ్బి) దర్శకత్వం: పి. పుల్లయ్య బి. ఏ.

* * *

"ఆవేకళ్లు" చిత్రానికిగాను యీ మధ్య ఏ. వి. యం. స్టూడియోలో బ్రహ్మాండమయిన సెట్టు ఒకటి అద్భుతంగా రూపొందించారు కళా దర్శకుడు శ్రీ ఎ. కె. శేఖర్. దాదాపు యాభయ్ వేల రూపాయల వ్యయంతో నిర్మించబడిన యీ సెట్లో కృష్ణ, కాంచన, పద్మనాభం, గీతాంజలి మరి ముప్ఫయి మంది ఆడపిల్లలతో నాలుగు నిమిషాల పాటు వుండే ఆధునిక పాశ్చాత్య నృత్యాన్నొక దాన్ని చిత్రీకరించారు. నటీనటులకు ఉపయోగించిన కాస్ట్యూమ్స్ కూడా చాలా కొత్తగా, కళ్లు చెదిరేటంత అందంగా ఉన్నవి. తెలుగులో మున్నెన్నడూ మీరు చూడని కొన్ని కొత్త



"గోపాలుడు – భూపాలుడు" లో జయలలిత

విషయాలు యీ చిత్రంలో చూస్తారు. ఈస్ట్మన్ కలర్‌లో నిర్మించబడుతున్న యీ సాంఘికంలో రాజనాల, నాగభూషణం, జయంతి, పుష్పకుమారి, ఆనందమోహన్ యితర ముఖ్యపాత్రధారులు. రచన: డి. వి. నరసరాజు. సంగీతం: వేదా. గీతాలు: దాశరథి. కెమెరా: మారుతీరావు. సహకారదర్శకుడు: సి. వి. సత్యనారాయణ దర్శకుడు: ఏ. సి. త్రిలోక్ చందర్ ఎం.ఏ.

* * *

బి. ఆర్. పిలిమ్స్ వారు తమ తొలి ప్రయత్నంగా "మ్యూజికల్ మిస్టరీ" చిత్రాన్ని తయారు చేస్తున్నారు. ఈ చిత్రానికి సంబంధించిన ఒక గీతాన్ని యిటీవల భరణి రికార్డింగ్ థియేటర్‌లో సౌండ్ యింజనీర్ శ్రీ కోటేశ్వరరావు రికార్డ్ చేశారు. "కదలిరా జరగిపో వాలా" అనే యీ గీతం



"శభాష్ రంగా" లో ఎం. జి. ఆర్., జయలలిత



"సత్యమే జయం" లో శోభన్‌బాబు, రాజశ్రీ



"రంగులరాట్నం" లో సుకన్య, రామ్మోహన్, పుష్పవల్లి, కాకరాల

# చిత్రలహరి

ఆరుద్ర రచన. సుశీల పాడింది. సంగీత దర్శకుడు: యస్. రాజేశ్వరరావు ఆయన కుమారుడు రామ లింగేశ్వరరావు కలిసి యీ చిత్రానికి సంగీతం సమకూర్చుతున్నారు. తండ్రీ తనయుడు కలిసి చేసిన యీ పాట ఎంతో రసపుష్టితోను హృదయాలను కదలించేదిగాను ఉన్నది. 34 వాయిద్యాలను ఉపయోగించారు. యస్. వి. రంగారావు యీ చిత్రంలో ద్విపాత్రాభినయం చేస్తున్నారు. కృష్ణ, రాజశ్రీ, రామ్మోహన్, రాజ్ బాబు, చదలవాడ ముఖ్యతారాగణం. షాజహాన్, అప్పాజీ, చాణక్య శపథం, విజయనగర పతనం, మొదలయిన చక్కని చారిత్రాత్మక నవలలు ఆంధ్ర పాఠకలోకానికి అందించిన ప్రసిద్ధ నవలా రచయిత శ్రీ ప్రసాద్ యీ చిత్రానికి కథ, సంభాషణలు రాశారు. కెమెరా: యస్. యస్. లాల్, దర్శకుడు: కె. శ్రీనివాసరావు, నిర్మాణ నిర్వహణ: 'చిత్ర' నరసింహారావు నిర్మాత: బి. రామారావు.

* * *

"పూవులలో, తీవెలలో" అనే పాటను ఉదయశ్రీ పిక్చర్స్ వారి "అమాయకుడు" చిత్రానికి అమర్త్య జమున, గిరిజ, మరి 15 మంది ఆడపిల్లలతో సైకిళ్ల మీద చిత్రీకరించారు. జూలాజికల్ పార్కు, గోల్కొండ ప్రాంతాలలో 50 షాట్స్‌లో, నాలుగురోజుల్లో యీ పాటను తీశారు. కిందటి నెలలో కూడ మరొక షెడ్యూలులో పని జరిగింది. జమున, కృష్ణ నాయకీ నాయకులుగా నటిస్తున్న యీచిత్రంలో గుమ్మడి, జి. వరలక్ష్మి, అంజలీదేవి, రేలంగి, గిరిజ, కళ్యాణి యితర ముఖ్యపాత్రధారులు. రచన: రావూరి, సంగీతం: బి. శంకర్, కెమెరా, ఎం. కె. రాజా, దర్శకుడు: అడ్డాల నారాయణరావు. నిర్మాతలు: శంకరయ్య, వెంకటనర్సయ్య.

విశ్వశాంతి పిక్చర్స్ వారు భారీయెత్తున నిర్మిస్తున్న "కంచుకోట" చిత్రనిర్మాణం పూర్తి కావచ్చింది. యిన్‌డోర్‌లో పని పూర్తి అయింది. ప్రస్తుతం అవుట్‌డోర్‌లో షూటింగ్ జరుపుతున్నారు. యన్. టి. రామారావు, సావిత్రి, దేవిక, కాంతారావు, రాజనాల, ఉదయకుమార్, పద్మనాభం, వాణిశ్రీ, ధూళిపాళ, ప్రభాకరరెడ్డి, ఎల్. విజయలక్ష్మి, కాంచన, జగ్గారావు, ఆనందమోహన్, నాగయ్య, శాంతకుమారి, టి. జి. కమలాదేవి, జయశ్రీ, మున్నగువారు నటిస్తున్న యీ చిత్రానికి సంభాషణలు టి. పి. మహారథి రాశారు. సంగీతం: కె. వి. మహాదేవన్, కెమెరా: జి. కె. రాము, దర్శకుడు: సి. యస్. రావు, నిర్వహణ రాధాకృష్ణ, చిట్టిబాబు. నిర్మాత: యు. విశ్వేశ్వరరావు, బి. యస్. సి.

* * *

భరణి వారి హాస్యరస ప్రధాన సాంఘిక చిత్రం "గృహలక్ష్మి"లో పద్మశ్రీ భానుమతి, నాగేశ్వరరావు, యస్. వి. రంగారావు, పద్మనాభం, సూర్యకాంతం, రమణారెడ్డి, అల్లు రామలింగయ్య, రాజ్ బాబు, రాధాకుమారి, బుష్యేంద్రమణి మున్నగు వారు ముఖ్యపాత్రలు ధరించారు. నిర్మాణం పూర్తి చేసుకొని విడుదలకు ముస్తాబులు సంతరించుకొంటున్న యీ చిత్రానికి సంభాషణలు డి. వి. నరసరాజు రాశారు. సంగీతం: యస్. రాజేశ్వరరావు, కళ: రాజేంద్రకుమార్, కెమెరా: సి. నాగేశ్వరరావు, నిర్మాత: దర్శకుడు రామకృష్ణ.

* * *

తారకరామా పిక్చర్స్ వారి "శ్రీకృష్ణావతారం" చిత్రం యింతవరకు ఏడు రీళ్లు తయారయింది. మార్చి నుంచి మేజర్ షెడ్యూల్స్‌లో పని ప్రారంభం అవుతుంది. యన్. టి. రామారావు, దేవిక, కాంచన, సుకన్య, శోభన్‌బాబు, పద్మజ, రాజనాల, ముక్కామల, ధూళిపాళ, ప్రభాకరరెడ్డి, రామదాసు, నేమూరి రామయ్య, జ్యోతి, మున్నగు వారు నటిస్తున్నారు రచన. సముద్రాల రాఘవాచార్య, గీతాలు: సముద్రాల సి. నారాయణరెడ్డి, సంగీతం: టి. వి. రాజా, కళ: గోఖలే, కూర్పు: కందస్వామి, దర్శకుడు కమలాకర కామేశ్వరరావు నిర్మాత: ఆట్లూరి పుండరీకాక్షయ్య. యన్. టి. రామారావుగారి అబ్బాయి చిరంజీవి హరికృష్ణ యిందులో చిన్న కృష్ణునిగా నటిస్తున్నాడు.



"హంతకుని హత్య" లో కె. ఆర్. విజయ

— మోహన్ కుమార్

# పుస్తకాలు

## ఆదర్శం

సంఘ విద్రోహుల్ని శిక్షించడంలో ఆశ్రిత పక్షపాతం అడ్డురాకూడదనే ఆదర్శాన్ని నిల్పుకున్న ఆరు రంగాల 'నాటకం' ఇది. వెల రెండు రూపాయలు.

రచన: శ్రీ యస్. జోజిరెడ్డి. లతా పబ్లికేషన్స్, సికిందిరాబాద్.

## ఆరిన ఆశాజ్యోతి

ఆరు చిన్నచిన్న కథల సంపుటి. కథాసంవిధానంలో గాని, రచనలోగాని పరిపక్వత లేని ఈ ఆరుకథల రచయిత శ్రీ 'అల్లూరి'. 65 పేజీలు గల ఈపుస్తకం వెల ఎనిమిదణాలు! ప్రతులకు: అల్లూరి వెంకట నరసింహరాజా, జిల్లాపరిషద్ హైస్కూలు, లక్కవరం, ప. గో. జిల్లా.

## గోరక్ష—ఆత్మ బలిదానం....!

'గోరక్ష—ఆత్మ బలిదానం ఏలా జరిగెను' అను కరపత్రం లాంటి పుస్తకం గోవధ నిషేధానికి కార్యకారణాల్ని బోధిస్తుంది. శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారీజీ వ్యాసాలానికి శ్రీ పురాణపండ రామమూర్తిగారి వ్యాఖ్య. 24 పేజీలు గల ఈ పుస్తకం వెల అమూల్యం. ప్రకాశకులు: ఆధ్యాత్మ ప్రచారక సంఘము, గోరక్ష శాఖ, అలహాబాద్.

## ఆంధ్రభరత్ను జీవితము

శ్రీ ఆంధ్రభరత్ను దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి జీవితమును గురించిన పద్యకావ్యమిది. తేటతెనుగు పద్యాల్తో చదువనాసక్తి కలిగిస్తుంది. కృతికర్త: కవి భూషణ, శతావధాని, శ్రీ బందా రామయ్యపంతులు. 60 పేజీల పుస్తకం వెల: తెలియదు. ప్రతులకు రచయిత పేర, శ్రీరామ భవనము, విఠల్‌నగర్, చీరాలకు ప్రాయూరి.

— సీతరాజు.

## రాతిగుండెలు

నవల. రచన: శ్రీ 'అభిలాషి.'. 217 పేజీలు, వెల: రు. 5.50. మేలు ప్రతి. రు. 6. ప్రతులకు: నిర్మల శ్రీ పబ్లికేషన్స్, గన్నవరం.

జగపతి ఒక కాలేజి లెక్చరరు. ప్రమీలకు గురువు.

'ప్రేమ అంటే ఏమిటి చెప్పండి?'— అని ఈడు వచ్చిన శిష్యురాలి ప్రశ్న. ఈ ప్రశ్నకు పరీక్షలో రాసే జవాబు లాగా పెద్ద జవాబు ఇస్తాడు జగపతి.

ఇంతకీ అసలు సంగతి— ప్రమీల జగపతిని ప్రేమించింది. గట్టిగా ప్రేమించింది. పట్టుపట్టి తలిదండ్రుల్ని కూడా ఒప్పించి ప్రేమించింది.

కాని, ఏంలాభం?—

'గురువు శిష్యురాల్ని భార్యగా చేపట్టవచ్చునా?'— అని జగపతి ప్రశ్న. వచ్చునని కాస్త, కూడదని కాస్త లాజిక్కు. చివరికి — శారీరక భౌతిక సుఖాలు త్యాగం చేసిన పవిత్ర వివాహం జరుగుతుంది. అంతా కలిసి— తత్వానంద, నిత్యానంద, రమణానందాశ్రమానికి వెళ్ళిపోతారు. ఈ నవలలో మనకి ఎదురయ్యే మరో త్యాగి— వారుణి.

'ఇద్దరు, ముగ్గురు బిడ్డలు పుట్టిన తరువాత దంపతులు అన్నా చెల్లెళ్లలా ఉండాలనేది శ్రీ రామకృష్ణ పరమహంస సూక్తి.

ఇప్పుడీ నవలలో ఇటువంటిదే మరొక కొత్త భావన గోచరిస్తుంది. పవిత్ర ప్రేమ— దివ్య దాంపత్యం అనే మహాపురుషులకు కూడా సాధ్యం కాని ఒక కొత్త మార్గాన్ని చూపిస్తున్నారు రచయిత్రి.

స్త్రీ పాత్రలను బాగానే పోషించి, హాయిగా నడిపించారు. ఇందువల్ల కథానాయకుడికి బల హీనతను ఆపాదించినట్టవుతుందేమో!—

భాషలో కొద్దిపాటి యాస కనిపించినా కల్పనలు, వర్ణనలు ఎక్కువ లేకుండా, రచన సాఫీగా సాగింది.

## జంఘాలశాస్త్రి ఇహలోకయాత్ర

రచన: శ్రీ అనంతం. 178 పేజీలు. వెల రు. 3. మేలుప్రతి రు. 4. ప్రచురణ: శారద ప్రచురణలు, ఏలూరు.

"అయ్యో!— తొలిచూపులోనే ప్రేమించినాను."

'మిథ్యావైరాగ్యతి' అన్నారు మిత్రములు.

'ఉరివేస్కో కొట్టుకొనుచున్నా' డన్నాడు, కన్న తండ్రి.

'లక్ష్మీధి కారుణవాసు, మొనకుము వియ్యమెట్లు?' అప్పుడు, ఇప్పుడున్నా.

'అష్టాధవారికి ఒక్కతెయే కూతురుగదా అని మనవాడు చేసిన పెళ్ళి' అని ఎగతాళి చేసి ఋజువుళ్ళు చేసినారు, పిట్టనివారు.

# పుస్తకాలు

—ఇదీ జంఘాల శాస్త్రి క్షాత్రలోకయాత్ర— కాదు— క్షాత్రలోకంబున నొక్కయెడ మాషచక్రి ప్రయోగము మన్నుగా తగిలిన కతంబున— కన్ను రెప్పల బరువెక్కిన తరుణంబున— పత్రంబున కంకటీ తల్పంబున నట్టె మేను వాల్చిన యవసరంబున— స్వప్నంబున జరిగిన కత— కాదు— ఒకానొక భగ్న ప్రేమికుని వెత.

జంఘాలశాస్త్రి అనగానే శ్రీ పానుగంటివారు గుర్తుకు వస్తారు. సాక్షి ఉపన్యాసాలలో మనల్ని పలకరించి, ఉర్రూతలూగించిన జంఘాల శాస్త్రి దివినుంచి భువికి దిగివచ్చి చెప్పిన విశేషాలే ఈ క్షాత్రలోక యాత్ర.

హైస్కూలు వార్షికోత్సవములలో.....— సంపాదకులకు లేఖ— ప్రయాణ వైభవము— కవి సన్మానము— బిరుద ప్రదానము— బి. ఇడి. ట్రయినింగు సీటు— సినిమా ప్రభావము— కళా వ్యాపారము— నిరశన వ్రతము— గాంధిజయంతి— నదీ జలములు అనే పదకొండు ఉపన్యాసాలతో జంఘాలుడు మనకు పునఃపరిచయమవుతున్నాడు.

పూర్వరంగంలో ఒకచోట— 'ఇందలి ఏ యొక భావమును ఏ ప్రత్యేక వ్యక్తిని ఏ ప్రత్యేక వర్గమును దృష్టియందిడుకొని వెక్కిరింప వ్రాసినవి కావు' అన్నారు రచయిత.

మరొకచోట— 'పానుగంటివారి రచనలపై దృష్టి ప్రసరింపజేయుటతో పాటు నేడు కూడవని నాకు తోచిన కొన్ని ధోరణులను విమర్శించుటకు నా రచన పరమార్థమని తెలిపెది' అనిన్నీ అంటున్నారు.

శ్రీ తిలక్ అన్నట్టు, శ్రీ అనంతంగారు ఇంచుమించు ఆ జంఘాలుని మాటలే అనిపించేలాగా— ఈ ఉపన్యాసాలలో కొన్ని సంస్కార యోగ్యము అయిన విషయాల్ని యుక్తియుక్తంగా విమర్శించారు.

ఈనాటి సమస్యలు కోకొల్లలు. వాటిపైన ఇలాంటి వ్యాసాలు, ఉపన్యాసాలూ ఎంతయినా పనిచేస్తాయి.

—శివకుమారి

## ప్రభుత్వ బహుమతి పొందిన పిల్లల పుస్తకం

భారత ప్రభుత్వ విద్యాశాఖ నిర్వహించిన 12 వ బాల సాహిత్యం పోటీల్లో, ఆంధ్రభాషలో శ్రీ కలుకొలను సదానంద 'బంగారు నడిచిన బాట'కు ఉత్తమ బహుమతి లభించింది. 'బంగారు నడిచిన బాట' ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైన విషయం పాఠకులకు తెలిసిందే.

సం॥

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S.Sambhu Prasad.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA



ఇ. వి. సరోజ

అందమైన ముఖ వర్చస్సునకు
ఎక్కువకాలం నిలిచే పరిమళమునకు

# రెమి ®

## టాల్కమ్ పౌడరు

**Manufacturers: REMY PERFUMS PRIVATE LIMITED,**
**263, Thambu Chetty St., Madras-1.**